The one and only Magazine devoted to Humour & Music

వెల : రూ. 10

పేజీలు 76

# హాసం

హాస్య-సంగీత పత్రిక

1-15
మార్చి
2004











ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నుండి
2002 రఘుపతి వెంకయ్య అవార్డును
అందుకుంటున్న గాయని పి.సుశీల,
2001 ఎన్.టి.ఆర్. జాతీయ పురస్కార అవార్డును
అందుకుంటున్న పి.భానుమతితో
అక్కినేని నాగేశ్వరరావు,
సి.నారాయణరెడ్డి, డి.వి.ఎస్.రాజు, తదితరులు

'హాసం'
హాస్య - సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

59





ముఖచిత్రం
'నేనున్నాను' చిత్రంలో నాగార్జున

## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం















## సంగీతం



పాటల ప్రత్యేకం
71,72, 73,74 పేజీల్లో



# శ్రోతా జనవాక్యం

డియర్ రాజా!

లాస్ట్(1-15 ఫిబ్రవరి) సంచికలో చక్రవర్తి కవిత ప్రచురించినందుకు ధన్యోస్మి.

చక్రవర్తి తన కవితను పి.బి.శ్రీనివాస్‌గారి కిచ్చారు. ఆయన రాసి చక్రవర్తి సంస్మరణ దినం రోజు నాకిచ్చారు. దస్తూరి కూడా పి.బి.శ్రీనివాస్ గారిదే.

మీరు మీ సంచికలో నాకిచ్చిన గౌరవం దక్కవలసింది పి.బి.శ్రీనివాస్ గారికి. ఏ మాత్రం అవకాశమున్నా వచ్చే సంచికలో ఆయనకు దక్కేట్టుచూడండి. 'హాసం' పాఠకుల మనస్సుల్లో ఆక్రమిస్తున్న స్థానం ఇంకా పెద్దదై సంస్కారయుతమైన జర్నలిజానికి మైలురాయి, కలికితురాయి కావాలని ఆకాంక్షిస్తున్నాను.

**- యస్.పి. బాలసుబ్రమణ్యం, చెన్నై**

ఆదివారం నాటి స్రవంతి ప్రోగ్రాంలో (తేజ టి.వి.) మీ భావాలు. మీ వెనుక ఉన్న వారి సామర్థ్యం, శక్తి, మీ ఆలోచనలు ఇలా 'హాసం' రూపంలో మా కోసం అవతరించిన గంగా సమాన పవిత్ర పత్రిక ఉద్భవ వివరాలు నన్నెంతో స్పందింప చేసాయి.సంవత్సరకాలంగా మీకు లెటర్ రాద్దామనుకుంటూనే గడిపాను ఇక ఉపేక్షించక తక్షణం రాసేలా పురికొల్పింది మీ ఇంటర్వ్యూ. ఓ సంవత్సర క్రితం బుక్ షాప్‌లో 'హాసం' చూసి కొన్నాను. ఇక ఆనాటి నుండీ ప్రతి పదిరోజులకూ ఎదురు చూపులే. మిగతా ఐదురోజులూ ఇంకా ఎప్పుడొస్తుందని ఆత్రుతతోనే గడుపుతున్నాను. నన్నింతగా ప్రభావితం చేసిన 'హాసం' పుస్తకాలు ఇంట్లో అలా పేరుకుపోతున్నా అమ్మాలని మాత్రం అనుకోవడంలేదు. మీరన్నట్లు ఏ మాత్రం టేస్టున్న వారైనా వీటిని అమ్మి తమ అమూల్య సంపదను కోల్పోరు. మానసోల్లాసానికి టానిక్ 'హాసం'. నేను ఎంతో గర్విస్తున్నాను 'హాసం' పఠితనైనందుకు. ఇంటికొచ్చిన కొందరు తిరగేసి 'చాలా బాగుందీ పత్రిక. మీది మంచి టేస్టు.' అంటూంటే గర్వంగా వుంది. నా ఫ్రెండ్సుకి కూడా కొందరికి పంపి 'చదివాక మళ్ళా నాకివ్వండి. ఇష్టమైతే మీరు వేయించుకోండి' అంటూ ఎంకరేజ్ చేస్తాను. మీరు స్రవంతి ప్రోగ్రామ్‌లో మాట్లాడుతూంటే మీతో నేరుగా మాట్లాడిన అనుభూతి కలిగింది. వెంటనే నా భావ తరంగాలు అక్షరరూపంలో మీ ముందుంచుతున్నాను.

**- సి.హెచ్. సునీతా పావన్**

మొదట్లో 'హాసం' హాస్య-సంగీత పత్రిక అని పేరును చూచి నేను కొంత ఆశ్చర్యాన్ని పొందాను. ఎందుకంటే సంగీతం, హాస్యాలకి జత పడడం అనేది విచిత్రం కదా! ఈ రెండు కోణాలని ఒకే అభిప్రాయాన్ని ఆవిష్కరింప జేయండం దాదాపు అసాధ్యం అనే నా అభిప్రాయాన్ని 'హాసం' ఛిద్రం చేసి నూరుశాతం సుసాధ్యం చేసింది. ఇంత అద్భుతంగా పత్రికని తీర్చిదిద్దడం ముదావహం. ఇక ఫిబ్రవరి సంచికలో వాగ్గేయ కారులు శ్రీఎం. చిత్తరంజన్ గారి 'లలిత సంగీతం' లో స్వర్గీయ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'శివ శివ అనరాదా' గీతాన్ని చూసి నేనెంతగానో పులకించిపోయాను. డా॥మంగళపల్లి, శ్రీమతి గోపాలరత్నం గార్ల గానంతో ఆ గీతం ఆంధ్రదేశాన్ని ఉఱ్ఱూత లూగించింది. నేటికి కూడా ఈ పాటని మేము అనేక సందర్భాలలో పాడుకుంటూ పరవశిస్తున్నాము. ఆంధ్రుని భక్తి పారవశ్యంలో ముంచెత్తిన ఆపాటని చూసి ఆనాటి జ్ఞాపకాలతో నేను ఆనంద పరవశుడ్నయాను. గానాన్ని మించిన స్వరకల్పన, ఆ రెంటిని మించిన సాహిత్యం! అత్యద్భుతమైన పాటనందించిన దేవులపల్లి, పాలగుమ్మిగార్లను తెలుగు లలిత సంగీతం ఎన్నటికి మరవలేదు. హాసానికి నాకృతజ్ఞతలు.

**-నారాయణ డి.వి.వి.ఎస్. వనపర్తి**

నేను 5నెలలుగా 'హాసం' పత్రిక తీసుకుంటున్నాను. నేను ఈ ఉత్తరం వ్రాయటానికి కారణం సినీగేయ రచయిత, భువనచంద్ర వ్రాసే కథలు చాలా బాగున్నాయి. మా అవిడే ఇంతే మరి మీ ఆవిడ అంటూ చాల మంచి కథలు వ్రాస్తున్నారు. అలాగే కరాజు కథలు కూడ చాలాచాలా బాగుంటున్నవి. ఈ సంచికలో నేను అనుకున్నట్టుగానే పెళ్ళి పుస్తకం సినిమా నవల మొదలు అయినందుకు చాలా సంతోషంగా వున్నది. లతామంగేష్కర్ జీవిత చరిత్ర ఎలా వ్రాస్తున్నారో అలాగే మన తెలుగు గాయని సుశీల గురించి కూడా జీవితచరిత్ర వ్రాస్తే బాగుంటుంది. మన తెలుగు వాళ్ళను గౌరవించినట్లు అవుతుంది

**-సి.వి.యస్. మాధవి. బాపట్ల**

16-29 ఫిబ్రవరి 2004 సంచికలో 'హ్యూమర్ బాక్స్' శీర్షికన నా జోక్స్ ప్రచురించ బడినందుకు గాను మీరు పంపిన 'సంబరం' ఆడియో సి.డి. అందినది. థ్యాంక్యూ వెరీమచ్. ఎడిటోరియల్ లో తెలియజేసినట్లు ఇటీవల వచ్చిన ఓ తెలుగు రీ-మిక్స్ అల్బం వింటుంటే (చూస్తుంటే) ఎంతో బాధ కలిగింది. మధురమైన పాత పాటల ఒరిజినాలిటిని రీ-మిక్స్‌ల పేరిట ఖూనిచేస్తూ, అభిమానుల మధురమైన స్మృతులను ఛిద్రం చేయడం సదరు వ్యక్తులకు భావ్యం కాదు. ఇహనైనా ఇలాంటి ప్రయత్నాలు చేయవద్దని వారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

**-రెడ్డి. ఎమ్మె. ఒంగోలు**

తేజా టీవి ప్రసారం చేసిన స్రవంతిలో మీ ఇంటర్వ్యూ చూశాను. మీరు ఎంత డెడికేట్ అయి చేస్తున్నారో పత్రిక చూస్తేనే తెలుస్తుంది. మీ ఇంటర్వ్యూ చూశాక ప్రతి ఒక్కరికి పత్రిక చదవాలనిపిస్తుంది. అంత క్లియర్‌గా చెప్పారు.

**- సూరేపల్లి విజయ, అజమ్‌పురా**

ఈమధ్య పాత 'హాసం' పత్రికలు చదవటం జరిగింది. ఒక పత్రికలో చిత్తరంజన్‌గారి లలిత సంగీతం శీర్షికలో రేడియోఅన్నయ్య-న్యాయపతి రాఘవరావు గారిని గూర్చి చదివి ఎంత ఆనందించానో చెప్పలేను. ఒకప్పుడు బాలలందర్ని తన ఆటవిడుపు కార్యక్రమాల ద్వారా ఉర్రూతలూగించిన రేడియోఅన్నయ్యను తెలుగు వారు పూర్తిగా మరచిపోయారనే అనుకున్నాను. మా బాల్యంలో ఆయన కార్యక్రమాలు ఎంత ఆసక్తితో విన్నామో చెప్పలేను. ఆదివారం మధ్యాహ్నం 2 గం॥ల కోసం వారమంతా కాచుకొని ఉండేవాళ్ళం. ఆయన ధారావాహికగా చెప్పిన రామాయణం ఇంకా చెవులలో మ్రోగుతోంది. రేడియో అన్నయ్య పాటలు నాకు ఇంకా కొన్ని జ్ఞాపకం ఉన్నాయి. అవి పొట్టిబావ - చిట్టిమరదలు, బుజ బుజ రేకుల పిల్లుందా, చల్లమ్మాచల్లా, మొద్దబ్బాయి చదువు, పిల్లలకే స్వాతంత్ర్యం వస్తే మొదలైనవి. ఈ పాటలను మా మనవలకు వినిపించాలని చాలా కోరికగా ఉంది.ఆ పాటలు ఎక్కడ దొరుకుతాయి?

నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు 'నాయిల్లు' సినిమాలో ఆటవిడుపు కార్యక్రమ ప్రస్తావన ఉంది.పెళ్ళిచేసి చూడు సినిమాలోని బాలనటులంతా బాలానందం పిల్లలే. వారిలో 'కందామోహన్' ప్రస్తుతం ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. 'మల్లీశ్వరి' సినిమాలో 'కవిరాజు'గా నటించింది రేడియోఅన్నయ్య అని జ్ఞాపకం. ఆయన రెండుమూడు కథలతో ఒక సినిమాకూడా తీసినట్లు జ్ఞాపకం.

**- ఎన్.వనజ. తిరుపతి**

'హాసం' చేతికి రాగానే ఏది ముందు చదవాలి? అన్న ప్రశ్న వేసుకుంటూనే 'ఆ పాటమధురం'కి వెళ్లిపోతాను. నేటికీ ఏ నాటికీ కొత్తవైన ఆ (పాత) పాటల్లోని రాజాగారి విశ్లేషణ బావుంటుంది. పాటలోని సంగీతాన్ని,సాహిత్యాన్ని రెంటినీ తూచుతూ పాటలోని గొప్పతనాన్ని ఆవిష్కరించే తీరు ఆకట్టుకుంటుంది. ఎప్పుటికప్పుడు అన్నీ బాగానే వున్నా ఈసారి (16-29 ఫిబ్రవరి) 'సీతారామకళ్యాణం' గురించి రాసింది ఇంకా బాగుందనీ చెప్పడానికే ప్రత్యేకంగా ఈలేఖ. కానరార కైలాసనివాస' లో అర్థాన్ని వివరించిన వైనం -శంకరాభరణం లక్షణాలతో వుంది! "సినీగాయకుల్లో ఘంటసాల వంటి అదృష్ట వంతులు లేరని చెప్పాలి... శ్రోతల మదిలో మెదిలేటంత పటిష్టమైన ముద్రను ఏర్పరచుకోగలిగారాయన," అన్నపేరా, రెండోపేరా రెండుసార్లు చదివాను. ఆ గంధర్వుడి గాత్రం ఏ పాటకైనా అమరత్వం కల్పిస్తుంది. పాటలోని స్వరాలు, అక్షరాలు తమ ఇంపు సొంపుల్ని ఒలికిస్తాయి. ఆ సుగాత్రుని మరొకసారి విశ్లేషించిన (శేషించిన) రాజాగారికి అభినందనలు.

**- రావి కొండలరావు, హైదరాబాద్**

సంపుటి: 3 సంచిక: 11

1-15 మార్చి 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

హాస్య-సంగీత పత్రిక

59


మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

రాజా

రిఫరెన్స్ కర్టసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ


రాష్ట్రప్రభుత్వం గతపక్షంలో ఇచ్చిన అవార్డులు సంగీతాభిమానులను సంతోషాంబుధిలో ముంచాయనడంలో అతిశయోక్తి లేదు. ముఖ్యంగా సుమధురగాయని సుశీలకు లభించిన రఘుపతి వెంకయ్య అవార్డు మనమంతా గర్వించదగినది. ఆమెను లతామంగేష్కర్‌తో పోల్చి "దక్షిణాది లతా" అనడం కద్దు. కానీ ఆ పోలిక ప్రతిభ, మాధుర్యాలకే పరిమితం అయిపోతోంది. అవార్డుల విషయంలో వారి మధ్య తేడా కొట్టొచ్చినట్టు కనబడుతోంది. లతా మంగేష్కర్ భారతరత్న పొందగా సుశీలకు పద్మశ్రీకూడా ఇవ్వకపోవడం దురదృష్టకరం. బాధాకరం.

ఆమెకు రఘుపతి వెంకయ్య అవార్డును బహూకరించి కేంద్రప్రభుత్వం పొరబాటును రాష్ట్రప్రభుత్వం కొంతవరకు సవరించిందనిపించింది. ఆంధ్రకు సంబంధించినంత వరకు అత్యున్నతమైన సినిమా అవార్డు అదేగా మరి! సంగీతవిభాగంలో ఇదివరకు సాలూరు రాజేశ్వరరావుకు ప్రదానం చేసిన ఆ అవార్డుతో మనం ఇప్పుడు సుశీలను సత్కరించుకున్నాం. ఆమె జాతీయస్థాయిలో మరిన్ని అవార్డులు తెచ్చుకోవడానికి ఇది నాంది కాబోతున్నదని ఆశిద్దాం.

ఎన్టీఆర్ ఆత్మగౌరవ పురస్కారం పొందిన ఇద్దరూ సంగీతజ్ఞులే! బహుముఖ ప్రజ్ఞావంతురాలయిన భానుమతి గాయనిగా, సంగీతదర్శకురాలిగా అజరామరమైన కీర్తిని ఆర్జించుకున్నారు. ఆమె కంఠస్వరం అనితరసాధ్యమైనది, అనుకరణకు లొంగనిది. ఆమె నటించిన సినిమాలలో సంగీతప్రధానమైనవి ఎక్కువ. ఇక ఆమె భరణీ పతాకం క్రింద నిర్మించినవైతే చెప్పనే అక్కరలేదు. లైలామజ్నూ, చక్రపాణి, విప్రనారాయణ, బాటసారి,అంతా మనమంచికే.. -ఇలా ఎన్నో సంగీతభరితచిత్రాలను నిర్మించారామె. కొన్నిటికి సంగీతదర్శకత్వం వహించారు. తన పాటలతో, అభినయంతో ఒక తరం వారికి ఆమె ఆరాధ్యదేవత అయిపోయారనడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

ఇక కన్నడ కంఠీరవ రాజకుమార్ విషయానికొస్తే ఆయన ప్రధానంగా నటుడే అయినా చక్కని గాయకుడు కూడా! ఎన్నో దశాబ్దాలపాటు పి.బి.శ్రీనివాస్ ఆయనకు ప్లేబ్యాక్ పాడేవారు. తర్వాత ఆయనే స్వయంగా పాడుకోసాగేరు. అంటే పాటల్లో నాలుగైదు మాటలు వల్లించడం కాదు. పూర్తిస్థాయిలో, క్లాసికల్ సంగీతంతో సహా పాడి గాయకుడిగా కూడా అవార్డులు గెలుచుకున్న ఘనుడాయన.

తెలుగువారి దృష్టిలో ఒకందుకు ఆయన గొప్ప అదృష్టవంతుడు. నాగేశ్వరరావు, రామారావుల అభినయంతో ఘంటసాల కంఠం ఎంత మమేకమైనా వారి తొలిగీతాలకు ఘంటసాల ప్లేబ్యాక్ పాడలేదు. కానీ రాజ్‌కుమార్ నటించిన తొలి సినిమా - కాళహస్తి మహాత్మ్యం (తెలుగు)లో ఘంటసాల ఆయన గీతాలకు నేపథ్యం పాడారు.

ఇంకొక తెలుగుగాయక ప్రముఖుడు పి.బి.శ్రీనివాస్‌తో ఆయన అనుబంధం మరింత ప్రగాఢమైనది. శ్రీనివాస్ కన్నడ సినీరంగంలో స్టార్ సింగర్‌గా వెలుగొందడానికి కారణం - రాజ్‌కుమార్‌కు ఆయన ప్లేబ్యాక్ పాడడం. కొంతకాలం తర్వాత ఆయనే స్వయంగా పాడుకోసాగినప్పుడు శ్రీనివాస్‌ను ఎవరో అడిగారు - 'ఇన్నాళ్లూ మీచే పాడించుకుని ఇప్పుడు వదిలేసినందుకు బాధగా ఉందా?' అని. 'కాదు, తను స్వయంగా అద్భుతంగా పాడగలిగి కూడా ఇన్నాళ్లూ నాచే పాడించుకున్నందుకు సంతోషంగా, గర్వంగా ఉంది.' అని అన్నారు శ్రీనివాస్. సాటి కళాకారులపై శ్రీనివాస్‌కున్న ప్రేమాభిమానాలు ఆయన గ్రంథస్తం చేస్తున్న లతా కథలో చూడవచ్చు. తన కుమార్తెకు లతా పేరు పెట్టుకున్న వీరాభిమాని ఆయన!

లతా పేరు గుర్తుకురాగానే గాయనీ గాయకుల కృషిని, ప్రాముఖ్యతను గుర్తించి వారికి కూడా అవార్డులనివ్వాలని ఆమె సలిపిన పోరాటం గుర్తుకు వస్తుంది. ఆమె పోరాటస్ఫూర్తి అందరకూ అనుసరణీయం. సంగీత విభాగంలో రీ-రికార్డింగు ఎంతో ప్రాముఖ్యతగల ప్రక్రియ అని 'హాసం' నమ్మకం. నటీనటులు పలికించలేని భావాలు కూడా నేపథ్యసంగీతం ద్వారా అందించగల సమర్థులు మనకున్నారు. ఆ యా శబ్దాలను సృష్టించడం, సొగసు చెడకుండా వాద్య సహకారంతో అందించడం ఒక ప్రత్యేకమైన కళ అని 'హాసం' ప్రగాఢ విశ్వాసం. ఈ సారి నంది అవార్డులలో 'రీరికార్డింగు' కు కూడా చోటుంటుందని ఆశిద్దాం.




HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82



ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-5**

# ఖర్మ సో & సో F.T.W.

*(Fallow the Wife)*



"ఏంవాయ్? మీ గీత రచయితలు ఇన్ని పాటలు రాస్తారు గానీ, ఆడదాని జీవితం గురించి ఒక్కపాట రాశారటోయ్? ఏ సినిమా చూసినా "కార్యేషుదాసీ" శ్లోకార్థాన్ని 'రుబ్బటం తప్ప - ఆడదాని బతుకుని అర్థం చేసుకుని ఒక్కళ్ళంటే ఒకళ్ళు మా జీవితాన్ని వివరించారోయ్? ఇన్ని సర్వేలు చేయిస్తున్న చంద్రబాబునాయుడైనా మా బతుకుల గురించి ఒక్క సర్వే చేయించాడా? పోనీ ఆ వై.యస్ ? పాదయాత్రల గొడవే కానీ 'పడతులూ- వారి కష్టాలు' etc గురించి ఒక్కసారైనా అసెంబ్లీలో గొంతెత్తి మాట్లాడాడా? ఆ వాజపాయిగారూ కలాంగారూ సరేసరి... ! బ్రహ్మచారులాయే! పోనీ ఇన్ని విజయోత్సవ సభల్లో మీ హీరోయిన్లు మాట్లాడుతారు గదా- ఒక్క హీరోయినైనా మా డైరెక్టర్ 'ఒహ్హో హ్హో హ్హో' ....మా హీరో ' ఓ హో హో'.... మా ప్రొడ్యూసరూ 'ఓహ్హో హ్హో హ్హో హ్హో హ్హో' అని పొగడ్డం తప్ప 'ఇదిగో ప్రేక్షకులారా ... ఆడదాని జీవితమంటే ఈ పిచ్చి డ్యూయెట్లు వెర్రిడైలాగులూ కాదూ..... 'ఫలానా' అని తేల్చి చెప్పిందా?" ఉదయాన్నే నన్ను నిద్రలేపి మరీ ప్రశ్నించింది మా ఆవిడ.

"సరే ఏం చెైమంటావో చెప్పు. చేస్తా" సగం నిద్రమత్తులో అన్నాను.

"హుఁ... పాటలు వ్రాయమంటే ఫటా ఫటా రాస్తావు గానీ, ఆడదాని వ్యథ ఏమిటో నేన్నీకు చెప్పాలా? అసలు మీ పురుష జాతే అంత...! పీకల మొయ్యా మింగటం... పదింటిదాకా పడు కోవటం....అంతే గానీ 'అమ్మా నీ బాధ ఏమిటీ?' అని మీ అమ్మని గానీ, అక్కా చెల్లెళ్లని గానీ.... కట్టుకున్న దాన్ని గానీ అడిగిన పాపాన పోయారా? మీ కంటే గోడమీద బల్లీ మంచంలో నల్లీ నయం...!" విసవిసా వంటింట్లోకి దూరింది మా ఆవిడ.

ఓ బల్లి 'కిచ్ కిచ్' అని అరిచింది. చూద్దును గదా తూర్పు గోడమీంచి అది నావంక 'అదో'లా చూసి తోక తిప్పింది. అది ఖచ్చితంగా ఆడబల్లేనని చెప్పగలను...

ఎందుకంటే అలాంటి 'లుక్' ఇవ్వడం ఏ మగ బల్లికీ సాధ్యంకాదు. నిద్రమత్తు పూర్తిగా వదిలింది గనక దంత ధావన కార్యక్రమం పూర్తిచేసి పేపరు పట్టుకున్నా. కాఫీ,'రపేల్స్' టేబుల్ మీద పెట్టి తనూ ఓ పేపరు తీసింది. ఈవిడ 'మూడ్' మార్చకపోతే ఇవ్వాల్టి పనులన్నీ అటకెక్కుతాయి. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తుండగా ఓ న్యూస్ ఐటమ్ కనబడింది.

"ఇదిగో సామ్రాజ్యం....మీ వూళ్ళో ఏవో ఆరాధనోత్సవాలుట..! రేపో ఎల్లుండో వెళ్ళి చూసొద్దామా?" అనునయిస్తూ అడిగా.

"హో..! రేపో ఎల్లుండోట.... ' ఇట్లాంటి కబుర్లు ఎన్నిసార్లు వినలేదూ?ఆ చంద్రమండలానికైనా తీసుకెళ్తావేమోగానీ మా వూరికెందుకు




వస్తావు? అయినా ఏ వూరెడితే మాత్రం ఏముంది? ఆడదాని బతుకులో అంటగిన్నెలూ ఆవకాయలూ తప్ప ఏముంటై?" నిర్లిప్తంగా అంది.

"అదికాదే ..! నీక్కూడా కొంచెం 'ఛేంజ్'గా వుంటుందిగా ! " కొంచెం ఉత్సాహపరిచే ప్రయత్నంచేశా.

"ఛేంజ్"..! ఎవరికీ? నీకా నాకా?" సీరియస్‌గా అంది మా ఆవిడ.

"పోనీ మనకీ...! మనిద్దరికీ ...! " మధ్యేమార్గంగా అన్నాను.

"ఏంవాయ్..! కొంపలో రోజుకి నాలుగు పూట్లా రకరకాల వంటలు లొట్టలేస్తూ మింగుతూనే మావూరు కనబడగానే 'వంకాయ పప్పు, కందా బచ్చలీ కూరా అంటూ, లిస్టు చదువుతావే! అది ఛేంజా? అందులోనూ నాకా? " దాడికి దిగింది మా ఆవిడ.

"సరేనోయ్... ఇంతకీ నీ బాధేమిటీ? చెప్పు.... తీర్చేస్తా!" పేపరు మూసి సిన్సియర్‌గా అడిగా.

"బాధా? నాకా? నాకు బాధేం వుంటుందీ? సంచుల్నిండా కూరగాయలు తెచ్చి నా నెత్తిన గుమ్మరించే మొగుడూ వగలూ రాత్రీ ఒళ్ళు విరుచుకున్నా పని పూర్తిగాని ఇల్లూ, సినిమాలూ షికార్లూ తిరిగే కొడుకూ- వాడికి తానా తందానా కొట్టే కొరివిలాంటి కోడలూ- వాళ్ళ మాటే తప్ప మన మాట వినని పనివాళ్ళూ - అబ్బో....! ఇన్ని వైభవాలుండగా అసలు బాధకి చోటెక్కడుందీ?" నన్ను నమిలి మింగేలా చూస్తూ అంది మా ఆవిడ. (కోపంగా అన్నా...; ఆవిడ అన్నమాటలన్నీ కరెక్టే! మనకి 'పాట' తప్ప 'పనిగొడవ పట్టదు')

"ఓకె. ఓకె. ..! నువ్వన్నవన్నీ నిజమే..ఈ క్షణం నుంచీ చూడు....! నిన్నెంత జాగ్రత్తగా చూసుకుంటానో!" లేచినిలబడి మరీ ప్రతిజ్ఞ చేశాను.

"ఆహా....!ఎన్నాళ్ళనించీ వింటున్నాను ఇదే మాట...! " కిసుక్కుమని నవ్వింది మా ఆవిడ.

"సరేగానీ చింతలపూడోడా..! ఒక ఆడది తన జీవితకాలంలో ఎన్ని చీపురుకట్టల్ని ఊడ్చి ఊడ్చి అరగదీస్తుందో నీగ్గానీ మీ రచయితల సంఘానికిగానీ తెలుసా? పుట్టిందగ్గర్నించి చచ్చేలోగా ఎన్ని సర్ఫుల్ని, సబీనాల్నీ బట్టలు వుతుకుతూ, అంటగిన్నెలు తోముతూ కరగదీస్తుందో తెలుసా? టోటల్‌గా ఎన్నిసార్లు కొంప సర్దుతుందో ఎన్ని టన్నుల బియ్యమూ కూరగాయలూ వండి వార్చి మీకు 'మింగ' బెడుతుందో తెలుసా? అసలే కంప్యూటరైనా లెక్కగట్టి చెప్పగలదా? 'మార్నింగ్ వాక్'అంటూ లుంగీ ఎగ్గట్టుకుని రోడ్డమీద 'బలాదూర్' తిరగటం తప్ప ఓ ఆడది కొంపలోనే రోజుకి ఎన్ని మైళ్ళు నడుస్తుందో ఏ మగాడైనా చెప్పగలడా? నువ్వుకాదు. ప్రైమ్మినిస్టరు దగ్గర్నించి పాలవాడిదాకా, చీఫ్‌మినిస్టరు దగ్గర్నించి చింతపండు అమ్మేవాడి దాకా ఎవ్వరూ చెప్పలేరు....! మా అత్తగారన్నట్టు.... ఆడదాని బతుకులో విశ్రాంతి దొరికేది రెండుసార్లే.. ఒకటి అమ్మకడుపులో వున్నప్పుడూ.. రెండోది స్మశానంలో తగలడ్డప్పుడు! " వేదనగా అంది నా పెళ్ళాం.(నిజమేగామరి!)

"సారీ...! నువ్వు చెప్పింది నిజమే.! మా అమ్మకూడా ఇలాగే బాధపడేది ...! అంతెందుకు! మీ చెల్లెళ్ళూ, మా అక్కలూ, వదినలూ అందరూ ఇలాగే బాధపడుతున్నారు..! అసలు.... అసలేం చెయ్యాలంటే.... " ఏం మాట్లాడాలో తెలీక బుర్ర గోక్కున్నాను. (పెళ్ళాంతో 'ఫైట్' చెయ్యడమే నాకు సరిగ్గారాదు.. అనునయించడం అనే విద్య ఎలా తెలుస్తుంది?.)

"చాల్లే..! పై కెళ్ళి పాటరాసుకో " నవ్వేసి లేచింది మా ఆవిడ.

'అమ్మయ్య...! పాపం పైకేదో అంటుందిగానీ నేనంటే చచ్చేంతప్రేమ' అని మనసులో అనుకుని మేడెక్కేసరికి కాలింగ్ బెల్ మోగింది. మళ్ళీ కిందకి దిగి తలుపుతీద్దును గదా - కోడలు ఆటోవాడికి డబ్బులిస్తూ కనబడింది. (మావాడ్ని ఒంటరిగా విడిచి ఎప్పుడూ రాదు...! వచ్చిందంటే ఏదో 'లడాయి' వ్యవహారమే!)

'రామ్మా' అంటూ పిలిచా.

"వస్తున్నా మామయ్యగారు..! అత్తయ్య ఎక్కడా?" అడుగుతూనే వంటింట్లో మా ఆవిడ దగ్గరి కెళ్ళింది. గలగలా హడావిడి చేసే కోడలు ముభావంగా ఇంట్లో కొచ్చిందంటే... పెద్దగొడవే అయ్యుండాలి. ఎంక్వయిరీ చేద్దామనుకున్నా గానీ - మళ్ళీ ఎక్కడ ఇరుక్కుంటానో అని పైకెళ్ళా.

అరగంట తరువాత మా ఆవిడ పిలిస్తే కిందకి వెళ్ళా..!

కోడలి కళ్ళు ఏడ్చి ఏడ్చి ఎర్రగా వున్నై. మా ఆవిడ సైలెంటుగా కూర్చునివుంది.

"ఏమ్మా ఏమయింది?"కోడల్నడిగా.

"తనేం చెబుతుందీ? నేను చెబుతా విను! మనవాడు మళ్ళీ 'మగాడై' పోయాడు. వాళ్ళ అమ్మా అమ్మమ్మా ఇరవై నాలుగ్గంటలూ వండి



వార్చినా విసుక్కోలేదట. ఈవిడ మాత్రం టీ.వి. సీరియల్స్ తెగ చూస్తూ మొగుడ్ని పట్టించుకోవడం మానేసిందిట. గ్రైండర్లూ మిక్సీలూ, ఫ్రిజ్జులూ కొని తప్పుచేశాట్ట. ఇవాళ పొట్టుపొయ్యో కుంపటో తీసుకొచ్చి కొంపలో పడేస్తాట్ట. దాంతో వండగలిగితే వండు... లేకపోతే ఫో అన్నాట్ట అదీకథ". సీరియస్‌గా అంది మా ఆవిడ.

"అదికాదు మావయ్యగారూ ...! నిన్న మీ అబ్బాయిగారి ఫ్రెండ్స్, ఫ్రెండ్స్ పెళ్ళాలూ వచ్చారు. టైము పదకొండయింది. కొట్లుమూసేస్తారు గదా! అప్పటికప్పుడు అందరికీ వంట చెయ్యాలంటే ఎలా కుదురుతుంది? ఇంట్లో అంతమందికి సరిపోయే కూరగాయల్లేవు.... ఆ గ్యాస్ బండి వాళ్ళకి రోజూ ఫోన్ చేస్తున్నా వాళ్ళింకా సిలిండర్ పంపలేదు. పోనీ కుక్కరు పెడదామన్నా 'గ్యాస్' మధ్యలో అయిపోతే ఏం కావాలి? అందుకే హోటల్నుంచి తెప్పించమన్నాను. అదే తప్పయింది. మాట్లాడకుండా వాళ్ళందర్నీ హోటల్‌కి తీసుకెళ్ళి పీకల మెయ్యా తినిపించి రాత్రి ఒంటిగంటకి ఇంటికొచ్చారు. వచ్చిందగ్గర్నించీ సణుగుడే సణుగుడు ... ఫ్రెండ్స్ ముందర ఆయన ప్రిస్టేజిపోయిందట...ఇందులో అసలు నా తప్పేమయినా వుందా?" దీనంగా అడిగింది కోడలు.

"అదీ...మరేమో...అసలూ .... అప్పుడూ ఏం చెయ్యాలంటే....." బుర్ర గోక్కున్నా....(తరువాతేం మాట్లాడితే బాగుంటుందో నాకు తోచలేదు.)

"ఏం చెయ్యాలా? మగ పీనుగుల్నందర్నీ ఎండలో పడేసి మాడ బెట్టాలి..! వస్తాడుగా...! చెబుతా"చర్రున లేచింది మా ఆవిడ.

నేను కాసేపు అటూఇటూ పచార్లు చేసి, అత్తాకోడళ్ళు నన్ను గమనించట్లేదని నిర్ణయించుకున్నాక మెల్లగా మేడ మెట్లెక్కి ఆఫీసురూంలో బైఠాయించా. మెల్లగా 'సెల్' తీసుకుని మా వాడికి ఫోన్ కొట్టా (ఉప్పందించా..). ఆమాత్రం చెయ్యకపోతే ఎలాగ? ఏం మాట్లాడాలో తనూ ప్రిపేరవటం మంచిదిగా !




పావుగంటలో బండి దిగాడు మావాడు. శబ్దం విని నేను కిందికి దిగాను.

"బాగానే ఉప్పందించావు వాడికి! ఏరా? ప్రిపేరయ్యే వచ్చావన్నమాట?ఏం చెబుతావో చెప్పు " సీరియస్‌గా అంది మా ఆవిడ.

"అది కాదమ్మా...నిన్నా మొన్నా ఒకటే పచ్చడి చేసింది. వంకాయ కూరే వారానికి మూడుసార్లు వొండుతుంది. నేను బయటకి పోగానే నిద్ర.. ఇంటికొచ్చాక వంట మొదలెడుతుంది. అప్పటికీ రెండు నెల్లు సైలెంటుగా వున్నా. ఆమధ్య మేమిద్దరం మా ఫ్రెండ్స్ ఇంటికి వెడితే వాళ్ళు డిన్నరిచ్చారు. మరివాళ్ళు మనింటికొస్తే వండఖ్ఖర్లేదా? నిన్ననే చెప్పాను. అదేమాట అడిగితే మరిచిపోయా నంటుంది. ఏం రాచకార్యాలు వెలగ బెడుతోందిట? పనిమనిషి చేత పొద్దునే కూరలు తెప్పించొచ్చుగా? 'గ్యాస్ బండి' సంగతెత్తింది. ఫ్లాట్ల వాళ్ళందరికీ యీవిడ చేసే సేవలు చూస్తే కళ్ళు తిరిగిపడతావు. నెలకి రెండు సార్లు మూడుసార్లు వాళ్ళింట్లో గ్యాస్ అయిపోయింది. వీళ్ళింట్లో కిరోసిన్ అయిపోయింది అని వంటచేసి పంపిస్తుంది. అలాంటిది ఒక్కపూట ఎవరో ఒకరింట్లో మన కుక్కరు పెట్టిరావచ్చుగా? ప్రతిపూట వచ్చి పంచదారో, కాఫీ పొడో, టమాటో, నా తలకాయో అన్నీ అప్పు తీసుకు పోతూంటారు. తిరిగి చస్తే వాళ్ళివ్వరూ. ఈవిడ అడగదు..! కరెంటుపోతే నేనే కనుక్కోవాలి, ఫోన్ డెడ్ అయితే నేనే కనుక్కోవాలి.. కరెంటు బిల్లులూ వాటర్ బిల్లులూ నేనే కట్టాలి. ఏ బల్బుపోయినా ఏ మీటర్ పాడయిపోయినా నేనే టెక్నిషియన్ని తీసుకురావాలి. అన్నీ నేనే, ఈవిడేం చేస్తుంది. పొద్దున్నే లేవంగానే ఆ వెధవ ఫోనులో తన ఫ్రెండ్సుతో మాట్లాడం తప్ప...ఏం చేస్తుంది. ఉన్నది ఇద్దరం. ఇద్దరికి వంటచెయ్యాలంటే పట్టే టైమెంత? అదీకాక ఆ పనిమనిషి ఒకటి. దాన్ని నెత్తిమీదకెక్కించుకొని 'సొల్లు' వాగటం తప్ప ఏంచేస్తోందో నీ కోడల్నీ అడుగు. చికాకు పుట్టి ఓ చిన్న మాటంటే వెంటనే పంపుతిప్పి కుండల కొద్దీ కన్నీళ్ళు కారుస్తుంది. దాంతో నీకేమో జాలిపుట్టి నన్నే తిడతావు..! ఇక నావల్లకాదు.. ఇంటి సంగతీ నా సంగతీ పట్టించుకుందా ఓకె. లేకపోతే ఇక్కడే వుండనీ...నేను చెప్పాల్సింది ఇంతే.. నువ్వేమైనా అనుకో...! అవతల నాకు బోలుడు పనులున్నై... నేపోతున్నా..!" గడగడా చెప్పాల్సింది చెప్పేసి బండెక్కాడు మావాడు.

మా ఆవిడ కోడలువంకా కోడలు మాఆవిడ వంకా చూస్తున్నారు. "వాడు చెప్పింది



నిజమేనా?'' ఓ నిముషం ఆగి కోడల్నడిగింది మాఆవిడ.

''ఆయన కుండే తెలివితేటల్లో వందోవంతు నాకున్నా మీరీ ప్రశ్న నన్ను అడిగేవారు కాదత్తయ్యా...! ఏం చేస్తాం...! ఆడదాని బాధ మగాడికేం తెలుస్తుంది...? ఇరుగు పొరుగుల్తో ఎందుకు మంచిగా వుంటుందో, అవసరమైనప్పుడు వవ్వా, ఉవ్వా ఎందుకు అప్పిస్తుందో మనకీ మనకీ తెలుస్తుందిగానీ మగాళ్ళకెలా తెలుస్తుందీ...! పనిమనుష్యుల్తో మాట్లాడితే నెత్తికెక్కించుకోవడం అంటారుగానీ - వాళ్ళు మానేస్తే మనం పడే బాధ ఏమిటో మగమనసుకి ఎలా అర్థమౌతుంది. ఇంటికి రాగానే రకరకాలుగా మనం వండి వార్చి ప్లేట్లో పెట్టాలనుకుంటారేగానీ- అది అమర్చడం కోసం మనం వెచ్చించే సమయం ఎంతో వాళ్ళకి ఏమర్థమవుతుందీ. ఒక పక్క పోస్టల్ వాళ్ళకి, ఇంకోపక్క అడుక్కునే వాళ్ళకి ఒకసారి ఆ వెధవ వాక్యూమ్ క్లీనరు వాళ్ళు ఇంకోసారి ఆక్వాగార్డువాళ్ళూ అదీగాక నానారకాల సేల్సుప్రమోటర్లూ మన ప్రాణాలు తీస్తుంటే ఎలా వుంటుందో వీళ్ళకేం తెలుసూ....." చెప్తూ వుండగానే ఫోన్ మ్రోగింది.

రిసీవరు తీద్దునుగదా మామూడో అక్కయ్య.

"ఒరే రాజబాబు..ఈ సంసారం యీదటం నావల్లకాదురా....!మీ బావ ఒక్క పనీ పట్టించుకోరు సరిగదా... ప్రతీ దానికి వంకలు పెట్టడమే! ఆడదాని బాధ ఎవ్వరికీ అర్థం గాదురా. ఆఖరికి ఆ దేముడితో మొరపెట్టుకుందామన్నా వాడూ....మొగాడేగా... ..?"

ఇంక మాట్లాడేముందీ?

''ఏంవాయ్? వాడొచ్చే ముందరే ఉప్పందించటం తెలిసిందిగానీ కోడలు అడిగే ప్రశ్నలకు సమాధానం తెలీదా? వాడేవెరో పనుందని తప్పించుకుపోయాడు...నువ్వేమో మాట్లాడకుండా పైకి చెక్కేస్తున్నావు...ఇప్పుడీ గొడవకి పరిష్కారమేమిటీ?" చురచురా నావంక చూస్తూ అడిగింది మా ఆవిడ.

"అదీ....సరే....కొన్నాళ్ళ పాటు కోడల్ని ఇక్కడే వుంచుదాం...! వాడికేమో హోటలు భోజనం ఎట్టాగూ పడదుగదా... రెండ్రోజులు హోటల్లో తిన్నాక పెళ్ళాం విలువ వాడికే తెలుస్తుంది....! అప్పుడు వాడే వచ్చి...."

''పెళ్ళాం కాళ్ళు పట్టుకొని ఇంటికి తీసుకెళ్తాడంటావు? అంతేనా?'' అంటూ నన్ను మధ్యలోనే కట్ చేస్తూ "బుద్ధిలేక గదుటోయ్ నిన్ను సలహా అడిగింది! పోనీ ఒకపని చెయ్యి..! నువ్వు అక్కడికే వెళ్ళివుండు... ఇద్దరూ కలిసి హోటల్లో 'మింగండి..!''సజస్టివ్‌గా అంది మా ఆవిడ .

"ఓకే..ఓకే.... అలాచేస్తే వెంటనే వాడు రియలైజ్ అవుతాడు..."

మా కోడలు నా మాటలకి పకపకా నవ్వింది.

"ఎట్టాంటి మొగుడ్ని ఇచ్చావురా దేవుడా!'' మా ఆవిడ నెత్తీ నోరు కొట్టుకుంది.

"పోన్లే అత్తయ్యా! ఏదో కోపంతో నేను మాటామాటా అన్నాగానీ ఆయనా నన్ను ఇన్నాళ్ళు బాగానే చూసుకున్నారుగా! ఓ విధంగా చూస్తే ఆయనన్నట్లు పక్కింటి వాళ్ళ 'స్టవ్‌మీద ' ఆ పూటకి వండిపడేసి, ఆ మరుసటి రోజు నాప్రాబ్లమ్ చెపితే బాగుండేదేమో!సాయంకాలం నేనే వెళ్తానులెండి. నేను లేకపోతే ఆయనకీ తోచదు" తనని తాను విమర్శించుకుని అంది మాకోడలు.

''అమ్మయ్యా..!'' అనుకున్నా.. వాకిట్లో ఆటో ఆగింది. చూస్తే మా అత్తగారు.. లోపలికొస్తూనే

''మీ నాన్నతో వడటం నావల్లకాదే సామ్రాజ్యం...ఆడదాని బాధ ఏమిటో తెలీని వాడితో వేగటం ఇక నాకు సాధ్యం కాదు.. అందుకే వచ్చేశా. ..!" ఉస్సుమంటూ సోఫాలో కూలబడి అన్నది.

చెప్పటానికి ఏం మిగిలిందీ?

అందరు మొగుళ్ళూ ఇంతే..!

అందరి పెళ్ళాలూ అంతే! •



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## విశాల భారత దేశం మనది

ప॥ విశాల భారత దేశం మనది
హిమాలయాలకు నిలయమిది
ఇలాంటి దేశంలో ప్రజలంతా
విశాల హృదయంతో మెలగాలి

చ॥ మతాలు వేరైతే నేమి - భాషలు వేరైతేనేమి
భారతీయులం అందరం - భారతదేశం సుందరం ॥విశాల॥

చ॥ ద్వేషం రోషం తొలగాలి - ప్రేమ స్నేహం చెలగాలి
బుద్ధ గాంధీల బోధనలే - తొలగించును మన వేదనలే ॥విశాల॥

చ॥ ప్రేమ పతాకం చేతగొని - ఐక్య పథంపై పయనిద్దాం
త్యాగశక్తి మన మహాయుధంగా - దేశ శత్రువుల నెదిరిద్దాం ॥విశాల॥

**రచన** : కీ॥శే॥ డా॥ దాశరథి
**గానం**: బృందగానం
**సంగీతం**: ఉపద్రష్ట కృష్ణమూర్తి
**రాగం**: మోహన
రాగ్ భూప్ (హిందుస్తాని సం॥)
**తాళం**: ఆది (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ**: సరిగపదస
**అవరోహణ**: సదపగరిస

**షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశ్శృతి ధైవతం యీ రాగంలోని స్వరాలు.**

ప్రాచీనమైన, బహుళ ప్రసిద్ధమైన మోహన రాగం గురించి 'హాసం' మార్చి 16-31, 2002 సెప్టెంబరు 16-30, 2003 సంచికలలో విపులంగా ప్రస్తావించాను. శ్రోతలను సమ్మోహన పరచేదిగా పేరుపొందిన యీ రాగం భక్తి, శృంగారాలకే కాక రౌద్ర, వీర, హాస్యాది రసాలకు కూడా అనుకూలంగా వుంటుంది.

బృందం అనగానే పదిమంది ఒకచోట కలుసుకోవడం. భిన్నమైన అభిప్రాయాలు వున్నా, వారు కలవడం వలన వారిమధ్య ఒక సమన్వయం ఏర్పడే అవకాశం వుంటుంది. అలాగే వివిధ రకాల గాత్రాలు వున్నా అవన్నీ ఒక శృతిలో కలిసి పాడినప్పుడు ఒక విధమైన చైతన్యం కలుగుతుంది. మనకు పూర్వం భజన బృందాలుండేవి. పాశ్చాత్యా దేశాలలో Congregation అని బృందాలుగా ఏర్పడి పాటలు పాడడం అలవాటు. ముఖ్యంగా క్రైస్తవుల 'చర్చి'లలో సామూహికంగా భక్తిగీతాలు పాడడం పరిపాటి. Chords, counters మొదలగు పాశ్చాత్యా సంగీతరీతుల ననుసరించి Choir బృందగీతాలు నిర్వహిస్తుంటారు ఆయా దేశాలలో. మామూలుగా బాణీని అందరూ కలిసి పాడడం ఒక విధమైతే, వాటిలో Chords, counters కూర్చుకుని పాడడం మరొక విధము. ఈ రెండు విధానాలు లలిత సంగీతంలో వున్నాయి.

ఆకాశవాణి కేంద్రాలలో 1979 వ సంవత్సరం నుండి బృందగీతాల కార్యక్రమాలు ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. ఢిల్లీలోని ఆకాశవాణి డైరెక్టరేట్ వారి ఆదేశాలననుసరించి హైదరాబాద్ కేంద్రంలో 'స్పెషల్ కోరల్ గ్రూప్స్'ను తయారుచేసి కార్యక్రమాలు నిర్వహించడం ప్రారంభమయింది. వీటి నిర్వహణకై ఢిల్లి, కలకత్తా, బొంబాయి, మద్రాసు వంటి ప్రధాన కేంద్రాలతో పాటు హైదరాబాద్‌ను కూడా ఎన్నుకోవడం జరిగింది. దీనికి ప్రత్యేక నిధిని కేంద్రప్రభుత్వం మంజూరు చేసింది. అప్పటినుండి ప్రతిష్మాత్మకమైన అంశంగా పరిగణించబడుతూ యీ బృంద గీతాల ప్రసారాలు సుమారు 20 సంవత్సరాల పాటు మంచి ప్రాచుర్యాన్ని పొందాయి. నేను, ఉపద్రష్ట కృష్ణమూర్తి, పాలగుమ్మి విశ్వనాథం, నిర్మల్ కుమార్, మంచాళ జగన్నాథరావు, డా॥ రజనీ కాంతరావు మున్నగు వారమంతా వివిధ బృంద గీతాలకు స్వరరచన గావించాము. ఆ



కార్యక్రమాలలో ప్రథమ బృందగీతంగా "విశాల భారత దేశం మనది" అనే దాశరథి గేయం ఉపద్రష్ట కృష్ణమూర్తి గారి సంగీత సారథ్యంలో రూపొంది చాలా ప్రాచుర్యాన్ని పొందింది.

## ఉపద్రష్ట కృష్ణమూర్తి



కర్ణాటక సంగీతంలో గాత్ర, వాయులీన విద్వాంసులుగా పేరుగాంచిన ఉపద్రష్ట కృష్ణమూర్తిగారు తూర్పుగోదావరి జిల్లా ముంగండ అగ్రహారంలో 1920 లో జన్మించారు. వీరిది జగన్నాథ పండితరాయలు వంశం. బి.ఎ. (మ్యూజిక్), ఆంధ్రడిప్లొమా (మ్యూజిక్) పట్టాలను పొంది1941లో దేశస్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలు శిక్షను అనుభవించి స్వాతంత్ర్య సమరయోధుడుగా కూడా ఖ్యాతి గడించుకున్నారు. సంస్కృతాంధ్రాలలో ప్రవేశం కలవారు. బందరులో శ్రీ శిష్టుబ్రహ్మయ్య శాస్త్రి గారి వద్ద కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో గాత్రము, వయొలిన్ లను అభ్యసించారు. 1945 నుండి48 వరకు మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో క్యాజువల్ వయొలిన్ ఆర్టిస్ట్‌గా కార్యక్రమాలలో పాల్గొన్నారు. 1946లో మొట్టమొదటగా లలిత సంగీత కార్యక్రమంలో స్వీయరచనలను రజని గారి ఆధ్వర్యంలో పాడారు. వారి ఆ పాటలు "కరుణానిధి నన్ను కాచి రక్షించవే' (కాపి రాగంలో) "రావే కోకిల పాట పాడవే" (మిశ్ర హరి కాంభోజిలో) పండితుల మన్ననలు పొందినవి. 1947 నుండి1949 వరకు హెచ్. యం.వి. కంపెనిలో సంగీతదర్శకుడిగా పనిచేశారు. 1946, 47 ల మధ్య శ్రీమతి యం.యస్. సుబ్బలక్ష్మి నటించి గానం చేసిన"మీరా" హిందీ చిత్రానికి వయొలినిస్టుగా బొంబాయిలో పనిచేసి ఆ తరువాత ఆమె పాడిన ఆ సినిమా పాటలకు హెచ్. యం. వి.లో దర్శకత్వం వహించారు. 1949 నుండి హైదరాబాద్ రేడియో కేంద్రంలో నిలయ విద్వాంసుడుగా 1958 వరకు పని చేశారు. 1949లో బాలగాయకుడిగా అప్పటి "దక్కన్ రేడియో" లో పాడుతూ వున్న నేను -.కృష్ణమూర్తి గారు స్వరపరచిన పాటలను కూడా పాడేవాడిని. 1958వరకూ నిలయ విద్వాంసుడుగా ఆయన పనిచేశారు. ఆ కాలంలో వయొలినిస్టుగా శ్రీయుతులు చెంబై వైద్యనాథ భాగవతార్, మహారాజపురం విశ్వనాథ అయ్యర్, టి.ఆర్. మహాలింగం, మహావాది వెంకటప్పయ్య, బాలమురళీకృష్ణ మొ॥ వారికి ప్రక్క వాద్య సహకారాన్ని అందించారు. వి.సుశీల, యస్.జానకిగార్ల కు కూడా వయొలిన్ సహకారం అందించారు. త్రివేణి, మామిడి చిగుళ్ళు, కృష్ణలీల, తరంగిణిలోని "రుక్మిణీ కళ్యాణం", చెంచులక్ష్మి మొ॥గు సంగీత రూపకాలకు స్వరరచన చేశారు. 1958లో హృషీకేష్ లో సంగీత కచ్చేరి చేయగా స్వామి శివానందులవారిచే ఆశీర్వాదంతో పాటు "సంగీత జ్యోతి" అనే బిరుదు ప్రదానం చేశారు. ఆయన ఇంకా ఎన్నో లలిత గీతాలకు సంగీతం సమకూర్చారు. అనేక భక్తిరంజని కార్యక్రమాల్లో పాల్గొన్నారు. బృంద గీతాలెన్నిటికో సుమధుర సంగీత బాణీలను కూర్చి చాలా మంది గాయనీ గాయకుల చేత పాడించారు. 1978లో ఆకాశవాణిలో పదవీవిరమణ గావించిన తరువాత కూడా నిరంతరం సంగీత సాహిత్య సేవలోనే నిమగ్నులై వుంటున్నారు. విష్ణు సహస్రనామ స్తోత్రాన్ని తెలుగులో రచించి సంగీతబద్ధం గావించారు. వారి తాతగారు ఉపద్రష్ట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన అనేక సంగీత రచనల్ని స్వరంతో పుస్తకం రూపంలో తీసుకువచ్చేందుకు ప్రయత్నాలు జరుపుతున్నారు.

వీరి కుమార్తెలు కూడా ఆకాశవాణి గాయనీమణులే. సుమారు 600వరకు కృష్ణమూర్తిగారి స్వీయ రచనలు కృతులు, భావగీతాలు, భక్తిగీతాలు,పుస్తకరూపంగా ముద్రణకు సిద్ధంగా వున్నవి. ●

**(మోహనరాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలను 'హాసం' మార్చి 16-31, 2002 సంచికలో పేర్కొనడం జరిగింది.)**




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



### రెండో ఆటలేదు!

సత్యజిత్‌రాయ్ "పథేర్ పాంచాలి" సినిమాకి పేరు, ప్రైజులూ వచ్చిన కొన్నాళ్ళకి విజయనగరం వచ్చింది. పెద్ద పెద్ద పోస్టర్లు, బ్యానర్లు లాంటివేమి వెయ్యలేదుగాని, సినిమా థియేటరు ముందు మాత్రం ఒక పోస్టర్ అతికించారు. ఫలానా రోజున "సాయంకాలం ఆటతో- విడుదల" అన్నారు. ఆ సినిమా గురించి విన్న వాళ్లందరం మురిసిపోయాం. సినిమాల మీద అవగాహన, అప్రిసియేషన్, వున్నవాళ్లు, విమర్శకుల్లాంటి వాళ్ళు 'ఓహో' అని తెగ చెప్పుకుని, అందరికీ



మంచి అవకాశం వచ్చిందని ఆనందించారు. మేం కొంతమంది మిత్రులంకూడా వెళ్ళి చూడాలని తీర్మానించుకున్నాం. 'పథేర్ పాంచాలి' విడుదలయిన సాయంకాలమే వెళ్లాలనుకున్నాం గాని, కుదరక రెండో ఆటకి వెళదాం అని, సావకాశంగా నిదానంగా కూచుని చూడవచ్చుననీ భావించి, మొదటి ఆట పూర్తయిన తర్వాత, వెళితే ఏముంది? రెండో ఆటలేదు!

"అదేమిటి? రెండో ఆట వెయ్యరా? ఇవాళేకదా విడుదల?" అని అడిగితే, మొదట ఆటకే ఎవరూ రాలేదనీ, వచ్చినవాళ్లలోనే కొందరు వెళ్లిపోయారని, మరికొందరు గోల చేశారనీ థియేటర్ మేనేజర్ చెప్పాడు. రాత్రి చిన్న వెలుగులోనే గోళ్లు గిల్లుకుంటూ. మేం ముగ్గురం వెళ్లాం. మేము తప్ప ఇంకెవరూలేరు. ముగ్గురి కోసం వెయ్యనంటాడు. "ఇంకా మరి కొందరు వస్తారేమో చూద్దాం, చూసి మొదలెట్టండి" అన్నాకూడా అతను కుదరదన్నాడు.

"ఏంటండీ ఆ సినిమా? మాటలేదు- పాటలేదు. ఉన్నమాటలు అర్థంకాదు. లాగి లాగి నడిసింది. అవార్డులు వచ్చాయనీ, విదేశాల్లో ఆడిందనీ వారంరోజులకి బుక్‌చేస్తే తొలి ఆటకే కార్బన్ ఖర్చు రాలేదు. గేట్ కీపర్లకి ఆపరేటర్లకీ బత్తాలివ్వాలా? కరెంటవుద్దా? మీ మూడు టికెట్లమీద ఆర్రూపాయలనుకుందాం. ఆర్రూపాయలకి ఆట ఆడగలమా? అందుకే రెండో ఆట లేదన్నాం. ఎలిపోండిబాబు ఇంటికెళ్లి తొంగోండి, లేదంటే ఇంకో సినిమాకెల్లండి" అని దీపాలు ఆర్పేశాడు. మేము "కొద్దిసేపు చూద్దాం- ఇంకా వస్తారేమో" అని ఎంత బతిమాలినా వినిపించుకోలేదు. మేము చాలా నిరుత్సాహపడి పోయాం.

"భ భ-ఇంటర్నేషనల్ సినిమావస్తే చూడ్డానికి లేకపోయిందే" అని బాధపడుతూ అక్కడే నించునివుంటే "సినిమా అంటే ఆట, పాటా వుండాలి. కతుండాలి. పైట్లుండాలి. ఏటీలేకుండా సినిమాయేటి? ఇలాంటి సినిమాలు మేం తియ్యలేమాయేటి? సూడాలి గదా జనం.... అతనెవరోగాని. అతనికి చెప్పండి ఇలాంటి సినిమాలు తియ్యొద్దని. మాకూ నష్టమే. తెలిస్తే యేరే స్టంటు బొమ్మేనా ఆడుకుందుం. నాలుగు డబ్బులొచ్చేవి" అనుకుంటూ ఆ మేనేజర్ నిష్క్రమించాడు. ఆ సినిమాకి కలిగిన దురదృష్టానికి తిట్టుకుంటూ మేమూ నిష్క్రమించాం.

* * *

### ఓపెనెయిర్ సినిమా

నా చిన్నతనంలో "గొల్లభామ" (1947) సినిమాని శ్రీకాకుళం ఊరి చివరున్న టెంట్‌హాల్లో మూడునాలుగు సార్లు చూశాను. ఆ టెంట్ హాలునే డేరాహాలు అని కూడా అనేవారు. నేల, బెంచి, ఇనపకుర్చీలూ వుండేవి. సింగిల్ ప్రొజెక్టరు, ఒక రీలు నడవగానే ప్రొజెక్టరు ఆపి, ఇంకో రీలు పెట్టి నడిపించేవారు. అంచేత ఇరవై రీళ్ల సినిమా అయితే 18,19 ఇంటర్వెల్స్ అన్నమాట. రీలు అయిపోగానే అక్కడక్కడ కూచున్న అమ్మకాలవాళ్లు టక్కున లేచిపోయి 'బీడి, సిగిరెట్టు'అనో 'టీ'అనో అరుస్తూ తిరిగే వారు.

ఓరోజు సినిమా చూస్తుంటే, పెద్దగాలి దుమారం లేచి టాపులేచిపోయింది! అంటే, టెంట్ ఎగిరిపోయింది. స్క్రీన్‌వేపునుంచి సగభాగం లేచిపోయి, రెండో సగానికి వెళ్లి దాని మీద పరుచుకుని, కప్పుకుంది. గాలిహోరు, టెంట్‌చప్పుడు, జనంగోలతో సినిమా ఆపేశాడు. తెరకూడా ఆ హోరుగాలికి టపటపా కొట్టుకుంటోంది. ఈ గాలి ఇంకా ఎక్కువయిపోతే, గుడారం కూల్తుందేమోనని, కొందరు బయటకు పరిగెత్తారు. అయితే, ఆ వాయు విజృంభణ కొంతసేపు మాత్రం విశ్వరూపం చూపించి, తర్వాత తగ్గిపోయింది, సద్దుమణిగింది.

మళ్లీ అందరూ లోపలికొచ్చి, సినిమా మొదలు పెట్టమంటే, వెయ్యనంటాడే! డేరా లేచిపోతే మాత్రమేం పర్వాలేదు సినిమా వెయ్యండన్నారు ప్రేక్షకులు. వెయ్యం అని దీపాలు ఆర్పేస్తున్నారు డేరావాళ్లు. అందరూ అక్కడున్న చిన్న ఆఫీసు దగ్గర చేరి, "సినిమా వెయ్యకపోతే, డబ్బులివ్వండి" అని అరిచారు అక్కడున్న అతను నోటీసులు తీసి చూపించాడు. "ఏ కారణము చేత ఆట ఆగిననూ, టికెట్టుసొమ్ము వాపస్ ఇవ్వబడదు" అని చదివి, చూపించాడు. "అయితే ఆట ఆపకండి. వెయ్యండి" అన్నారు. కొందరు క్యాబిన్‌లోకి వెళ్ళి అల్లరి చేశారు. ఇక లాభంలేదని, ఆపేసిన నాలుగో రీలు దగ్గర్నుంచి మళ్లా మొదలుపెట్టారు సినిమా. జనం కూర్చున్నారు. అది చలికాలం. పైన సగంవరకూ డేరా లేదు. మంచు. అంచేత మధ్యలో అంతాలేచి, కుర్చీలు వున్నవేపు వెళ్ళి కుర్చీలమధ్యలో కూచుని సినిమా చూశారు. చలికి వణికిపోతూ. అది నేను మూడోసారి చూడ్డం అయినా- ఓమూలకి వెళ్ళి నా మిత్రుడితో సహా- భయంతోనూ (మళ్ళీ గాలి దుమారం వేస్తుందేమోనని) చలితోనూ వణుకుతూ నిలబడే చూశాను కాస్సేపు,' గోల భామ'గా మారిన 'గొల్లభామ' సినిమా.

* * *

### ఒక్కరోజు - ఆకాశరాజు

'గుణసుందరికథ' విజయనగరంలో విడుదలైన మొదటి రోజున పాపారావు అనే నామిత్రుడు, నేను వెళితే - విపరీతమైన జనం. అప్పుడు క్యూలూ, వరసలూ, రిజర్వేషన్లు

ఏమీలేవు. రెండు కిటికీలు- అనబడే కౌంటర్లు. ఎవడికి శక్తివుంటే వాడు వెళ్లి టికెట్లు తెచ్చుకోవడమే. తోసుకోడం, దూరిపోవడం లాంటి విద్యలు తెలియాలి. పాపారావు "నేను వెళ్ళి తెస్తాను'' అని దూరాడు. ఒక ఇరవైనిమిషాల తర్వాత తేలాడు. చొక్కా పూర్తిగా చిరిగిపోయింది. చెమటతో తడిసి ముద్దయి పోయాడు. అలాగే తడిసిన టికెట్లు తీసి - పద అన్నాడు. సాహసవంతుడు!

విశ్వనాథ సత్యనారాయణగారు కథ, మాటలూ రాసిన "ఆకాశరాజు" జానపద సినిమా విడుదల. (1951) అందులో మాఅన్నయ్య ఆర్.కె.రావు పెద్ద వేషం (శివరావు మానేస్తే- ఈయన కిచ్చారు) వేశాడు. అంచేత చూడాలి. అప్పుడు మేము శ్రీకాకుళంలో వున్నాం. ఆ సినిమా శ్రీకాకుళంలోగాని, విజయనగరంలో గాని విడుదల కాలేదు. విశాఖపట్నంలోనే అయింది. అంచేత పనికట్టుకొని విశాఖపట్నం వెళ్ళి చూడాలి. మొదటిరోజే వెళితే, టికెట్లకు కష్టమైపోతుందని, రెండోరోజు చూడొచ్చుననీ, - సాయంకాలానికి చేరుకొనేలా విశాఖపట్నం వెళ్ళి సినిమాహాలు చేరాం!

ఎందుకయినా మంచిదని ,చొక్కాలు చిరిగిపోతే కష్టం అని- 'గుణసుందరి కథ' అనుభవంతో దిట్టమైన చొక్కాలు వేసుకుని - ఇంకో దిట్టమైన చొక్కా చంకలో పెట్టుకొని సాహసంతో తెగించి, యుద్ధానికి సిద్ధమైన యువ వీరుల్లాగా వెళితే, ఏముంది? రెండోరోజు సినిమా లేదు!! మొదటి రోజు మొదటి ఆటకే జనం లేరంట. ఉన్నవాళ్లు గోలా అల్లరీ చేశారుట. రెండోఆటకి అనలులేరట. అయినా,సినిమా ఆడారుట, రెండోరోజు ఇక లాభంలేదని- వాళ్లదగ్గర వున్న ఏదో హిందీ సినిమా వేస్తున్నారు!" "ఆకాశరాజు - ఒక్కరోజు"



అని మేం ఆశ్చర్యపోయాం - దిగులుపడ్డాం - నిరుత్సాహంతో నీరసపడిపోయి, ఎలాగూ వచ్చాంకదా అని- జనం లేని సినిమా ఏదో చూసి, తిరుగు ముఖం పట్టాము.

* * *

### భయంకరరంగారావు

"నర్తనశాల'' (1963) సినిమాకి నేను సహకార దర్శకుడిగా పనిచేశాను. కీచకుడు రంగారావుగారు-మేకప్ వేసుకుని దుస్తులు, ఆభరణాలు ధరించి సెట్టుకొచ్చేసరికి రోజూ పదకొండుగంటలయేది, అయితేయేం - అనుకున్న పని ఒంటిగంట లోపల అయిపోయేది. అలాగే ఒకరోజు సెట్టుకొచ్చి ఆసనం మీద కూచునే సరికి, మీసం కాస్త జారింది. అప్పుడే పెట్టుకుని వచ్చినట్టున్నారు- ఇంకా అతుక్కోలేదు. మేకప్ అసిస్టెంటుని పిలిచి"మీసం చూడండి" అని కేక పెట్టారు దర్శకుడు కామేశ్వరరావు గారు, అసిస్టెంటురాగానే, రంగారావు గంభీరంగా చూసి "నువ్వేంచేస్తావు? పీతాంబరాన్ని రమ్మను " అని గద్దించాడు?అసిస్టెంటు వెళ్లిచూశాడుగాని, పీతాంబరం గారు తనపని అయిపోయింది కనుక కారెక్కి వెళ్లిపోయారు. అమాటే వచ్చి చెప్పాడు అసిస్టెంటు. "మీసం సరిగ్గా అతికించకుండా వెళ్లిపోతే ఎలా? పిలవండి ఎక్కడున్నా" అని అరిచారు రంగారావుగారు. అంతే! ఒక్కో స్టూడియోకీ ఒక్కో కారు బయలుదేరింది. పీతాంబరం ఎక్కడికి వెళ్లారో ఎవరికి తెలుస్తుంది గనుక!.... ఫోన్ దగ్గరగా పెట్టుకుని-జారిన మీసంతో కళ్లుమూసుకుని చిన్న కునుకులోకి జారుకున్నాడు కీచకపాత్రధారి. సెట్లో దీపాలు ఆర్పేసి అందరూ రిలాక్సు అయిపోయారు. రంగారావు పట్టుదల, మొండితనం గురించి, కోపం గురించీ చెబుతూ 'నర్తనశాల' నిర్మాత లక్ష్మీరాజ్యంగారు ఒక అనుభవం చెప్పారు.

"మేం 'హరిశ్చంద్ర' తీసినపుడు అవుట్‌డోర్‌కి తడ అడవులకి వెళ్ళాం. మొదటిరోజు షూటింగ్ బాగానే జరిగింది. రంగారావుగారు (హరిశ్చంద్రుడు) నేను (చంద్రమతి) రేలంగి (నక్షత్రకుడు) షూటింగ్‌లో వున్నాం. రెండోరోజు మధ్యాహ్నం లంచ్ బ్రేక్ చేసిన తర్వాత, భోజనాలు రావడం ఆలస్యమైంది. రంగారావు ఒక చెట్టు కింద కూర్చున్నారు. ఏవేనా పిట్టల్లాంటివి కనిపిస్తే కొట్టాలని తుపాకీ తెచ్చుకున్నారు, పక్కన పెట్టుకున్నారు. బ్రేక్‌లో నెమ్మదిగా "పానం" మొదలుపెట్టారు. రెండున్నర, మూడు అయిపోతోంది. భోజనాలు రాలేదు. ఎక్కడి వాళ్ళం అక్కడ నీరసపడిపోతూ కూచున్నాం. అపుడు ఫోన్ సౌకర్యాలు కూడా తక్కువ. వెళ్లిన కార్లకోసం ఎదురూ చూస్తుండగా, పెద్దపులి గాండ్రించినట్టు రంగారావు ఒక్కఅరుపు అరిచారు. 'ఎక్కడ భోజనం? ఎక్కడ ప్రొడ్యూసర్లు? టైమెంతయింది?" అంటూ తీవ్ర స్థాయిలో - అడవి అదిరేలా బొబ్బలు పెట్టారు.

నేను వెళ్ళి "ఎక్కడో ఆలస్యమైనట్టుంది........." అని ఏదో చెప్పబోయేంతలో ఆయన తుపాకీ తీసి "కాల్చిపారేస్తాను- అందర్నీ . జాగ్రత్త . వేళకి భోజనం రాకపోవడం ఏమిటి-" అని, ఆ కోపం మూడ్‌లో తుపాకీ నావేపు గురిపెట్టారు. ఏమో ఏం చేస్తారో అని, భయంతో పారిపోయాను. అలాగే, ఆ తుపాకీని గురిపెడుతూ, ఆయన ముందు ముందుకొచ్చి "ఎక్కడ శ్రీధరరావు" ? అని కేకలు.

అంతే ! ఆయన కోపరూపానికీ, తీవ్రతకీ, చేతిలోని తుపాకీకి అదిరిపోయి ఎక్కడివాళ్ళం అక్కడ పరుగెత్తాం. డైరెక్టరు జంపనగారు, కట్టుకున్న పంచెజారిపోతున్నా చూసుకోకుండా రోడ్డుమీదకు పరిగెత్తారు. నేను కూడా ఒకపెద్ద చెట్టువెనక నక్కాను. శ్రీధర రావుగారు ఓ మూలకి పారిపోయారు! అసిస్టెంట్లు, తక్కిన వాళ్లూ తుపాకీ దెబ్బకి పిట్టలు ఎగిరినట్టు తలోవేపూ పరుగెత్తారు. రంగారావుగారు అరిచిఅరిచి, తుపాకీ కిందపారేసి, కుర్చీలో కూచున్నారు - భోజనాలు వచ్చాయి. వెళ్ళి ఆయనకి



చెప్పాలి.ఎలా? ఆ విశ్వరూపాన్ని ఎలా శాంతింప చెయ్యాలి?

ఆడదాన్ని కనక, నిర్మాతని కనక నేనే మెల్లిగా వెళ్లి "భోజనం. ..పంపిస్తున్నా.....ను..." అన్నాను దూరంగా నించునే. పులి ప్రసన్నమైంది. శాంతించినట్టుంది. "ఏం ఆలస్యం?'' అని అడిగింది -మంద్రస్థాయిలోనే. ఏమీ సమాధానం చెప్పలేదు. ఆయనకి ఇష్టమైన భోజనాన్ని ఐదు నిమిషాల్లో పంపించారు. నేను పక్కన కూచుని వడ్డించాను. పారిపోయిన వాళ్లు నిదానంగా చెట్లకింద జేరి భోజనాలు చెయ్యడం ఆరంభించారు... ఒక అరగంట పాటు సుడిగాలిలా రెచ్చిపోయి భయభ్రాంతుల్ని చేసిన రంగారావు గారు పూర్తిగా శాంతించారు. "ఇవ్వాళ్టికి పాకప్ చేద్దాం" అన్నారు నెమ్మదిగా, 'తప్పకుండా' అన్నాను... అమ్మయ్య! ఆనాటి అనుభవం మాత్రం...." అంటూ ఆమె పకపకా నవ్వారు. కామేశ్వరరావు గారు, మేము అందరం ఒకటే నవ్వు!... అంతలో, పీతాంబరం వచ్చారు. ....మీసం సరిచేశారు..... రంగారావు గారు ఏమీ...అనలేదు..ఆయన తత్వం అంతే!.... వెంటనే సీను మూడ్‌లోకి వచ్చేసి, డైలాగ్స్ చూసుకొన్నారు. ■

బాపురమణీయం
Bapu Ramaneeyam

# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

వెండితెర నవల 2


స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్లపూడి వెంకటరమణ**

నవలీకరణ
**ఇలపావులూరి మురళీమోహనరావు**


ఉదయం ఏడుగంటలు. ఇంటిముందు రెండు ఆటోలు ఆగివున్నాయి. కృష్ణమూర్తి, సత్యభామ చేతుల్లో లగేజీలు పట్టుకుని హడావిడిగా వస్తున్నారు. వారి వెనుకే రామారావు,సత్యభామ తల్లి.

"వెళ్ళొస్తాను నాన్నా" చెప్పాడు కృష్ణమూర్తి.

"వెళ్ళరా అబ్బాయి" అన్నాడు రామారావు.

"వెళ్ళొస్తానమ్మా" అన్నది సత్యభామ.

"జాగ్రత్తమ్మా" అన్నది సత్యభామ తల్లి.

"వెళ్ళగానే ఉత్తరం రాయరా అబ్బాయ్" కృష్ణమూర్తి ఆటో ఎక్కుతుండగా అన్నాడు రామారావు.



"వెళ్ళగానే ఉత్తరం రాయమ్మాయ్" భామను ఆటో ఎక్కిన్తూ అన్నది సత్యభామ తల్లి.

ఉత్తరం దిక్కుగా ఒక ఆటో, దక్షిణం దిక్కుగా ఒక ఆటో పరుగు తీశాయి.

ఆటోలు వెళ్ళగానే అనుమానం వచ్చింది సత్యభామ తల్లికి

"అవునుగానీ...అక్కయ్య ఆటో అటు, బావగారి ఆటో అటూ వెళ్తున్నాయేమిట్రా?" అడిగింది కొడుకును.

రామారావుగారు కల్పించుకుని "బొంబాయి అటుకేసీ, కొచ్చిన్ ఇటుకేసీ గదమ్మా" అన్నాడు.

"వాళ్ళెక్కే రైలుస్టేషనొకటే గదండీ?" అన్నదామె మూతి విరుస్తూ.

ఆ అయిడియా తనకు రానందుకు నోరు తెరిచాడు రామారావు.

* * *

భార్యా భర్తల్లో ఏ ఒక్కరూ అవతల వారి సమస్యలను భరించే తాహతులేని వారు కానపుడు ఎంత నవదంపతులకైనా ఎడబాటు తప్పదు కదా. సత్యభామ,కృష్ణమూర్తి కూడా అంతే.

కొచ్చిన్లోని తన ఆఫీసులో కూర్చుని టైపు చేస్తున్నది సత్యభామ. పనిచేస్తున్నదన్న మాటే కానీ మనసంతా కృష్ణమూర్తి మీదనే ఉంది. ఊహల్లో ఊగిపోతున్నది.

బాస్ ఆఫీసులోకి ప్రవేశించాడు. సిబ్బంది అంతా అలర్టయి 'గుడ్‌మాణింగ్ సార్' విష్ చేస్తున్నారు. అందరినీ తిరిగి విష్ చేస్తూ తన ఛేంబర్లోకి వెళ్ళబోతూ భామను చూశాడు బాస్. భామ ఈ లోకంలో లేదు. నవ్వుతూ భామ టేబుల్ ముందు ఆగి "ఎంద మధురమాయ్ స్వప్నంగళ్. కెండూ కొందు ఇరిక్కిన ఆళ్ళూ" అన్నాడు మళయాళంలో.

ఇంగ్లీషులోనో, హిందీలోనో అడగడానికి అతడు తెలుగువాడు కాదు గదా! ఎంత గొప్ప చదువులు చదువుకున్నా తన మాతృభాషలోనే మాట్లాడుతాడు. తెలుగువాళ్ళందరం తెలుగులోనే మాట్లాడుదాం అని రోజుకు వందసార్లు గుర్తు చెయ్యాలి మనవాళ్లకు.

భామ ఈ లోకంలోకి వచ్చింది. "అదెల్లా ఒణ్ణల్లేసార్" అన్నది నవ్వి.



"విష్ యూ ఏ హ్యాపీ మ్యారీడ్ లైఫ్" అభినందించాడు బాస్, పెద్దగా నవ్వి షేక్‌హ్యాండిచ్చి.

"థాంక్యూ" అన్నది బామ.

"అర్ధరాత్రి విరిచి ఒరు జోక్కుండు." మళయాళంలో నవ్వి తన ఛేంబర్లోకి వెళ్ళిపోయాడు బాస్.

భామ మళ్ళీ ఊహాలోకంలోకి వెళ్ళిపోయింది. "ఎవడా పరపురుషుడు" అన్న మాట వినిపించింది.

మళయాళం గోలలో తెలుగు మాట వినిపించేసరికి ఉలికిపడి అటు ఇటు చూసింది భామ. ఎవరూ కనిపించలేదు. ఆ శబ్దం తన డ్రా సొరుగులోంచి వినిపించిందని గ్రహించి సొరుగు లాగింది. ఫొటోలో కోరచూపుతో కృష్ణమూర్తి కనిపించాడు. "ఎవడు వాడు అంటున్నాను" అన్నాడు.



నవ్వుతూ ఫొటోను చేతితో పట్టుకుని చూస్తూ "హుష్...ఆయనే మా బాస్. సంగున్ని మీనన్" చెప్పింది.

"అయితే మాత్రం? అంత అందంగా ఉన్నాడేంటి? పైగా ఆ మిలట్రీ మీసాలెందుకు?" అడిగాడు కృష్ణమూర్తి.

"మీకా సివిల్ మీసాలేమిటి?"

"నా మూతి - నా ఇష్టం"

"వాడిమూతి - వాడిష్టం"

"అయినా ఆ ఇకఇకలు పకపకలు ఏమిటి?"

భామ జవాబు చెప్పకుండా ఫొటోను డ్రాలో పడేసింది.

* * *

బొంబాయిలో కృష్ణమూర్తి డిజైన్స్‌లో బిజీగా వున్నాడు. అంతలో లేడీ బాస్ ఊర్మిళ వచ్చింది.

"హాయ్ కె.కె. విష్ యూ వెరీ వెరీ హ్యాపీ మ్యారీడ్ లైఫ్... ఎన్‌జాయ్డ్‌ది షార్ట్ హనీమూన్!?" అంటూ కొంటెగా నవ్విందామె.

"థాంక్యూ మేడమ్"అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

ఒక నిమిషం పాటు మాట్లాడి వెళ్ళిపోయింది ఊర్మిళ.

"అదెవత్తి? ఆ శూర్పణఖేనా?" వినిపించింది భామ గొంతు.

షర్ట్‌లోంచి భామ ఫొటో తీసి చూసుకున్నాడు కృష్ణమూర్తి.

"శూర్పణఖేనా అంటున్నా" అడిగింది భామ చిరుకోపంగా

"ష్...శూర్పణఖ కాదు. మిస్ ఊర్మిళ. మా బాస్. జాలీటైపు. కానీ సోదరి లాంటిది." చెప్పాడు కృష్ణమూర్తి.

"ఆ సంగతి నేను అడగలేదు"

"నువ్వు అడిగిన ప్రశ్నకు జవాబు నీకూ తెల్సు. నువ్వు అడగని ప్రశ్నకు జవాబే నీకు కావలసింది. లేకపోతే నువ్వు నిద్దరోవు. బోధపడిందా? మనసిలాయో అమ్ముకుట్టీ"

"అదిసరే... ఆవిడ అంతసేపు గుంజేసిందేమిటి మీ చేతులూ ?"

నవ్వాడు కృష్ణమూర్తి "అపార్థసారథమ్మా. అదంతా నిన్ను చేసుకున్నందుకు నన్ను మెచ్చుకోవడం. నువ్వు ఎలా వుంటావు అని అడిగింది. మూడు ముక్కల్లో చెప్పేశాను." అన్నాడు.

"ఏమని?"

"చారెడు - పిడికెడు - బారెడు ఉంటావని"

నవ్వింది భామ. కృష్ణమూర్తి మేను పులకరించింది. పాట పలకరించింది. ఇద్దరి హృదయాలు గాలిలో తేలిపోతూ, ఆకాశంలో హంసలై, హాయిగ ఎగిరే గువ్వలై విరితోటల లోగిళ్ళలో వాలాయి.

**అమ్ముకుట్టి - అమ్ముకుట్టి మనసిలాయో**
**కిట్టమూర్తి - కిట్టమూర్తి తెలుసులేవోయ్**
**అమ్ముకుట్టి అమ్ముకుట్టి మనసిలాయో**
**కిట్టమూర్తి కిట్టమూర్తి తెలుసులేవోయ్**
**ఓ...అసలే విరహం**
**అయ్యో దూరం**
**ఎల్లాగున్నావో**
**ఆ..చారెడు పిడికెడు బారెడు పిల్లా**
**ఎల్లా గున్నావో...**
**ఎందా?**
**చెంపకు కన్నులు చారెడు**
**సన్నని నడుము పిడికెడు**
**దువ్వీ దువ్వక పువ్వులు ముడిచిన**
**నల్లని నీ జడ బారెడు**
**మనసిలాయో - అమ్ముకుట్టీ ॥అ॥**
**ఆ...ఆ... అయ్యోపాపం**
**అతాంత్రే**
**కార్యం ఎందాయి?**
**అదేమిటి?**
**ఓ...గుటకలు చిటికెలు**





**కిటుకులు**
**అబ్బో చాలా గడుసు**
**ఊ... గుటకలు చిటికెలు కిటుకులు**
**ఏంటి సంగతి?**
**కులుకులు చూస్తే గుటకలు**
**సరసకు రమ్మని చిటికెలు**
**చక్కని చిన్నది అందం చందం**
**చేజిక్కాలని కిటుకులు**
**మనసిలాయో కిట్టమూర్తి కిట్టమూర్తి**
**మనసిలాయో**



మళయాళ సంప్రదాయ ఓణం నృత్యభంగిమలో కనిపించింది భామ. చెలికత్తెలు అందరితో కలిసి డ్యాన్స్ చేస్తుంటే ముగ్ధుడై వీక్షించాడు కృష్ణమూర్తి. ఊహా ప్రపంచం నవరసభరితం కదా. చెలికత్తెలు కూడా పాడుతున్నారు.



**ఓణం వందే - ఓణం వందే ఓణం వందే**
**ఓణం వందే - ఓణం వందే ఓణం వందే**
**గుండెల్లోన గుబగుబలాడే ఊహలు ఊరెను ఉవ్విళ్లు**
**పరవశమైన మా శ్రీవారికి పగ్గాల్లేని పరవళ్ళు**
**చుట్టూ చూస్తే అందాలు**
**లొట్టలు వేస్తూ మా వారు**
**అక్కడ తమకు ఇక్కడ మనకు**
**విరహంలోన వెక్కిళ్ళు - మనసిలాయో - ॥అ॥**

ఊహా ప్రపంచం ముగిసింది. వాస్తవంలో కొస్తే -

* * *

అక్కడ బొంబాయిలో కృష్ణమూర్తి ఇక్కడ కొచ్చిన్‌లో సత్యభామ ఒకరోజు ఉదయం ఇద్దరూ పేపర్ చదువుతుండగా ఒక ప్రకటన ఆకర్షించింది.



"భామా...ఇది చూశావా? మంగళా టెక్స్‌టైల్స్.... వాంటెడ్"అన్నాడు కృష్ణమూర్తి టైమ్స్ ఆఫ్ ఇండియా పేపర్ చూపిస్తూ

"ఏయ్...ఇది కండో... ఆర్ట్ డైరెక్టర్ అవశ్యం... మంగళ టెక్స్‌టైల్స్‌కు కావలెను..."అంది భామ తను చూస్తున్న మళయాళ దిన పత్రిక చూస్తూ.

"హైదరాబాద్‌లో ఉద్యోగం. ఆర్ట్ డైరెక్టర్‌కు అయిదువేలు" అన్నాడు కృష్ణమూర్తి సంతోషంగా.

"ఊ...స్టెనోకు మూడువేలు" అంది భామ ఆనందంగా.

"ఈ కంపెనీ నా కోసమే పుట్టింది"

"కాదు నా కోసం"

"మనిద్దరి కోసం"

"ఇద్దరం హాయిగా ఇల సాటిలేని జంటలా హైదరాబాదులో డ్యూయెట్లు పాడుకోవచ్చు.."

"ఛలో హైదరాబాద్"

మనసులతో దంపతులైన



వారికి ఒక చోట కలిసుండే యోగం కుదిరితే వారి ఆనందానికి హద్దులు గీయడం ఎవరి తరం?

కొచ్చిన్, బొంబాయిలను వదిలేసి తెలుగువారందరూ ఉర్దూలో మాట్లాడుకునే (దొర్)భాగ్య నగరం చేరారు సత్యభామ, కృష్ణమూర్తి.

* * *

హైదరాబాద్‌లోఒక పెద్ద పార్కు. శారీరక శ్రమ అన్నది ఏ మాత్రం ఎరుగక. కాలు కింద పెట్టేపనిలేక, పాతికేళ్ళకే బీపీలు, షుగర్లు, గ్యాస్ట్రిక్ ట్రబుల్స్ తెచ్చుకునే కోటీశ్వరులు తమ ఇళ్ళ నుండి ఓడల్లాంటి కార్లలో వచ్చి పార్కులో కెళ్ళి నడవటం, పరిగెత్తడం. వ్యాయామాలు చెయ్యడం లాంటి విన్యాసాలు చేస్తుంటారు. చెట్లు నరికివేసి ఆ స్థలాల్లో ఇంద్రభవనాలు నిర్మించుకుని , ఆ చెట్లు వదిలే ఆక్సిజన్ పీల్చుకుంటూ ఆయురారోగ్యాలు పెంచుకోవాలని పార్కుల్లో పరిగెత్తుతుంటారు. ఈ రోజుల్లో ఏ డాక్టరు దగ్గర కెళ్ళినా మందులు రాసిచ్చి, వాటితో రోగం తగ్గుతుందో తగ్గదనో అనుమానంతో వాకింగ్ చెయ్యమని ఉచిత సలహా కూడా పడేస్తుంటాడు.



అలాంటి వారిలో శ్రీధరం, రావుజీ ఇద్దరు. ఇద్దరూ కోటీశ్వరులు, పారిశ్రామికవేత్తలు. కొవ్వు తగ్గించు కోవడానికి ఇద్దరూ వాకింగ్ చేస్తున్నారు.

"కంగ్రాట్యులేషన్... కొత్తగా బట్టల కంపెనీ పెట్టినట్లున్నారు?"

"ఆ..."

"పేపర్లో ప్రకటన చూశాను."

"ఆ..."

"ఇవాళేమిటి? ఇరవై ఏళ్ళనుంచి చూస్తున్నాను ఎప్పుడూ ఏదొక కొత్త పని మొదలు పెట్టి వృద్ధి చేస్తూనే ఉన్నారు. హ...హ...హ....." అన్నాడు రావుజీ.

"నేనూ.... దేశసేవ కోసం వ్యాపారం చేస్తున్నానని అబద్ధం చెప్పను. మీరు చెప్పినా నమ్మను." అన్నారు శ్రీధరం

"భలేవారు సార్"



శ్రీధరం ఏమి మాట్లాడలేదు. మళ్ళీ రావుజీయే అన్నాడు.

"ఉన్న మాటే అన్నారు. సరే గానీ కొత్త ఉద్యోగాలున్నట్లున్నాయ్. మా ఆఖరి బావమరిది మరీ అడ్డ గాడిదలా తిరుగుతున్నాడు మిగిలిన ముగ్గురు గాడిదలకు ఉన్నాయనుకోండి.... వీడే వేకెంటు. వీడికి మీదాంట్లో ఏదైనా...." నసిగాడు.

పార్కులో ఒక బెంచీ మీద కూర్చున్నాడు శ్రీధరం. "నేనూ... అడ్డ గాడిదలకు .....ఆ మాటమీరే అన్నారు..... ఉద్యోగాలివ్వను.'' నవ్వుతూనే వాత పెట్టారు.



తెల్లబోయాడు రావుజీ. మళ్ళీ శ్రీధరం అన్నారు. "నేనూ...ఇవాళ మీ వల్ల ఒక కొత్త సంగతి తెలుసుకున్నాను. కుటుంబంలో ఒక్కరిక్కూడా పని దొరక్క ఎందరో అల్లాడుతుంటే మీలాంటి కుటుంబాల్లో నలుగురేసి అడ్డగాడిదలకు ఉద్యోగాలుండటం చాలా దారుణం. నేను ఇకనుంచీ నా కంపెనీలో ఒక కుటుంబానికి ఒక్కటే ఉద్యోగం ఉండేటట్టుగా జాగ్రత్త పడతాను".

రావుజీ ఏం మాట్లాడాలో తెలియక నోరు తెరిచాడు. సుబ్బి పెళ్ళి ఎంకి చావు కొచ్చిందన్నట్లు అప్పుడే ఆ నిర్ణయం తీసుకోవడం సత్యభామ, కృష్ణమూర్తిల పాలిట అశనిపాతమైంది.

* * *

వచ్చికబయలు మీద కూర్చుని భవిష్యత్తు గురించి చర్చించుకుంటున్నారు కృష్ణమూర్తి, సత్యభామ. ఇద్దరం ఒకే కంపెనీలో పని చేస్తూ ఒకే కప్పుకింద చిలకాగోరింకల్లా కువకువలాడూతూ కొత్త రుచులు కనుగొందామని ఆశపడుతున్న ఇద్దరికీ శ్రీధరం నిర్ణయం ఆశాభంగమైంది.

"నీకు పనికావాలి నాకు డబ్బు కావాలి. అంతే దట్సాల్. మధ్యలో ఈ బోడి రూల్స్ ఏమిటని?" శ్రీధరాన్ని ఉద్దేశించినట్లుగా కోపంగా అన్నాడు కృష్ణమూర్తి.



సత్యభామ ఏమీ మాట్లాడలేదు.

"ఒక కుటుంబంలో నలుగురు అన్నదమ్ములుంటారు. ఆలీబాబా నలభైదొంగల్లా నలభైమందిమి ఉంటాం, నీకెందుకోయ్? ఒక్కడే పని చెయ్యాలా? అసలు నీకు మతుందా?" భామ భుజాలు పట్టి ఊపూతూ కోపంగా అన్నాడు కృష్ణమూర్తి.

భామ భర్త వాలకానికి కంగారు పడి "ఏమండోయ్ నేను భామని. సేటుని కాను. "అన్నది.

"హు...హు...నిన్నుకాదు. సేటు సంగతే. వాడిని కొరడాతో నడ్డి మీద చంపెయ్యాలి" ఉరిమాడు కృష్ణమూర్తి.



భామ కిసుక్కున నవ్వి" ఇది చాలా బాగుందండీ. వాళ్ళ కంపెనీ, వాళ్ళిష్టం. మీరిలా ఆవేశపడి కోపం తెచ్చుకుంటే .....?" అన్నది.

"ఇది నేరం. ఘోరం. వాడిని ఫుట్ బాల్‌లాగా తన్ని పారేస్తానంతే.'' అని కాలు విసిరాడు కృష్ణమూర్తి కోపంగా.

పక్కనే ఉన్న కొబ్బరి బొండాంకి కాలు తగిలి కుయ్యో మొర్రో అన్నాడు కృష్ణమూర్తి.

"అయ్యో..అయ్యో... నొప్పిగా వుందా?" అని పాదాన్ని తుడిచి మర్దించింది భామా కొంచెంసేపు.

"అబ్బా...అబ్బా..."బాధగా అంటున్నాడు కృష్ణమూర్తి పాదాన్ని ఊదుకుంటూ.



"తన కోపమె తన శత్రువన్నారు ఇందుకే.'' కృష్ణమూర్తి పాదాన్ని మృదువుగా వత్తుతూ అన్నది సత్యభామ.

ఇంతలో ఒక చిన్న అమ్మాయి ఆకుల్లో ఇడ్లీలు తెచ్చి 'ఇడ్లేన్లండీ' అని అడిగింది.

అసలే ఎదురు దెబ్బతో పాదం బాధపెడుతుంటే ఆ అమ్మాయి రాక అతనిలో కోపాన్ని పెంచింది. కసిరికొట్టాడు. అంతలో భామ ఆ

ఇడ్డెన్లందుకుంది.

"అదుగో.... కోపం వద్దన్నానా ?" వేలు చూపించి అన్నది .

" మళ్ళీ అదేమాటంటావు. నాక్కోపం ఏంటి?" అన్నాడు కృష్ణమూర్తి కోపంగా.

"లేదు మహాప్రభో....కోపం మీది కాదు. మీరు శాంతమూర్తి. చెంగల్పట్టు శాంతారాం అంటే మీరే?"

"ఆ... అలా అన్నావ్. బాగుంది. వెయిట్" అంటూ కింద కూర్చున్నాడు.

భామ తాను తింటూ భర్తకు తినిపించింది. పొట్టకొంచెం నిండటంతో తేలికపడ్డాడు. దెబ్బబాధ ఉపశమించింది.

"సరే.... సేట్‌ని క్షమించి వదిలేద్దాం. మనసంగతేంటి? " అన్నాడు కృష్ణమూర్తి.

"ఏం వుంది? ఛలో బొంబాయ్ ఛలో కొచ్చిన్." తేలికగా అనేసింది భామ.

"ఎందుకొచ్చిన కొచ్చిన్? నాతో బొంబాయ్ వచ్చిన్..." అన్నాడు కృష్ణమూర్తి .



"సర్లెండి, నాకు కూడా అక్కడ ఒక జాబ్ వచ్చిన్, బొంబాయ్ వచ్చిన్... మనసిలాయో."

నవ్వింది భామ.

"భగవాన్.....ఏమిటి శిక్ష? ఎందుకు మాకీ పరీక్ష.. హ్హా....హ్హా.....హ్హా....." అంటూ ఏడుస్తున్న ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు.

"నవ్వొచ్చినప్పుడు ఎవడైనా నవ్వగలడు. ఏడుపొచ్చినప్పుడు నవ్వేవాడే హీరో.." అంది భామ.

దాంతో పెద్దగా నవ్వాడు కృష్ణమూర్తి.

ఇద్దరూ చీకటి పడిన దాకా అక్కడే గడిపారు. మెల్లగా లేచి ఇంటిదారి పట్టారు. వారు పార్కుగేటుదాటి వస్తుండగా సడన్‌గా భామ బావ కనిపించాడు. అదే సైకిల్...అదే కిరోసిన్ బాటిల్...అదే సిగరెట్... అగ్గివుల్ల వెలిగించి. విషవు చూపు....



ఆ సమయంలో అతనిని అక్కడ చూసి ఉలికిపడ్డారిద్దరూ. వీరు షాక్‌లో ఉండగానే కోరచూపు చూస్తూ వీరి ముందు నుంచే వెళ్ళిపోయాడు.

కరెంటు పోయి అంతా చీకటి మయమైంది. అలాగే నడుచుకుంటూ ఇంటికి వెళ్ళారు. అక్కడ కరెంటు ఉంది. రామారావు ఆత్రంగా బయటకొచ్చాడు.

"రారా మూర్తీ రా..... నీ కోసమే ఎదురు చూస్తున్నాను. శుభవార్తరా. గవర్నమెంటువారి దగ్గరి నుంచి ఉత్తరమొచ్చేసింది." చెప్పాడు గబగబ.

అందరూ లోపలి కొచ్చారు. తండ్రిదేని గురించి చెబుతున్నాడో అర్థంకాక "ఏమిటి నాన్నా?" అన్నాడు కృష్ణమూర్తి .



"చెల్లాయి గుండె ఆపరేషన్‌కి గవర్నమెంటు పదివేలు ఇస్తుందట ముఖ్యమంత్రి నిధి నుంచి" ఆనందంగా చెప్పాడు రామారావు.

తండ్రి మాటలు బోధ పడలేదు కృష్ణమూర్తికి చెల్లెలి పెళ్ళికి తాను డబ్బుదాస్తున్నాడు. తన పెళ్ళికి కట్నం అంటూ ఏమీ లేదు కాబట్టి కొంతైనా డబ్బుదాచి తండ్రికి అండగా నిలబడాలనుకున్నాడు. చెల్లిలికి గుండెజబ్బున్నట్లు, ఆపరేషన్ ఖర్చుల కోసం తండ్రి ప్రయత్నాలు చేస్తున్నట్లు తనకింత వరకూ తెలియదు. "చెల్లాయికి ఆపరేషనా?" ఆశ్చర్యంగా అడిగాడు.



తాను పడుతున్న ఇబ్బందులు కొడుకుకు తెలియనీయకూడదనేది రామారావు మనస్తత్వం. కానీ పరిస్థితి తన శక్తికి మించి పోతున్నప్పుడు బాధగానే బయటపడ్డాడు. "ఇంకా ఆరునెలలు టైముందిలే. ఆ లోపల చేసెయ్యొచ్చు" అన్నాడు.

"నాతో ఎప్పుడూ చెప్పలేదేం" అడిగాడు కృష్ణమూర్తి

"నీ గొడవలు నీకున్నాయి. కొత్తగా పెళ్ళి చేసుకున్నావు. అందుకని చెల్లాయి జబ్బు నా గుండెలోనే ఉంచుకున్నాను." తల వంచుకుని చెప్పాడు రామారావు.

ఆ వార్త భామకు కూడా అఘాతంలాగే తగిలింది. కానీ ఏం చెయ్యగలదు? తన కష్టాలు తనకున్నాయి.

"నేనే గవర్నమెంటుకు అర్జీ పెట్టాను. పసి పిల్ల.... ఆపరేషన్...అని వది ఉత్తరాలు రాశాను. ఆపరేషన్‌కు ముప్పైవేలు అవుతుందట. వాళ్ళు పదివేలు ఇస్తామని రాశారు. ఇంక ఇరవై వేలు. అందరిలా నువ్వు కట్నం తీసుకుని ఉంటే ఏ బాధా ఉండేది కాదు" మాటకు కోడలు బాధపడుతుందని సందేహించి "నువ్వు తప్పుపట్టుకోకమ్మా - ఉన్న మాటన్నాను." అన్నాడు రామారావు.



(ఇంకావుంది)



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

కరాజు కథలు 8

# నిజాలగోడ



రాజ్యంలో ఏంజరుగుతున్నదో తెలుసుకోవడానికి కరాజు అప్పుడప్పుడు మంత్రితో సహా రాత్రిళ్ళు రహస్యంగా సంచారం చేసేవాడు. కాని ఎక్కువభాగం తెలుసుకున్న దానికన్నా వాళ్ళ నడక అలసటే ఎక్కువగా వుండేది. అందుకని ఈ సారి పగటిపూట సంచారం చేద్దామనుకున్నారు. దానికి వీలుగా కరాజు, మంత్రి సాధువుల వేషాల్లో వీధుల్లో తిరిగి తిరిగి కడకు నగరంలోని పెద్ద భవనాలున్న వీధి కొచ్చారు. అక్కడ వారికొక వింత దృశ్యం కనిపించింది. ఒకే రకంగా వుండే మూడు పెద్ద భవానాలు, వాటి చుట్టూ ఎత్తయిన ప్రహరీ గోడలు వున్నాయి. వాటి ప్రక్కన ఒక ఖాళీ స్థలం వుంది. భవనం లేదు. ముందు వైపు మాత్రం పదిహేనడుగుల నిడివి, పదడుగుల యెత్తు గల కొంత భాగమే కట్టిన ప్రహరీ గోడ వుంది.

"ఎవరో ఇల్లు కట్టాలనుకొని ముందుగోడ కొంత కట్టేసరికి ఏదో అవాంతరం వచ్చి ఆపేసినట్టుంది మహారాజా!" అన్నాడు మంత్రి.

కరాజు చుట్టూ పరికించి చూశారు. కొంత దూరంలో ఒక చెట్టుకింద, తిన్నె మీద ఒకవ్యక్తి విచారంగా కూర్చొనున్నాడు. కరాజు, మంత్రి అతని దగ్గరికెళ్ళి పక్కన కూర్చున్నారు.

"అయ్యా! మీరెవరు? చాలా దుఃఖంలో వున్నట్టున్నారు?" అడిగాడు రాజు.

ఆ వ్యక్తి మెల్లిగా తలపైకెత్తి ఇద్దర్ని తీక్షణంగా చూసి,

"సన్యాసులు. అందుకే సంతోషంగా వున్నారు." అని తలదించుకున్నాడు.

ఈసారి మంత్రి అడిగాడు.

"మీ కష్టం ఏమిటో తెలిస్తే మాకు చేతనైన సహాయం మేం చెయ్యగలం".

కొంతసేపు యిలా మాట్లాడగా ఆ వ్యక్తి తన కథను సవిస్తరంగా చెప్పాడు.

ఇతని తండ్రి అనంతాచారి. చాలాగొప్ప జ్యోతిష్కుడు. దేశమంతా తిరిగి తన ప్రతిభతో ఉన్నతమైన పేరుతోపాటు విపరీతమైన ధనాన్ని కూడా ఆర్జించాడు. అతనికి నలుగురు కుమారులు. రామాచారి, లక్ష్మణాచారి, పద్మనాభాచారి, గోపాలాచారి. ఈ నలుగురికీ నాలుగు పెద్ద భవనాలు కట్టాలనుకున్నాడు తండ్రి. కాని అందరికీ ఒకేసారి కడ్తే కీడు జరుగుతుందని జ్యోతిష్యం చెబుతోంది. అందుకని ఒకరి తర్వాత ఒకరికి ఇల్లు కట్టడం మొదలెట్టాడు. మొదటి మూడుఇళ్ళు అనుకున్న ప్రకారం నిర్ణీత కాలంలో నిర్మించబడ్డాయి. చివరి

కొడుకు గోపాలాచారంటే తండ్రికి మక్కువ ఎక్కువ. ఇతని ఇల్లు కాస్త ఎక్కువ వైభవంగా నిర్మించాలనుకున్నాడు. ప్రతిసారి ముందు ప్రహరీగోడలు కట్టి ఆ తర్వాత లోపలి ఇళ్ళను కట్టడం జరిగింది.

అలాగే ఈ ఇంటిని కూడా ప్రహరీ గోడతో ప్రారంభించాడు. కాని పదిహేను అడుగులగోడ కట్టేసరికి అనుకోకుండా ఒక అవాంతరం అనంతాచారి నెత్తిన పడింది. అతనికి ఉన్నట్టుండి గుండెపోటు వచ్చి మంచమెక్కాడు. దురదృష్టవశాత్తు అతని సంపాదనతో చేస్తున్న వివిధ వ్యాపారాలు దెబ్బతిని అతను అప్పుల పాలయ్యాడు. చివరకు తనున్న ఇంటిని కూడా అమ్మేసి గోపాలాచారికి ఈ గోడమాత్రం ఇచ్చి పరలోకానికెళ్ళి పోయాడు. ఇప్పుడు కరాజుతో మాట్లాడుతున్న వ్యక్తి ఆ గోపాలాచారే. దురదృష్ట జాతకుడనే పేరుతో ముగ్గురన్నలు అతన్ని దూరం చేశారు.

''మరి నిత్యజీవనం ఎలా సాగిస్తున్నావ్?'' అనడిగాడు కరాజు.

"ఊళ్ళో వ్యాపారులకు అప్పుడప్పుడు పద్దులు రాస్తూ వాళ్ళిచ్చింది పుచ్చుకుంటూంటాను" అన్నాడు గోపాలాచారి.

గోపాలాచారిలో అందరూ మెచ్చుకునేది అతని చేతిరాత. ఏదిరాసినా చక్కటి గుండ్రని అక్షరాలతో రాసేవాడు.

"వాళ్ళ నాయన అందరి నుదుట రాసిందీ చదివేవాడు. కాని కొడుకు రాతని చూసే ముచ్చట్లో అతని నుదుట ఏం రాసిందీ చదవలేక పొయ్యాడు"అని అందరూ చెప్పుకునేవారు.

'' నా భవిష్యత్తు ఇలా వుంటుందని మానాయన ఎందుకు చెప్పలేదో'' అని విలపించాడు గోపాలాచారి.

"విచారపడకు నీ భవిష్యత్తు నీ నుదుట లేదు, నీ చేతిలో వుంది'' అన్నాడు కరాజు ధైర్యంచెప్తూ.

సాధువింత ధైర్యంగా చెప్పడం చూసి ఆశ్చర్యపోయాడు గోపాలాచారి.

"అదెలా స్వామి?'' అన్నాడు ఆశగా.

"నువ్వనుకుంటే గోడమేడవుతుంది. మేడ గోడవుతుంది. నీ తండ్రి ఇచ్చిన గోడను సద్వినియోగం చేస్కో. రోజూ రాత్రి ఒక సుద్దముక్క తీస్కొని గోడమీద ఆరోజు జరిగిన నిజాలను నీ గుండ్రని అక్షరాలతో రాయ్''

"అంటే?''

"అంటే? జనం ఇష్టపడి తెల్సుకోవాలనుకున్న నిజాలు. ఆరోజు రాహుకాలం ఎన్నిగంటలకు? సంతలో చింతపండు వెల యెంత? ఎక్కడ ఎవరికి బిడ్డ పుట్టాడు? ఎవరు పోయారు? ఇలా ఎన్నో ఎన్నెన్నో కాని ఒకటి గుర్తుంచుకో. ఆరు మాసాలవరకు నువ్వు రాసేదంతా నిజాలే అయివుండాలి. ఆ తర్వాత నీ భవిష్యత్తే వేరు".




కరాజు మాటలకు పక్కనున్న మంత్రి విస్తుబోయి చూస్తున్నాడు. ప్రవాహంలో కొట్టుకుపోయే వాడికి గడ్డిపోచ ఆధారం దొరికినట్టు గోపాలాచారికి సాధువు మాటలు కొత్త వుత్సాహాన్ని ఇచ్చాయి. ఈ ఉత్సాహంతో గోపాలాచారి వగలంతా ఊళ్ళో తిరిగి సమాచారాన్ని సేకరించాడు. ఎప్పుడెప్పుడు రాత్రవుతుందా అని కాచుకొనున్నాడు. అర్థరాత్రిన ఒక సుద్ద ముక్క తీస్కొని తన ఆస్తి అయిన నల్లని గోడను బాగా తుడిచి దాని మీద చక్కటి అక్షరాలతో ఆ రోజున అంగళ్ళలో కూరగాయలు, దుంపలు ఎంత కమ్ముతున్నారో రాశాడు. దీంతోపాటు ఆరోజు రాహుకాలం, యమగండాలను కూడా జత చేశాడు.

పొద్దునయ్యేసరికి వీధిలో అటూ ఇటూ పోయేవారు గోడముందాగి వింతగా చూశారు. రోజూ ఇలాగే గోడమీద ధరల వార్తలు చూసే జనం ఒకరికొకరు చెప్పుకొని రెండువారాలయేసరికి ఏదైనా కొనదలచుకున్నవారు ముందు గోడ దగ్గరికెళ్ళి ధరల వివరాలు తెలుసుకొని ఆపైనే బజారుకెళ్ళేవారు. ఒకరోజు చీకటి పడగానే దుర్గమ్మ వీధులో వున్న ప్రఖ్యాత వైద్యుడు హఠాత్తుగా మరణించాడు. ఆ సమయంలో అది యెవరికీ తెలీదు. కాని ఉదయమయ్యేసరికి ఈ మరణవార్త గోడమీద రాసుండడం చూసి వివరాలన్నీ చదివి ఆ తర్వాత అందరూ వైద్యుడి ఇంటికెళ్ళారు. ఇలాగే బిడ్డలు పుట్టడాలు, పండగలు, పబ్బాలు ఇంకా ఎన్నెన్నో వివరాలు గోపాలాచారి రోజూ సేకరించి రాత్రిళ్ళు గోడమీద రాస్తూంటే అనతి కాలంలోనే నగరమంతా గోడను గురించి గొప్పగా చెప్పుకొనసాగారు. కొందరైతే ఉదయం లేవగానే ముందుగా గోడ దగ్గరికెళ్ళి వివరాలు చదివితే కాని తరువాత పనులకు వెళ్ళేవారు కారు.

ఈ రాతలు జనానికెంతో ఉపయోగంగా వున్నా గోపాలాచారికి మాత్రం రాసే అలసటే గాని రాబడి పరంగా గోరంతైనా ఉపయోగం కనుపించలేదు. అయినా ఆ సాధువు మాటమీద ఎందుకో అతనికొక నమ్మకం కుదిరింది. అతను చెప్పిన ఆరు మాసాలవరకు నిరాశ చెందకుండా తన పనిని కొనసాగించాలనుకున్నాడు.



ఒకరోజు కాశీ కృష్ణమాచార్యులనే వ్యక్తి గోపాలాచారి వద్దకు వచ్చి మరుసటి వారం నుంచి, మూడునెలల పాటు తాను సంపూర్ణ రామాయణ కథా కాలక్షేపం చేస్తున్నానని, ఆ వివరాలనూ, రోజువారీ కార్యక్రమాలనీ గోడమీద రాస్తే ఎక్కువ మంది వస్తారని కోరాడు. పైగా అడక్కుండానే ఇలా రాసినందుకు ఇంత పారితోషికం ఇస్తాననడమే కాక సగం డబ్బు యిచ్చేశాడు. గోపాలాచారి జీవితంలో మొదటి సంపాదన ఇదే. గోడమీద వివరాలను చూసి ఎన్నడూ రానంత జనం కృష్ణమాచార్యుల కాలక్షేపానికి వచ్చారు. అప్పట్నుంచి గోపాలాచారి ఎవరెవరు ఏయే ప్రచారాలు చేయదలచుకున్నారో తెలుసుకొని దానికి తగ్గట్టుగా డబ్బు రాబట్టుకొని వాటిని గోడ మీద కెక్కించేవాడు. మహాకవి సుబ్బరాయశర్మ పక్క రాజ్యంలో "గండపెండేరాన్ని" గెల్చుకున్నా అది నలుగురికీ తెలియదే అని పరితపించాడు. ఈ లోగా గోపాలాచారి గోడను గురించి విని ఒక పెద్దమొత్తాన్ని సమర్పించుకుని తన విజయాన్ని గోడమీద కెక్కేలా చూశాడు. ఇన్ని సంవత్సరాలు సుబ్బరాయశర్మ సంపాదించిన కీర్తి ఒక యెత్తు. ఒక్కరోజు గోడద్వారా అతనికొచ్చిన పేరే ఒక ఎత్తు. కాలక్రమేణా గోపాలాచారి సంపాదన బాగా పెరిగింది. అందరూ గోపాలాచారిని గోడాచారి అనడం మొదలెట్టారు.

ఒకరోజు రాత్రి గోపాలాచారి వార్తలకోసం వీధుల్లో తిరుగుతూండగా అతనికొక తాగుబోతు కనిపించి ఒక ఆసక్తికరమైన కథను చెప్పాడు. అతను రాజవర్మ ఇంట్లో నౌకరు. వారం రోజుల క్రితం రాజవర్మ భార్య నగలుపోయాయని వూరంతా చెప్పుకున్నారు. నిజానికి ఆ నగల్ని రాజవర్మే దొంగిలించి మామిడితోటలో తన సహాయంతో వాటిని పూడ్చిపెట్టాడని నౌకరు తాగుడు మైకంలో చెప్పేశాడు.

మరుసటి రోజు ఉదయం ఈ వార్తను గోడమీద చూసి జనం దిగ్భ్రాంతి చెందారు. పరిశోధిస్తే గోడలో రాసినట్టు నగలు మామిడి తోటలో దొరికాయి. దీంతో గోపాలాచారి పేరు నలుమూలలా మారుమోగింది. అతను గోడాచారి కాదు గూఢాచారి అన్నారు. పైగా ఈ గోడకు నిజాలగోడ అనేపేరు సార్థకమైంది. ఏ విషయమైనా నిజాలగోడ మీద కనిపించిందంటే తిరుగులేకుండా అది ముమ్మాటికీ నిజమే అన్న నమ్మకం అందరిలో నాటుకుపోయింది.

ఇలా ఆరునెలల్దాటింది. ఇప్పుడు సాధువన్న మాటలు మళ్ళీ గుర్తుకొచ్చాయి. "ఈ గోడమీద ఆర్నెల్ల వరకూ నిజాలను రాయి" అన్నాడు. ఈ మాటల్లో అంతరార్థమేమిటి? ఒక్కసారి మెరుపులా స్ఫురించింది! ఆరునెలల వరకు నిజాలు రాయి అంటే ఆ తర్వాత అబద్ధాలు రాయమనా? ఇలా అనుకుంటూండగానే కొత్తగా పట్టువస్త్రాల వ్యాపారం పెట్టిన ఒక వర్తకుడు వచ్చాడు. తనకో సహాయం చేస్తే ఎంత డబ్బైనా యిస్తానన్నాడు.

గోపాలాచారి చెయ్యవలసిన పని ఈ వ్యాపారి సరుకులు ఉత్తమమైనవని మిగతావారివి నాసిరకమని గోడమీద రాయాలి. గోపాలాచారికిది కొత్త మార్గం. ఐతే ఈ మార్గంలో పయనిస్తే విశేషమైన ధనాన్నర్జించవచ్చునే విషయం క్షణంలో గ్రహించాడు. ఇప్పుడు మాములుగా ముట్టే డబ్బుకు పదింతలడబ్బు గోపాలాచారికి ముట్టింది.

"పట్టువస్త్రాల మీద కొందరి అపనమ్మకం" అనే శీర్షికతో తన మీద నింద లేకుండా నలుగురి అభిప్రాయంగా కొత్తవ్యాపారి సరుకును పొగుడ్తూ గోడలమీద రాశాడు గోపాలాచారి. నిజాలగోడ మీదే వచ్చిం తర్వాత ఇక అనుమానం లేదన్నారు జనం. కొత్తవ్యాపారి వ్యాపారం దిగ్విజయీకృత మయింది. పాత వ్యాపారి అప్పులపాలయ్యాడు. నిజాలు రాయడంకన్నా అబద్ధాలు రాయడంలోనే ఎక్కువ సంపాదనవుంది అని తెలుసుకున్న గోపాలాచారి ధనార్జన రోజు రోజుకూ పెరిగి చివరకు అతని దృష్టి తననిన్నాళ్ళు నిర్దయగా దూరం చేసిన ముగ్గురు అన్నల మీదా పడింది.

ఇంతవరకు గోడమీద కెక్కని అన్నల పేర్లు ఇప్పుడెక్కాయి. రాముడు అడవికెళ్తే రామాచారి తమ్ముళ్ళని అడవికి పంపించే యత్నంలో ఉన్నాడన్న వార్త ఆ కుటుంబంలో అలజడి రేపింది. లక్ష్మణాచారి భార్యను ఊర్మిళలాగే నిద్రపోనిచ్చి పక్క ఊళ్ళోని దేవయానికి నిద్రలేకుండా చేస్తున్నాడన్న వార్తతో ఆ యింట్లో తుఫాను రేగింది. పద్మనాభాచారికి సంతానం లేని దానికి కారణం ఎవ్వరికీ చెప్పుకోలేనిది అనే వార్తతో పద్మనాభాచారి అసలు ఇంటి గడపదాటి బయటికి రావడానికే నిరాకరించాడు.

ఇలా వచ్చిన అప్రతిష్ఠలతో మనస్థిమితంలేని పరిస్థితుల్లో ముగ్గురన్నల వ్యాపారం దెబ్బతిని అప్పుల పాలయ్యారు. చివరకు వాళ్ళ ఇళ్ళను అమ్ముకోవడమే శరణ్యమైంది. ఇప్పుడు విశేష ధనంతో వెలిగిపోతున్న గోపాలాచారి ఒక్కడు, ఆ మూడు భవనాల్ని కొన్నాడు. ఇన్ని చేసినా తనస్థలంలో మాత్రం ఒక చిన్న ఇల్లు కూడా కట్టలేదు. అతని గోడమాత్రం నగరంలో ప్రసిద్ధ స్థలమైంది.

గోపాలాచారి విచిత్ర చరిత్రను చర్చిస్తూ కరాజు మంత్రితో "మంత్రీ! దీనివల్ల మనకు తెలిసొచ్చిన నీతేమిటో చూశారా! పూర్తిగా నిజం చెప్పేవాడు కోడిలాంటివాడు. ఎగరలేడు. అందరూ అతన్ని తినడానికే ప్రయత్నిస్తూ వుంటారు. పూర్తిగా అబద్ధాలు చెప్పేవాడు కాకిలా ఒక మోస్తరుగా ఎగరగలడు - ఎంగిలాకుల కోసం. కాని నిజం అనిపిస్తూ అబద్ధాలు చెప్పేవాడు గద్దలాంటివాడు. ఎంత ఎత్తుకైనా ఎగరగలడు."

వెంటనే మంత్రి కంగారుగా "మహారాజా! మరి ఈ గద్ద రాబందుగా తయారై ఒక్క గోడతో మేడల్ని కూల్చేస్తున్నాడు. ఇలా కొనసాగితే జనంలో అబద్ధాలన్నీ నిజాలనుకునే ప్రమాదం వుంది. మీరే దీనికేదైనా విరుగుడు సూచించాలి."అన్నాడు.

"అయితే ఒకపని చెయ్యండి మంత్రీ! ఎనిమిది దిక్కుల్లో ఎనిమిది గోడల్ని కట్టించి వాటి మీద నిజాలను రాసే పనిని ఎనమండుగురికి అప్పజెప్పండి. అప్పుడు గోడలమీద రకరకాల నిజాలు వస్తాయి. జనంలో ఏది నిజం ఏది అబద్ధం అని తెలుసుకోలేని పరిస్థితి ఏర్పడు తుంది. దాంతో అంతా సర్దుకు పోతుంది" అన్నాడు కరాజు. ■



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం





చిత్రం
**గుమ్‌రాహ్**

రచన
**సాహిర్ లుధియాన్వి**

సంగీతం
**రవి**

గానం
**మహేంద్రకపూర్**

అభినయం
**సునీల్‌దత్**
**మాలాసిన్హా**









యే హవా యే హహ యే హవా, యే  ఫిజా, యే ఫిజా యే ఫిజా
హై   ఉదాస్ జైసే మేరా దిల్, మేరా దిల్, మేరాదిల్,
ఆ భీ జా, ఆ  భీ జా, ఆ భీ జా    (2)
ఆకే ఆబ్‌తో చాంద్‌నీ  భీ జర్ద్ హో చలీ, హో చలీ, హో చలీ
ధడ్ కనోఁ కీ నర్మ్  ఆంచ్ సర్ద్  హో చలీ, హో చలీ, హో చలీ
ఢల్ చలీ హై రాత్, ఆకే మిల్, ఆకే మిల్, ఆకే మిల్ ॥ఆభీజా॥
రాహ్ మేఁ  బిఛీ హుయీ  హై మేరీ హర్ నజర్,  హర్  నజర్, హర్ నజర్
మైఁ  తడప్ రహా హూఁ ఔ తూ హై బేఖబర్, బేఖబర్
రుక్ రహీ హై సాఁస్ ఆకే మిల్, ఆకే మిల్ ,ఆకే మిల్, ॥ఆభీజా॥

సాహిర్ లుధియాన్వి, రవి, మహేంద్రకపూర్, బి.ఆర్. చోప్రా కాంబినేషన్‌లో వచ్చిన 'గుమ్‌రాహ్', హమ్‌రాజ్, 'వక్త్' లోని పాటలు హిందీ సంగీతంలో కవిత్వానికి, మాధుర్యానికి తార్కాణాలు. స్వతహాగా కవి అయిన సాహిర్, మెలోడిలోకి పెద్దపీట వేసే రవి, నిండైన కంఠస్వరం గల మహేంద్రకపూర్ కలిస్తే అద్భుతాలు కాక మరేం పుడతాయి?

సాహిర్ అసలు పేరు అబ్దుల్ హయీ. 1950లో వచ్చిన 'అఫ్సర్' చిత్రంలో ఆయన తొలిసారి సినిమా పాట రాశారు. బాజీ, టాక్సీడ్రైవర్, మునీమ్‌జీ, దేవ్‌దాస్, ఫన్‌టూష్, ప్యాసా చిత్రాలకు సచిన్‌దాతో కలిసి పనిచేసి హిట్ పాటలెన్నో అందించారు. రోషన్‌తో కలిసి 'బర్సాత్‌కీ రాత్,' 'తాజ్‌మహల్', 'చిత్రలేఖ' 'బహూ బేగమ్' చిత్రాలలో మధురగీతాలు అందించారు. ఓ.పి. నయ్యర్‌తో 'తుమ్‌సా నహీఁ దేఖా', 'సోనే కీ చిడియా', జయ్‌దేవ్‌తో 'హమ్ దోనో' ముఝె జీనేదో, లక్ష్మీ -ప్యారేలతో 'దాగ్' ఖయ్యామ్‌తో 'కభీకభీ','త్రిశూల్','పంచమ్‌దా(ఆర్.డి.బర్మన్)తో 'దీవార్','బర్నింగ్ ట్రెయిన్ ' చిత్రాలలో చక్కని పాటలు అందించారు. రవితో ఆయన చేసిన పాటలు ప్రత్యేక స్థానాన్ని పొందాయి.

'ధూల్ కాఫూల్' చిత్రంతో బి.ఆర్. ఫిల్మ్‌లో అడుగుపెట్టిన మహేంద్రకపూర్, నేటి వరకు ఆ  సంస్థకు ఆస్థాన గాయకుడిగా వెలుగొందుతున్నారు. మనోజ్ కుమార్ తీసిన - పుకార్ చిత్రానికి జాతీయ అవార్డు అందుకున్నారు.

'గుమ్‌రాహ్' చిత్రానికి నిర్మాత, దర్శకుడు బి.ఆర్. చోప్రా. చక్కని ఇతివృత్తాలతో, ఒక బాధ్యతాభావంతో చిత్రాలు రూపొందించే బి.ఆర్.చోప్రా ఇటీవలే 'బాగ్‌బన్' చిత్రం నిర్మించారు. వృద్ధులైన తల్లిదండ్రుల పట్ల పిల్లలు బాధ్యతగా వ్యవహరించాలని గుర్తుచేసిన ఆ చిత్రం సూపర్ హిట్ అయింది. 'గుమ్‌రాహ్' లో కూడా కట్టుబాట్లు మానవజీవితాన్ని క్రమపద్ధతిలో నడపే లక్ష్మణరేఖలని, వాటిని ఉల్లంఘిస్తే విపరిణామాలు కలుగుతాయని ఒక సందేశం ఇచ్చారు.

మీనా (మాలా సిన్హా) , రాజేందర్ (సునీల్ దత్) ప్రేమించుకుంటారు. రాజేందర్ ఒక మంచి చిత్రకారుడు, గాయకుడు. వారి ప్రేమ సంగతి మీనా అక్కకు తెలుస్తుంది. ఆమె పెద్దలతో మాట్లాడి వారి  పెళ్ళి జరిపించాలనుకుంటుంది. కానీ ప్రమాదవశాత్తు ఆమె చనిపోతుంది. తండ్రి కోరికపై మీనా, అక్కపిల్లల పెంపకం కోసం తన అక్క భర్తను పెళ్ళిచేసుకుంటుంది.  పరిస్థితులతో రాజీపడి ప్రశాంతంగా  కాపురం చేసుకుంటూ ఉంటుంది. ఇలా ఉండగా రాజేందర్ మళ్ళీ తారసపడతాడు. ఆమె భర్త (అశోక్ కుమార్)

కు కూడా పరిచయమవుతాడు. ఆమె భర్తకు రాజేందర్ పెయింటింగ్స్, పాటలు చాలా నచ్చుతాయి. రాజేందర్‌తో స్నేహం చేస్తాడు. వారింటికి రాజేందర్ రాకపోకలు జరుగుతూ ఉంటాయి. మీనాలో సంఘర్షణ మొదలవుతుంది. తెలుగులో వచ్చిన 'అభినందన' చిత్రం గుర్తుకొస్తోంది కదూ!

'గుమ్‌రాహ్'లో పాటలు ఎంత బావుంటాయో హిందీ సినీ సంగీత ప్రేమికులందరికీ తెలిసినదే. తెలియనివారికి చెప్పాలంటే 'అభినందన'లో పాటలు ఎంత బావుంటాయో అంత బావుంటాయని చెప్పవచ్చు. ఆత్రేయ ఇళయరాజా కాంబినేషన్‌లో ఆ పాటలు ఎంత హృద్యంగా రూపుదిద్దుకున్నాయో, అంతకు రెండు దశాబ్దాల ముందు సాహిర్ - రవి కాంబినేషన్‌లో 'గుమ్‌రాహ్' పాటలు రూపుదిద్దుకున్నాయి. 'చలో ఎక్‌బార్ ఫిర్‌సే' పాటతో సాహిర్ సాహిత్యంలో అత్యున్నత ప్రమాణాలు స్థాపించారు.'యే హవా యే హవా' పాటలో సాహిర్ సాహిత్యం, రవి సంగీతం ఒక ప్రేమికుడి విరహానికి ఆర్ద్రమైన రూపం కల్పిస్తే మహేంద్రకపూర్ గాత్రం దానికి ప్రాణం పోసింది.



మీనా పెళ్ళయిన తర్వాత రాజేందర్ మళ్ళీ కలిసినపుడు భర్త ఊళ్ళో లేని సమయంలో అతన్ని కలుస్తూ ఉంటుంది. భర్త రాగానే మానుకుంటుంది. ఈ సందర్భంలో వచ్చే పాట 'యే హవా యే హవా'. అతని తాపత్రయం, తప్పొప్పులు మరిపింపజేసే అతని గొంతులో ఆర్ద్రత విని ఆమె పరుగున అతని వద్దకు బయలుదేరుతుంది. ఆ సన్నివేశానికి తగినట్టు సాహిర్- రవి మహేంద్రకపూర్‌ల కలయికలో అద్భుతమైన ఈ పాట రూపొందింది.



హవా అంటేగాలి, ఫిజా అంటే ఋతువు. ఉదాస్ అంటే దిగులు పడటం 'ఆభీ జా' అంటే వచ్చేయ్‌ఇక' అని.

**ఈ గాలి ,ఈ గాలి, ఈ గాలి,ఈ వేళ ఈ వేళ**
**చిన్నబోయే నా మది వలె మదివలె మదివలె**
**రారాదా, రారాదా, రారాదా**

గాలి అతని మనసులా దిగులుగా ఉండటం. వేళ కూడా చిన్నబోయిందట. ఆమె వస్తే అతని మనసుతో పాటు పరిసరాలకు కూడా చైతన్యం వస్తుందని ఆమెను రమ్మంటున్నాడు. తొందర పెడుతున్నాడు. పునరుక్తితో ఆలోచించుకోవటానికి సమయం ఇవ్వకుండా తొందరపెట్టే ప్రభావాన్ని చక్కగా రాబట్టారు కవి, సంగీతకర్త.



చాంద్‌నీ అంటే వెన్నెల. జర్ద్ అంటే మండేది. ఆంచ్ అంటే సెగ. సర్ద్ అంటే చల్లనిది. ధడ్‌కన్ అంటే గుండె చప్పుడు. 'ఆకే మిల్' అంటే వచ్చి కలువు'అని.

**వెన్నెలొచ్చె గాని ఇపుడు మంట రేపేను, రేపేను, రేపేను,**
**గుండెలోని సన్నని సెగ చల్లనయేను, ఆయేను, ఆయేను**
**రేయి వెళ్ళిపోయేను రా ఇక, రా ఇక, రా ఇక,**

విరహంలో ఉన్నవారికి వెన్నెల మంటలు రేపినట్టు ఉంటుంది. గుండె సవ్వడిలో సన్నని సెగ ప్రాణానికి చిహ్నం. సన్నని ఆ ప్రాణదీపం కొడిగడుతొందని అతని భావం. ఆమె లేకపోతే తన ప్రాణం నిలువదని, రేయి దాటిపోక ముందే రమ్మని వేడుకుంటున్నాడు.

రాహ్ అంటే దారి. బిఛీ అంటే పరచబడినది. నజర్ అంటే చూపు. తడప్‌నా అంటే తల్లడిల్లటం. బేఖబర్ అంటే తెలియకపోవటం. సాఁస్ అంటే శ్వాస.



**'దారిలో పరిచాను నే ప్రతి చూపును, చూపును, చూపును,**
**తల్లడిల్లుతున్నాను నే, నీకు తెలియదు, తెలియదు, తెలియదు**
**శ్వాస ఆగుతోంది రా ఇక, రా ఇక, రా ఇక,**

అతని ప్రతి చూపు ఆమె రాక కోసం ఎదురుచూస్తోంది. నేను తపించిపోతుంటే నీవు పట్టించుకోవటంలేదని అంటున్నాడు. శ్వాస ఆగిపోతున్నట్టు ఉంది. అతనికి. అతని పిలుపువిని ఆమె పరుగున వస్తుంటే ఆమె భర్త ఆ పాట వింటూ దారిలో నిలబడి ఉంటాడు. రాజేందర్ పాటకు అతడు ముగ్ధుడవుతాడు. యాంటీ క్లైమాక్స్‌లాంటి ఈ మలుపు బి.ఆర్. చోప్రా దర్శకత్వ ప్రతిభకు నిదర్శనం.

**-పి.వి.సత్యనారాయణ రాజు**

మార్చి 3 హిందీ సినీ సంగీత దర్శకుడు రవి జన్మదిన సందర్భంగా....

# రవి హిట్స్

## చిత్రం: ఢిల్లీ కా థగ్(1958)

రచన :మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం : కిశోర్‌కుమార్

అ: హమ్ తో మొహబ్బత్ కరేగా దునియా సే నహీం డరేగా
చాహే యే జమానా కహే హమ్‌కో దీవానా అజీ॥హమ్॥
చుప్‌కే సే ఆప్ తో, దిల్ లేకే చలే జాతే హైం
పీఛే పీఛే దివానే
ఫిర్ భీ చలే ఆతే హైం ॥2॥
ఆ: మేరీ జూతీ సే!!
అ: జూతా పాలిశ్ కరేగా, లేకిన్ తుమ్ పర్ మరేగా
చాహే యే జమానా కహే హమ్‌కో దివానా అజీ
హమ్ తో మొహబ్బత్ కరేగా దునియా సే నహీం డరేగా
ఠోకర్ సే ఔర్ భీ అర్‌మాం యే జవాం హోతే హైం
దునియా మేం హమ్ జైసే
ఆషిక్ భీ కహాం హోతే హైం ॥2॥
ఆ: అరె వాహ్ రె మజ్నూ
అ: లైలా లైలా కరేగా ఠండీ ఆహేం భరేగా
చాహే యే జమానా కహే హమ్‌కో దీవానా అజీ
హమ్ తో మొహబ్బత్ కరేగా దునియా సే నహీ డరేగా
దూర్ హో హో కే అజీ యూం నా సతావో హమ్‌కో
హమ్ జీతేం కైసే భలా
యే తో బతావో హమ్‌కో ॥2॥
ఆ: డూబ్ మరో
అ: డూబేగా నహీం తైరేగా ప్యార్ సే హమ్ నహీం డరేగా
చాహే యే జమానా కహే హమ్‌కో దివానా అజీ
హమ్ తో మొహబ్బత్ కరేగా దునియా సే నహీడరేగా
చాహే యే జమానా కహే హమ్‌కో దివానా అజీ
హమ్ తో మొహబ్బత్ కరేగా
హమ్ తో మొహబ్బత్ కరేగా

## చిత్రం: చైనా టౌన్(1962)

రచన :మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం : రఫీ

బార్ బార్ దేఖో, హజార్ బార్ దేఖో
కి దేఖ్‌నే కీ చీజ్ హై, హమారా దిల్‌రుబా, టాలి హో
టాలి హో, టాలి హో
హాం జీ హాం, ఔర్ భీ హోంగే దిల్‌దార్ యహాం
లాఖోం దిలోం కీ బహార్ యహాం
పర్ యే బాత్ కహాం ॥2॥
యే బేమిసాల్ హుస్న్,లాజవాబ్ యే అదా, టాలి హో
టాలి హో, టాలి హో
దిల్ మిలా, ఏక్ జానే మెహఫిల్ మిలా
యా చిరాగే మంజిల్ మిలా
యే న పూఛో కి కహాం ॥2॥
నయా నయా యే ఆషికీ కా రాజ్ హై మెరా , టాలి హో
టాలి హో, టాలి హో
(బల్లే, బల్లే, ఉఠ్‌కే మిస్టర్ క్యూం చలే
ప్యార్ పే మేరే కహో క్యూం జలే
బైఠ్ భి జావో మెహర్‌బాం) ॥2॥
దువా కరో మిలే తుమ్హే భి ఐసా దిల్‌రుబా, టాలిహో
టాలి హో, టాలి హో ॥బార్॥

## చిత్రం: వక్త్(1966)

రచన : షకీల్‌బదయూని గానం: ఆశాభోంస్లే

జబ్ చలీ ఠండీ హవా, జబ్ ఉఠీ కాలీ ఘటా
ముఝ్‌కో ఏ జాన్-ఏ-వఫా తుమ్ యాద్ ఆయే ॥2॥
జిందగీ కీ దాస్తాం, చాహే కిత్‌నీ హో హసీం
బిన్ తుమ్హారే కుఛ్ నహీం, బిన్ తుమ్హారే కుఛ్ నహీం
క్యా మజా ఆతా సనమ్, ఆజ్ భూలేసే కహీం
తుమ్ భి ఆ జాతే యహీం, తుమ్ భి ఆ జాతే యహీం
యే బహారేం యే ఫిజా, దేఖ్‌కర్ ఏ దిల్‌రుబా
జానే క్యా దిల్ కో హువా, తుమ్ యాద్ ఆయే ॥జబ్ చలీ॥
యే నజారే యే సమా, ఔర్ ఫిర్ ఇతనే జవాం
హాయె రే యే మస్తియాం, హాయె రే యే మస్తియాం,
ఐసా లగ్‌తా హై ముఝే, జైసే తుమ్ నజ్‌దీక్ హో
ఇస్ చమన్ సే జాన్-ఏ-జాం,
ఇస్ చమన్ సే జాన్-ఏ-జాం,
సున్‌కే ఉస్‌కీ సదా, దిల్ ధడకతా హై మెరా
ఆజ్ పహలేసే సివా తుమ్ యాద్ ఆయే ॥జబ్ చలీ॥

## చిత్రం: ప్యార్ కియా తో డర్నా క్యా(1963)

రచన :సాహిర్ లుధియాన్వి గానం : రఫీ

జాన్ -ఏ-బహార్ హుస్న్ తేరా బేమిసాల్ హై
వల్లాహ్ కమాల్ హై, అరే వల్లాహ్ కమాల్ హై
ఆయీ హై మేరే పాస్ తూ ఇస్ ఆన్-బాన్ సే
ఉత్‌రీ హో జైసే కోయీ పరి ఆస్‌మాన్ సే
మైం క్యా కహూం ఖుషీ సే అజబ్ మేరా హాల్ హై
హాయ్ యే తేరి మస్త్ అదామేం యే బాంకపన్ ॥2॥
కిరణోం కో భీ మైం ఛూనే న దూంగా యే గోరా తన్
తుఝ్‌సే నజర్ మిలాయే యే కిస్‌కీ మజాల్ హై
మైం ఖుష్‌నసీబ్ హూం కే తుఝే మైంనే పా లియా ॥2॥
తూనే కరమ్ కియా ముఝే అప్‌నా బనా లియా
ఐసే మిలే హైం హమ్ కి బిఛడనా ముహాల్ హై

## చిత్రం: ఉస్తాదోం కా ఉస్తాద్(1963)

రచన :అసద్ భోపాలి గానం : రఫీ

సౌ బార్ జనమ్ లేంగే, సౌ బార్ ఫ్రాణ్ దేంగే
ఏ జాన్ - ఏ- వఫా ఫిర్ భీ, హమ్ తుమ్ న జుదా హోంగే
కిస్మత్ హమేం మిల్‌నే సే , రోకేగీ భలా కబ్ తక్
ఇన్ ప్యార్ కీ రాహోం మేం, భట్‌కేగి వఫా కబ్ తక్
కదమోం కే నిశాం ఖుద్ హీ, మంజిల్ కా పతా హీదేంగే
యే కైసీ ఉదాసీ హై , జో హుస్న్ పే ఛాయీ హై
హమ్ దూర్ నహీం తుమ్ సే, కహ్‌నే కో జుదాయీ హై
అర్‌మాన్ భరే దో దిల్, ఫిర్ ఏక్ జగహ్ హోంగే




"ఇప్పటికి పదిసార్లు అడిగాను.... తీసుకున్న నా డబ్బు తిరిగి ఇచ్చేయమని..... అసలు నువ్వు పట్టించుకోవడంలేదు"

"దాన్దేముందీ ...నేను కూడా అప్పకోసం నీ చుట్టూ పాతికసార్లు తిరగలేదూ !? ఓపికుండాలోయ్"



అందంగా లేని ఓ కుర్రాడు ఓ రాజకీయ సభకొచ్చిన నాయకుణ్ణి ఆటోగ్రాఫ్ అడిగాడు. అందుకా నేతగారు ఒక పేజిపై గాడిద బొమ్మ వేసిచ్చారు. దానికా కుర్రాడు "సార్....నాకు కావాల్సింది మీ ఆటోగ్రాఫ్....ఫోటోగ్రాఫ్ కాదు" అన్నాడు వెంటనే.



గిరజాల జుట్టు, మాసిన గెడ్డంతో ఓ వ్యక్తి మైదానంలో రాళ్లని ఏరి దూరంగా పారేస్తున్నాడు

"చాలా సేపట్నుండి చూస్తున్నాను.....మీరిలా రాళ్లన్నీ ఎత్తి దూరంగా పారేయడానికి గల కారణం తెలుసుకోవచ్చా" అని అడిగాడు చూస్తున్న ఒకాయన కుతూహలంగా.

"రాత్రికి ఇక్కడ కవి సమ్మేళనం జరగబోతోంది.....అందులో నేను కవితలు చదవాలి అందుకనీ...." అన్నాడు ఆ మాసిన గడ్డం వ్యక్తి.



"మా ఆవిడ మొదటిసారిగా ఇంట్లో అడుగు పెట్టినరోజే దొంగతనం కూడా జరిగింది."

"అందుకే పెద్దలు అంటారు..కష్టాలు కూడబలుక్కుని వస్తాయని"



కామేశం చెంపచెళ్ళు మనిపించాడు రామేశం.

"సీరియస్‌గానే కొట్టావా ?" అడిగాడు కామేశం

"అవును"

"అలా అయితే ఫర్వాలేదు... పరిహాసాలంటే నాకు అస్సలు గిట్టదు సుమా" అన్నాడు కామేశం.

**ఈ జోకులను పంపించిన వారు : గుండాన జోగారావు ,రాయగడ, ఒరిస్సా.**



తన కంపెనీ మందుల గుణగుణాలన్నీ వర్ణించి ఆఖరున టాబ్లెట్ ఆకారంలో ఉన్న పేపరు వెయిట్ తీసి డాక్టరుకు బహుకరించాడు ఓ మెడికల్ రిప్రజెంటేటివ్.

"ఇది మా కంపెనీ తరపునుండి మీకో కానుక" అన్నాడు.

డాక్టరు దాన్ని అప్యాయంగా చేతిలోకి తీసుకుని అటూ ఇటూ తిప్పి "చాలాబాగుంది. కానీ దీనిని పేషంటు చేత మింగించడం ఎలా?" అని అడిగాడు ఆసక్తిగా.



సాక్ష్యం చెప్పేముందు ప్రమాణం చేయిస్తారని తెలియని ఓ సాక్షి ప్రమాణం చేయించగానే కంగారు పడిపోయాడు. లాయర్ గారు గంభీరంగా లేచి "వీరయ్య హత్యకేసులో నువ్వు ఏం చూసావో నిర్భయంగా చెప్పు" అన్నాడు సాక్షితో

"నిజం చెప్పమంటారా లేక ఇందాక వరండా మీద మీరు నేర్పించినది చెప్పమంటారా?" అడిగాడా సాక్షి అమాయకంగా.

**ఈ జోకులను పంపించిన వారు: పులిపాక తాజుద్దీన్, జయపూర్, ఒరిస్సా**

మహానటి :- (ఇంటర్వ్యూ ఇస్తూ) నేనింత గొప్పనటిని అయినందుకు మా ఊరివాళ్లంతా గర్వపడుతూ ఉంటారు.

విలేఖరి :- అది మీరు చేసుకున్న పుణ్యం.

మహానటి:- కానీ డాక్టరునవుదామనుకున్న నా చిన్ననాటి కోరిక మాత్రం నెరవేరలేదు.

విలేఖరి :- అది మీ ఊరి వాళ్ళు చేసుకున్న పుణ్యం.





"ఏవోయ్, నేనూ, ఆ అమ్మాయీ సంవత్సరం నుంచి ప్రేమించుకుంటున్నాం అని అన్నావ్ గదా! ఇద్దరూ కల్సి ఎన్ని సినిమాలు చూసారోయ్?"
"లేదు , ఒక్కటి కూడా చూళ్లేదు."
"లాభంలేదు. నువ్వట్టి వీక్ కాండిడేట్‌వి".
"చూసుంటే గొప్ప వాణ్నంటావా?"
"లేదు. ఆ అమ్మాయి వీక్ అన్నమాట."



"నాన్నా!నాన్నా! నువ్వు భూతాన్ని చూసావా?" రొప్పుతూ ఇంట్లోకి వచ్చిన ఆరేళ్ళ కొడుకు అడిగాడు పేపరు చదువుకుంటున్న తండ్రిని.
"దేనికిరా !" అడిగాడు తండ్రి, పేపరు చదువుతూనే.
"మా ఫ్రెండ్ వాళ్ల నాన్న నిన్న భూతాన్ని చూసాట్ట. వాడు గొప్పగా చెప్పకుంటున్నాడు" చెప్పాడు కొడుకు.
పేపర్లో నుంచి తల బయటకి తీసి అటుఇటుచూసి, తన భార్య అక్కడ లేదని నిర్ధారించుకున్నాక అన్నాడు కొడుకుతో -"నువ్వు గొప్పగా చెప్పకపోయావా మానాన్న దాన్ని ఏడేళ్ల క్రితం పెళ్లిచేసుకున్నాడని."



ఆఫీసరు గది ముందు బంట్రోతు కునుకు తీస్తున్నాడు కుర్చీమీద కూర్చొని. అటు వైపు వచ్చిన ఇంకో బంట్రోతు అతన్నిలేపి అడిగాడు "ఎంత ధైర్యంరా నీకు! మీ ఆఫీసరు ఉండగానే నిద్ర పోతున్నావ్!"
"ఇంతకు ముందే స్లైనే లోపలి కెళ్లిందిరా. నాకు తెల్సు అయ్యగారు ఇంకో గంట దాకా నన్ను లోపలికి పిలవడని." ఆవలిస్తూ చెప్పాడు నిద్ర పోతున్న బంట్రోతు.

ఈ జోకులను పంపినవారు : రమణశాస్త్రి, సంగారెడ్డి





"మా ఖాతా దారులంతా అడిగి మరీ తీసుకుంటారు మా బ్యాంక్ క్యాలండర్. మీరేంటి, ఇస్తుంటే కూడా తీసుకోట్లేదు" అడిగాడు బాంక్ మేనేజర్ క్యాలండర్ వద్దన్న ఖాతాదారుడ్ని.
"మొన్న మా ఆఫీసర్ గారింట్లో ఇన్‌కమ్ టాక్సు వాళ్ళు దాడి చేసినప్పుడు క్యాలండర్ చూసే బ్యాంకు ఖాతాలు, లాకర్లు కనిపెట్టారుట. అందుకనీ......" భయం భయంగా చెప్పాడా ప్రభుత్వోద్యోగి.



ఓ డాక్టర్ దగ్గరకు వెళ్లాడు ఓ వ్యక్తి. ఆ డాక్టర్‌తో అన్నాడు.
"డాక్టర్ ! నాకు కుడిచేయిని ఆపరేషన్ చేసి తీసెయ్యరూ?"
"అదేమిటి? ఎందుకలాగ...!"
"అవును డాక్టర్, మాయావిడ పుంఖాను పుంఖాలుగా రాసి పారేస్తున్న కథలు నవలు ఫెయిర్ చేయలేక ఛస్తున్నాను".



"మాయావిడ ఒట్టికలుపుగోలు మనిషి ఎవ్వరినైనా నరే పలకరించకుండా వదలదు"
"ఓ విధంగా నీవు అదృష్ట వంతుడివి మా యావిడ ఒట్టి కొనుగోలు మనిషి..... ఏదీకొనకుండా అస్సలు వదలదు..."



ఓ వ్యక్తి ఓ శిలా విగ్రహం చూస్తూ ఓ పెద్దమనిషిని అడిగాడు.
"సార్ ! ఆమనిషి ఏమి చేశాడని ప్రజలు శిలా విగ్రహం కట్టించారు".
"ఒకే ఒక ధర్మం చేసాడు అదిచాలదు..."
"ఏం ధర్మం?"
"కాలధర్మం" చెప్పాడు ఆ పెద్దమనిషి

ఈ జోకులను పంపించిన వారు : బి.వి.ఎస్. బాబు. గాంధీనగర్ ,తెనాలి.

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన **గుండాన జోగారావు (రాయగడ, ఒరిస్సా), పులిపాక తాజిద్దీన్(జయపూర్, ఒరిస్సా), రమణశాస్త్రి (సంగారెడ్డి), బి.వి.యస్.బాబు(తెనాలి)** గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'ఐ యామ్ ఇన్ లవ్ విత్ యూ' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.





# మరపురాని గాయకుడు పిఠాపురం



**"మాయా సంసారం తమ్ముడూ**
**నీ మదిలో సదాశివుని**
**మరువకు తమ్ముడూ...(ఉమాసుందరి 1956)**
**"నమ్మకురా ఇల్లాలు పిల్లలూ**
**బొమ్మలురా జీవా" (ఉమాసుందరి 1956)**

మధురమైన పాటలు! మరపురాని ... మరువలేని పాటలు.

ఆ పాటలు పాడిన మధుర గాయకుడు పిఠాపురం నాగేశ్వరరావు.

మనలోకాన్ని వదిలి వెళ్లిపోయి 8 సంవత్సరాలు గడిచిపోయినా ఆయన్ని మరచిపోలేక పోతున్నాం. ఇందుకు కారణం ఒకటా.... రెండా.... కొన్ని వేల పాటలు. తెలుగు శ్రోతలను ఐదు దశాబ్దాల పాటు ఆనంద డోలికల్లో తేలించిన పాటలవి. తెలుగువారి సాంస్కృతిక జీవనంలో ఓ అంతర్భాగం పిఠాపురం మధురగానం. 'అమరమె గాదా ఆంధ్రుల గాథ వినవోయ్ సోదరా' అంటూ తెలుగువారి హృదయాంతరాల్లోని వేడిని తన జానపద సంగీత మాధుర్యంతో చిరుజల్లులు కురిపించి సేద తీర్చిన వాణి ఆయనది.

నేపథ్యగాయకుడిగా ఓ వెలుగు వెలిగిన నాగేశ్వరరావు ఇంటి పేరు పాతర్ల గడ్డ. కానీ తన ఊరిపేరునే ఇంటి పేరుగా మార్చుకుని సినిమారంగంలో స్థిరపడ్డారాయన.

పాతర్లగడ్డ విశ్వనాథం, అప్పాయమ్మలకు మొదటి సంతానంగా1930లో జన్మించిన నాగేశ్వరరావు బాల్యమంతా పిఠాపురంలోనే గడిపారు. పెద్దగా చదువులో శ్రద్ధ చూపక పోయినా 12వ ఏటనే రంగస్థల నటుడుగా రాణించారు. పిఠాపురంలో నవ్య కళాసమితి (1942) ఏర్పాటు చేసి 'చింతామణి', 'కురుక్షేత్రం', 'బాలనాగమ్మ' మొదలైన నాటకాలు ప్రదర్శించారు.

నాగేశ్వరరావు నాటకరంగంలో మంచిపేరు తెచ్చుకున్నా, తల్లిదండ్రులు వద్దనుండి తగిన ప్రోత్సాహం కరువైంది. పైగా నాటకాలు వద్దని అస్తమానం పోరేవారు. ఆ పోరు భరించలేక హీరో అవ్వాలని నాగేశ్వరరావు మద్రాసు చేరుకున్నారు. తీరా మద్రాస్‌లో దిగాక జేబు చూసుకుంటే తన వద్ద వున్నది 10 రూపాయిలే. ఆ 10 రూపాయిలు అయిపోగానే హోటల్‌లో సర్వర్‌గా చేరారు. 1946లో పువ్వాడసోదరులు కోన ప్రభాకరరావు పర్యవేక్షణలో నిర్మించిన "మంగళసూత్రం" లేక "ఇది మా కథ" వురఫ్ "ఎక్స్ క్యూజ్‌మి" లో పిఠాపురం మొట్టమొదట 'హాయిగా పాడవే కోయిలా' అనేపాటను పాడారు. సంగీతం పి.మునుస్వామి. సాహిత్యం సదాశివ బ్రహ్మం. నాయిక లక్ష్మీరాజ్యం మొదలు పెట్టే యీపాట రెండో చరణం జిక్కి 'నీవు నేను' అని ప్రారంభిస్తుంది. చివరిది పిఠాపురం. చివరన ముగ్గురూ పల్లవి పాడతారు. ఈ పాటకుగాను పిఠాపురం అందుకున్న పారితోషికం 250



రూపాయలు. ఆ రోజుల్లో అదిపెద్దమొత్తం. బి.ఎన్.రెడ్డి,ఘంటసాలకు తొలి చిత్రంలో (స్వర్గసీమ) ఇచ్చింది 116 రూపాయలే! తొలి పాట పాడేనాటికి పిఠాపురం వయసు కేవలం16 సంవత్సరాలే. నిజానికి అంత చిన్న వయసులో నేపథ్యగానం చేసిన గాయకుడు సినిమా రంగంలో అతనొక్కడే.

1948లో ఘన విజయం సాధించిన స్వతంత్రా వారి "ద్రోహి" చిత్రంలో రాముడుగా నటించిన ఎల్.వి. ప్రసాద్‌కు పిఠాపురం పాడిన "బుల్ బుల్ పిట్టా" పెద్ద హిట్. ఆ వెంటనే జెమినీ వారి "చంద్రలేఖ" (తమిళం)లో ఆయన పాడిన తమిళ పాటలు బాగా పేరుతెచ్చాయి. ఇక గాయకుడిగా తిరుగులేక పోయింది. వివిధ భాషల్లో సుమారు ఐదువేల పాటలు పాడారాయన. ''వల్లాటి యుద్ధం'', "వింధ్యరాణి", "సౌదామిని", "స్వప్నసుందరి", "మాయారంభ", "పేరంటాలు", "సంఘం" ఆయన పాడిన తొలినాటి చిత్రాలు

'ఆంధ్రా మహమ్మద్ రఫీ' గాపేరుపొందిన పిఠాపురం నాగేశ్వరరావులో ఓ ప్రత్యేకత వుంది. అతడు పాడిన పాటల్లో అధికశాతం జానపదుల యాస,శైలి తొణికిసలాడటమే అతడి స్పెషాలిటీ. ఆ ప్రత్యేకతే ఆయన్ను 50 ఏళ్లు పరిశ్రమలో నిలబెట్టింది.

జమునారాణి, పిఠాపురం నాగేశ్వరరావుల జంట తెలుగు సినీ సంగీతంలో బాగా పాపులర్ అయిన జంట. వారిద్దరూ యేనాటి నుంచో హాస్యగీతాలలో ప్రేమ మిళాయించీ, ప్రేమ గీతాలలో హాస్యం చిలకరించి శ్రోతలను తన్మయ పరచిన జంట. చిక్కని మాటలు గల పాటా, చక్కని మలుపులు గల వరసా వీరికి దొరికిందంటే నా సామిరంగా, దుమారం లేపేస్తారు. ఊరికే అరిచి గొడవ చేసి దుమారం లేపడం గొప్పకాదు, వీరలా హాయిగా పాడుతూ, అందులోనే అల్లరి ధ్వనింపజేస్తూ దుమారం లేపడం అదీ గొప్ప.

"విమల", "వరకట్నం", "కలిసొచ్చిన అదృష్టం" మొ॥ చిత్రాల్లో వీరిద్దరూ పాడిన పాటలు బాగా పాపులర్ అయ్యాయి. అయితే వీరిద్దరి పాటలూ విడిగా గానీ, కలిపిగానీ మనకు కాసెట్ల రూపంలో లేకపోవడం మన దురదృష్టం.

పిఠాపురం, ఘంటసాలతో కలిసి పాడిన ఎన్నో పాటలు హిట్టయ్యాయి. 'వయసు మళ్లిన వన్నెలాడి' (అన్నా తమ్ముడు), 'మా వూళ్లో ఒకపడుచుంది' (అవేకళ్లు) మొదలైన పాటలు పిఠాపురంకు పేరు తెచ్చిపెట్టినవే. ఆ తర్వాత కచేరీల్లోనూ ఆయన పాడినవే.

ఇక అందరికీ తెలిసిన విషయం -

మాధవపెద్ది సత్యంతో కలిసి పిఠాపురం రాణించడం. వీరిద్దరి జంట బాగా పాపులర్ అయ్యింది. వీరిద్దరూ కలిసి జంటగాయకులుగా (జంట కవులవలె) ఒక వెలుగు వెలిగారు. మాధవపెద్ది సత్యంతో కలిసి వేలాది కచేరీలు చేసారు పిఠాపురం. 'ఓరేయ్ అన్నయ్యా' అని పిఠాపురం అంటే 'ఏరా తమ్ముడూ' అనేవారు సత్యం. "వీడు (పిఠాపురం) క్రిందట జన్మలో నా భార్యేమోనని నా అనుమానం" అని మాధవపెద్ది అంటూంటే, వెంటనే పిఠాపురం "ఓరేయ్ ఓరేయ్ అన్నాయ్" అని అంటూ కచేరీలలో జనాన్ని నవ్వించేవారు.

"ఏరా మనతోటి గెలిచే ధీరులెవ్వరురా" అని "సువర్ణ సుందరి"లో కలసి పాడిన వీరిద్దరూ చివరి వరకూ అలాగే బ్రతికారు. ఇక అందరికీ తెలిసిన పాటల గురించి చెప్పుకుంటే పెద్ద దండకమే అవుతుంది.

"రాజు వెడలి వచ్చే" (మాయల మారి; ఆర్. బాల సరస్వతితో కలిసి), "(అరె! నిసగ మాపా" (జయసింహ), "బదిలీ ఐపోయింది భామామణి ప్రియ భామామణి" పాటలో మధ్య మధ్య "సైతానులాగా మామయ్యా" పదాలను అద్భుతంగా పలికారు పిఠాపురం. (చరణదాసి) "నాడి చూడగలరా" (రూపవతి) "హుషారు గుండాలోయ్' (అంతేకావాలి; పి.లీలతో కలసి) "అందచందాల ఓ జాబిలీ" (వరుడు కావాలి; పి.భానుమతి, ఘంటసాలతో కలసి), "అమరమె గాదా ఆంధ్రుల గాథ" (ప్రజా రాజ్యం), "మాయ దారి కీచులాట మామధ్య వచ్చింది, రాయబారం చేయవే తడికో తడికా (అత్తా ఒకింటి కోడలే; స్వర్ణలతతో కలసి) "చిక్కావె చినదానా" (బొమ్మలపెళ్లి; శివాజీ గణేశన్‌కు ప్లేబాక్) "రత్తమ్మో రత్తమ్మో" (అన్నపూర్ణ; స్వర్ణలతతో కలసి), "ఆంధ్రా సోడా" (లక్ష్మినివాసం).

"అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే" (కులగోత్రాలు; మాధవపెద్దితో కలసి) "ఒక్కసారి ఓటిచ్చి పంపితే మీ జోలికి ఇక రామండీ" (రంగులరాట్నం)... ఇలా పిఠాపురం పాడిన పాటలన్నీ సూపర్ హిట్సే. పిఠాపురం సినిమా పాటలే గాక ఎస్.రాజేశ్వరరావు సారథ్యంలో పాడిన, 'హృదయ సంద్రమా' వంటి ప్రయివేటు పాటలూ బాగా పాపులర్ అయ్యాయి.

ఘంటసాల మరణంతో పిఠాపురంకు అవకాశాలు తగ్గాయి. స్వర్ణ యుగం మాయమవడంతో తాను సినిమాల్లో అప్పుడప్పుడూ పాడినా, ఎక్కువగా కచేరిల (మాధవపెద్దితో కలిసి) చేసేవారు. 1975లో ఆయన భార్య భాస్కరమ్మ చనిపోవడంతో, ఆయన మానసికంగా బాగా కృంగి పోయారు. మరో 10 ఏళ్ళకు ఆయన రెండో కుమారుడు చనిపోయాడు. దీంతో మరింత మానసిక క్షోభకు గురైన పిఠాపురం జ్ఞాపకాలతో మద్రాసులో వుండలేక పిఠాపురం వచ్చేసారు. తర్వాతర్వాత కచేరీలు చేసుకుంటూనే 1996, మార్చి 5వతేదిన స్వగృహంలో మరణించారు.

ఊరిపేరును పేరు ముందు చేర్చుకుని, తనకంటూ ఓ ప్రత్యేకత సాధించుకుని 50ఏళ్లు (1946-1996) సినిమా సంగీతానికి సేవచేసిన పిఠాపురం నాగేశ్వరరావు నిజంగా ధన్యజీవి. ఈరోజున మాధవపెద్ది లేడు, పిఠాపురం లేడు. కానీ వారి పాటలున్నాయి. ఆ పాటలు వింటూ వుంటే వారిద్దరూ స్టేజీ మీద పాడుతూ చేసే విన్యాసాలు లీలగా గుర్తుకొస్తాయి, వెంటనే కళ్లు చెమర్చుతాయి.

ఇదంతా తలచుకుంటే మళ్లీ గుర్తుకొచ్చేది కూడా పిఠాపురం పాటే

"మాయా సంసారం తమ్ముడూ
నీ మదిలో సదాశివుని
మరువకు తమ్ముడూ...
మాయా సంసారం తమ్ముడూ.."

**- కంపల్లె రవి చంద్రన్**


STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS OF HAASAM HAASYA SANGEETHA PATHRIKA HYDERABAD AS REQUIRED UNDER RULE 8 OF NEWSPAPERS (CENTRAL) RULES, 1956

FORM IV (See Rule 18)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Hyderabad |
| 2. | Peroidicity of Publication | Fortnightly |
| 3. | Printer's Name<br>Whether citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 4. | Publisher's Name<br>Whether citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 5. | Editor's Name<br>Whether Citizen of India<br>Address | Raja<br>Indian<br>32,Suneetha Apartments,<br>Amberpet, Hyderabad-18. |
| 6. | Name & Addresses of Individuals<br>Who Ownthe Newspapers | Hummus Infoway Pvt. Ltd.<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 7. | Shareholders holding more than one<br>percent of the total Capital | 1. K.I.Varaprasad Reddy<br>2. P.Subbarao |

I, K.I. Varaprasad Reddy, hereby declare that the particualrs given above are true to the best of my knowledge and belief.

Date : 01-03-2004.

sd/-
K.I.Varaprasad Reddy
Publisher



# పిఠాపురం హిట్స్

## చిత్రం: అవేకళ్ళు (ఘంటసాలతో కలిసి)

రచన :కొసరాజు      సంగీతం : వేదా

ప: మా ఊళ్ళో ఒకపడుచుంది
దయ్యమంటే భయమన్నది
ఆ ఊళ్ళో ఓ చిన్నోడు నేనున్నాలే పదమన్నాడూ
చెమ్మచెక్క చెమ్మచెక్క చెమ్మచెక్క
మల్లె మొగ్గ మల్లె మొగ్గ మల్లె మొగ్గ
చెమ్మచెక్క చెమ్మచెక్క చెమ్మచెక్క
మల్లె మొగ్గ మల్లె మొగ్గ మల్లె మొగ్గ
హే...బలె బలె బలె బలె బలే ... య్యా ॥మా ఊళ్ళో॥

చ. కంటిమీద కునుకురాదు బాబో అంది
కన్నుమూసుకో నన్ను తలచుకో పిల్లా అన్నాడు ॥కంటి॥
ఓలమ్మో గైరమ్మో చీకట్లో చూసిందేదో
ఓలమ్మో గైరమ్మో కెవ్వంటూ ఆరచిందయ్యో
హట్కే హట్కే హట్కే
హే...బచ్కే బచ్కే బచ్కే
హట్కే హట్కే హట్కే
హే...బచ్కే బచ్కే బచ్కే
హే...బలె బలె బలె బలె బలే ... య్యా ॥మా ఊళ్ళో॥

చ. బుర్రుపిట్ట తుర్రుమంటే బాబో అందీ
అత్తకొడుకని అరవబోకులే పిల్లా అన్నాడు
ఓలమ్మో గైరమ్మో చీకట్లో చూసిందేదో
ఓలమ్మో గైరమ్మో కెవ్వంటూ ఆరచిందయ్యో
హట్కే హట్కే హట్కే
హే...బచ్కే బచ్కే బచ్కే
హట్కే హట్కే హట్కే
హే...బచ్కే బచ్కే బచ్కే
హే...బలె బలె బలె బలె బలే ... య్యా ॥మా ఊళ్ళో॥

## చిత్రం: కులగోత్రాలు (మాధవపెద్ది సత్యంతో కలిసి)

రచన :కొసరాజు      సంగీతం : ఎస్.రాజేశ్వరరావు

ప. అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే
అయ్యయ్యో జేబులు ఖాళీ ఆయెనే ॥అయ్యయ్యో॥
ఉన్నది కాస్త ఊడింది
సర్వమంగళం పాడింది
పెళ్ళాం మెడలో నగలతో సహా
తిరుక్షవరమై పోయింది ॥అయ్యయ్యో॥

చ. ఆ మహామహా నలమహారాజుకే తప్పలేదు భాయీ
ఓటమి తప్పలేదు భాయీ
మరి నువ్ చెప్పలేదు భాయీ
అది నా తప్పు కాదు భాయీ
తెలివి తక్కువగా చీట్ల పేకలో దెబ్బతింటివోయి
బాబూ నిబ్బరించవోయీ ॥అయ్యయ్యో॥

చ. నిలువు దోపిడి దేవుడికిచ్చిన ఫలితం దక్కేది
ఎంతో పుణ్యం దక్కేది - గోవిందా గోవిందా ॥నిలువు॥
చక్కెర పొంగలి చిక్కేది
ఎలక్షన్లలో ఖర్చుపెడితే ఎమ్మెల్యే దక్కేది
మనకు అంతటి లక్కేది ॥అయ్యయ్యో॥

చ. గెలుపు ఓటమి దైవాధీనం చెయ్యి తిరగవచ్చు
మళ్ళీ ఆడి గెల్వవచ్చు
ఇంకా పెట్టుబడెవడిచ్చు
ఇల్లూ కుదువ పెట్టవచ్చు
ఛాన్సు తగిలితే ఈ దెబ్బతో మన కరువు తీరవచ్చు
పోతే.... అనుభవమ్మువచ్చు
చివరకు జోలె కట్టవచ్చూ ॥అయ్యయ్యో॥

## చిత్రం: రూపవతి

రచన :శ్రీ శర్మ      సంగీతం : సి.ఆర్.సుబ్బరామన్

నాడి చూడగలరా
మందులేవి దాచిరా
ఓ, సెలవీండి దయుంచి
భలేబలే వైద్యులే దండము అడేను దాసోహం ॥నాడి॥
తమరనే ఒకరు పనిబూని
చెడురోగాల చెండాడిరనీ
పలుప్రాంతాల వేలకువేలే; కథలేమేమొ విన్నానే
ఇక సందేహ మొకటే ఇందులోనా
మీ చేతిమాత్రా వైకుంఠయాత్రా ॥నాడి॥
పిడుగే లెండి మీ పేరు మరి
దిశలల్లాడె ధనధన ధన్ననా
ఇక సందేహ మొకటే ఇందులోనా
మీ చేతిమాత్రా వైకుంఠయాత్రా ॥నాడి॥
అటు శాస్త్రాల పిండేసిరటా
ఇటు వైద్యాల సారము తాగిరా
ఇక సందేహమొకటే ఇందులోనా
మీ చేతిమాత్రా వైకుంఠయాత్రా ॥నాడి॥

## చిత్రం: నాదీ ఆడజన్మే

రచన :దాశరథి      సంగీతం : ఆర్.సుదర్శనం

లెఫ్ట్ రైట్ లెఫ్ట్‌రైట్ ఎబౌ టర్న్ హాయ్ హాయ్ హాయ్
నా మాట నమ్మితివేలా నా మీద కోపమదేల
నను వీడి పోవుటమేలా ఏనాటికీ నిన్ను విడజాల
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్ లెఫ్టురైట్ లెఫ్టురైట్ అబౌట్ టర్న్ ॥నా మాట॥
కన్నులే సైగతో నన్ను రమ్మన్నవి
అయ్యయ్యో అంతలో వద్దు పొమ్మన్నవే
ఈ తై తై నాట్యాలేల ఇక పై పై కోపాలేల
నను వీడి పోవుటమేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥
నవ్వులే పువ్వులై నన్ను కవ్వించెనే
ముక్కుపై కోపమే నన్ను మురిపించెనే
నీ మదిలో రగిలే ప్రేమ
ఇక దాచావెందుకె భామా
నను వీడిపోవుట మేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥

# సరిగపదమని

**కూర్పు : టి.నవీన్**

**14**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 3 | | 4 | |
| | ■ | | ■ | 5 | | ■ | | ■ |
| ■ | 6 | ■ | 7 | ■ | 8 | | ■ | 9 |
| 10 | | 11 | | ■ | ■ | ■ | 12 | |
| | ■ | | ■ | 13 | | | ■ | |
| ■ | 14 | ■ | 15 | | ■ | ■ | 16 | |
| 17 | | ■ | | ■ | 18 | | ■ | |
| ■ | | ■ | | ■ | | ■ | 19 | ■ |
| 20 | | | ■ | 21 | | ■ | 22 | |

పంపినవారి పేరు :..........................................................

వయసు :........... వృత్తి :..................................................

చిరునామా :..................................................................

.....................................................................................

.................................................ఫోన్ :.......................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తో సహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**అడ్డం:-**

1. 'పచ్చని........ తోడుంటే పాడే కోయిల వెంటుంటే (4)
3. 'అపురూపమైనదమ్మ......... ఆ జన్మకు పరిపూర్ణత ఇల్లాలమ్మ (4)
5. '......మీద......గట్టి కోట్లు కూడబెట్టినట్టి కామందూ 'ప్రేమించు చూడు' చిత్రం కోసం ముళ్ళపూడి వెంకటరమణ రచించిన గీతం(2)
8. '....... వేణువులు మ్రోగే వేళా హాయి వెల్లువై పొంగే వేళా' బుద్ధిమంతుడు చిత్రంలోని పాట(2)
10. 'బాలీవుడ్..........ని పాటల్లో త్యాగరాజుని అందరిలో చిన్నవాడిని' రాజకుమారుడు చిత్రంలోని పాట(4)
12. 'ఏమెట్టి చేశాడే ముద్దుగుమ్మ నిను ఆ.......' స్టూడెంట్ నెం:1 అనిపించుకున్న కుర్రాడు పాడిన పాట(2)
13. '........ చేసిన మనుషుల్లారా మనుషులు చేసిన దేవుళ్ళారా వినండి మనుషుల గోల(3))
15. '...... మన్మథుడా అతి సుందరుడా' పెళ్ళిసందడి చిత్రం కోసం కీరవాణి స్వరపరిచిన గీతం(2)
16. .......జొన్న తోటలో ముసిరిన చీకట్లలో మంచెకాడ కలుసుకో' (2)
17. ఎప్పుడూ.......కోవద్దురా ఓటమి' సిరివెన్నెల గీతం(2)
18. 'అందమైన వెన్నెలలోన........ తెలుగు పడుచువలె' మోహన్‌బాబు అభినయించిన గీతం(2)
20. కారులో షికారుకెళ్ళే పాల బుగ్గల..........చానా(3)
21. 'ఇన్నాళ్ళగుర్తొచ్చానా...... ఎన్నాళ్ళన్దాకుంటావే పైనా' వర్షం చిత్రంలోని హిట్ గీతం(2)
22. లేచింది....... లేచింది మహిళాలోకం దద్దరిల్లింది పురుషప్రపంచం(2)

**నిలువు:-**

1. '......గౌను వేసుకున్న పెద్దపాప నీ....... నాటి ముద్దుపేరు లాలిపాప' ఎస్.వి.కృష్ణారెడ్డి స్వరపరిచిన గీతం(2)
2. 'నా....... చెపుతున్నాయి నిను ప్రేమించానని' అక్కినేని నాగేశ్వరరావు అభినయించిన గీతం(2)
3. '...... జలకమ్ములాడవే కలహంసలాగ- జలకన్యలాగ........ ......' సి.నారాయణరెడ్డి గీతం(3)
4. నడుము ఒంపులో నాట్యం చేసే......గంటలనే చూస్తుంటే కిలిమిరే(2)
6. '.......మురళీకృష్ణ మాకు బాల్య మిత్రుడే ఆశాభోంస్లే అక్షరాల అత్తకూతురే' (2)
7. 'వస్తాడు నారాజు ఈ...... ' అల్లూరి సీతారామరాజు చిత్రంలోని పాట(2)
9. '............. పర.............. ' అన్నమయ్య గీతం(5)
10. 'బహుదూరపు.......సారీ' ఘంటసాల ప్రైవేట్ గీతం(2)
11. 'కీరవాణి.....లో పిలిచిందొక హృదయం' స్వయంవరం చిత్రంలోని పాట(2)
13. ....... ....... ధవళాచల మందిర గంగాధర హర నమో నమో(2)
14. '.............. పప్పుకూడు తినరా ఓ నరుడా' (4)
15. 'నేను పుట్టాను లోకం మెచ్చింది నేను ఏడ్చాను లోకం నవ్వింది నేను........ ఈ లోకం ఏడ్చింది' ఆత్రేయ గీతం(3)
18. '........నాన్నైనా ఎవరైనా ఉండుంటే పైనుంచి ఈ వాన ఇట్టా దూకేనా' జూ. ఎన్.టి.ఆర్. అభినయించిన గీతం(3)
19. 'అత్త....... కోడలుత్తమురాలు ఓయమ్మా కోడలు..... అత్త గుణవంతురాలు' ఘంటసాల పాడిన చిత్రేతర గీతం(2)

**పజిల్, కూపన్ 15-03-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# సరిగపదమని-12

## జవాబులు

అడ్డం: 1. గోవిందు 3. నైజాం బాబులు 5. ఆరే 7.దినం 9.మతి 11.జన్మ 12. దంచవే 15. ఈ ప్రేమ 19. చేతిలోన 21. రాత్రి 22. నువ్వే

నిలువు: 2. వింత 3. నైరే 4.బాలా 5. ఆనందం 8.నీవే 10.తిరుమల 13.చదువు 14.దేవుడు 16. చేతిలో 17.రాత్రి 18. నిను 20.నవ్వు

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

ఎమ్.మోహన్- కాల్వ శ్రీరాంపూర్ (కరీంనగర్), కె.కళ్యాణ్ కుమార్- రామసముద్రం (చిత్తూరు), కె.జగదీష్‌బాబు- పార్వతీపురం (విజయనగరం), అమరా వెంకటేశ్వరరావు- నెల్లూరు, మన్నవ మాధవి- సత్తెనపల్లి, గంగారపు వెంకట్రావు- సత్తెనపల్లి (గుంటూరు), టి.ఎన్.కాశ్యప్ రావు- హైదరాబాద్, పి.లక్ష్మీదేవి- దొర్నిపాడు (కర్నూలు), బలగ సరితకుమారి- పాతపట్నం (శ్రీకాకుళం), బి.సింధువర్మ- హైదరాబాద్, బి.విహారిక వర్మ- హైదరాబాద్, కిశోర్‌కుమార్- 8 ఇంక్లైన్ కాలనీ (కరీంనగర్), పి.వి.సౌజన్య- హైదరాబాద్, చివుకుల చిరంజీవి- ఒంగోలు, ఓగిరాల- నెల్లూరు, ఎన్.జగన్మోహనరావు- ఆదిలాబాద్, దాస్యం వెంకట వంశీకృష్ణ- జంగారెడ్డిగూడెం (ప॥గో॥జిల్లా), ఘణుగం వెంకట రమణమూర్తి- హైదరాబాద్, ఎన్.జ్యోతిర్మయి- హైదరాబాద్, జాగిర్దార్ మాధురి- సామర్లకోట (తూ॥గో॥జిల్లా), ఎమ్.సుజాత కిరణ్- తిరుపతి, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడా పద్మావతి- విశాఖపట్నం, మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైదరాబాద్, కె.సౌందర్యవల్లి- విజయవాడ, ఎస్.శివశ్వేత- దేశపాత్రుని పాలెం, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), అయ్యగారి అన్నపూర్ణ- రాజోలు (తూ॥గో॥జిల్లా), అనుపోజు శివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళం), ఎ.పురుషోత్తంరావు- గజ్వేల్ (మెదక్), తాడి రంగారావు- రాజమండ్రి.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

సి.హెచ్.రవికుమార్- హైదరాబాద్, వై.రాజానాయుడు- పోతపోలు (చిత్తూరు), సామంచి సుధాకర్- విశాఖపట్నం, ఎస్.వి.ఎస్.భాగవానులు- ఒంగోలు, హరిబాబు- తిరుపతి, మానస- తిరుపతి, గంగాధర.వి.రావు- గుంటూరు, వడ్లమన్నాటి శ్వేత- విజయవాడ, తనికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, పి.ఎస్.రాజు- విజయవాడ, పి.లోకనాథ్- తిరుపతి, కోట్ల గణపతి- హైదరాబాద్, రోహిణి అయ్యర్- హైదరాబాద్, కోసూరి రవికుమార్- దాచేపల్లి (గుంటూరు), చల్లా లలితాదేవి- నెల్లూరు, ఆమంచి వెంకటలక్ష్మి కామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), ఉదయ భాస్కరరావు & విజయ- రాజమండ్రి, ఎన్.ఎస్.సీతాదేవి- అక్కయ్యపాలెం (తూ॥గో॥జిల్లా), జి.ఎస్.కిరణ్‌కుమార్-కాకినాడ, కె.వి.సుబ్బయ్య-గుంటూరు,వి.తేజశ్వని- సింధనూరు, ఎ.టి.శ్రీనివాసన్-అనంతపురం, వి.వి.రమణి- బాచెలి, ముదిగొండ సతీష్- సికింద్రాబాద్, బి.ప్రభాకర్‌రావు- హైదరాబాద్, కె.వి.దుర్గా మోహనరావు- నల్గొండ, కాటేపల్లి వసుంధర- నల్గొండ, ఎస్.మహబూబ్- నల్గొండ, స్రవంతి ఉమారెడ్డి- హైదరాబాద్, కె.మేఘన- రాజమండ్రి, వేముల శేఖర్- నిజామాబాద్, జ్యోతికృష్ణ.ఎమ్- సికింద్రాబాద్, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, ముపలె.అంబాజిరావు- కర్నూలు, ఎమ్.వి.ఎస్.ఎస్.ప్రసాద్- హైదరాబాద్, నేమాన సుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళం, వి.జానకి- సికింద్రాబాద్, ఎస్.వసుంధరారాణి- అనకాపల్లి, పోతాప్రగడ రాణి- నరసాపురం (ప॥గో॥జిల్లా), భి.విజయలక్ష్మి-నర్సిపట్నం (విశాఖజిల్లా), కె.వి.శరవణ్ కుమార్-సోదాం(చిత్తూరు), మహమ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), యమ్.డి.బషీర్ అహ్మద్- అచ్చంపేట (మహబూబ్‌నగర్), నెల్లూట్ల రమాదేవి- హన్మకొండ, డి.భవాని-విశాఖపట్నం, ఎస్.పి.మదుసూదన్- తిరుపతి, వనం జానకీదేవి- పాతపాల్యంచ, ఎస్.సత్యస్వరూప్- నెల్లూరు, జ్యోతి పట్నాయక్- కోరాపుట్ (ఒరిస్సా), రజని- కోరాపుట్ (ఒరిస్సా), యం.మీనాప్రభాకర్- బిజ్నాపల్లి (మహబూబ్‌నగర్), ఎ.పద్మావతి-శ్రీకాకుళం, గానుగపాటి సరోజనీదేవి- సికింద్రాబాద్, కామరాజు సదానందం- కవుల కుంట్ల (కడప), ఎమ్.కె.వర్ధిని- పొన్నలూరు (ప్రకాశం), యన్.శంకరాచార్యులు- చిలుకానగర్, సాంపాళె రమేష్-ఎమ్మిగనూరు, ఇమంచి రాజేశ్వరి- విశాఖపట్నం, డీబర్సు శ్రీదేవి- హైదరాబాద్, దిల్‌షాద్ ఫాతిమా- ధవళేశ్వరం (తూ॥గో॥ జిల్లా), సి.శేషాంజలి- అనపర్తి (తూ॥గో॥జిల్లా), కె.మురళీకృష్ణ- సత్తెనపల్లి (గుంటూరు), సి.నళినికుమారి- సికింద్రాబాద్, ఎమ్.మధూరి రంగరావు- నల్గొండ, ఓలేటి వెంకటసుబ్బారావు- విజయవాడ, డి.హరిప్రియ- అనంతపురం, ఎన్.సి.హెచ్. శ్రీనాయకి- నల్గొండ, గుండాన జోగారావు- రాయగడ (ఒరిస్సా), ఆత్మూరి వెంకటశరత్‌కృష్ణ- హైదరాబాద్, కె.ఎం.రమాదేవి- హైదరాబాద్, పడాల రాము-పాతపట్నం, సపారె ఈరణ్ణ-ఆదోని, గంటి వినయ్- అమలాపురం, ఇ.రాధిక- హైదరాబాద్, పి.పాపారావు- విశాఖపట్నం, ఎమ్.వి.ఎమ్.మురళి- మియాపూర్, జి.వంశీ ఉత్తేజ్-హైదరాబాద్, బి.ఉమాదేవి-ఆదోని, సోమయాజుల హిమబిందు- జైపూర్ (ఒరిస్సా), శిరంశెట్టి వెంకటరమణ-చండూరు(నల్గొండ), వేలివెంటి నాగస్వర్ణ అనసూయ- తెనాలి, పరాంకుశ మదుసూదన్- సికింద్రాబాద్, ఎమ్.వెంకటదుర్గా- సామర్లకోట, యస్.పల్లవి-నిజామాబాద్, కె.వెంకటేశ్వరరావు-అద్దంకి (ప్రకాశం), బిహారా శేషశాయి- సత్తెనపల్లి, రావుల వేణుగోపాల్-కాజీపేట (వరంగల్), పురాణపండ మేఘనా శ్రీరవళి- కాకినాడ, కావ్యప్రియ- అనంతపురం, వల్లూరి రజని- మండపేట (తూ॥గో॥జిల్లా), మద్దాలి మురళీకృష్ణ- నిజామాబాద్, మాడిశెట్టి గోపాల్- కరీంనగర్, ఎ.శివప్రసాద్- గుంటూరు, యం.మీనామృత-ద్రోణాచలం(కర్నూల్), పి.మహబూబ్ భాషా- ప్రొద్దుటూరు, బి.మనోహర్‌రాజు- నర్సాపూర్ (మెదక్), ఎ.మాధవిదేవి- హైదరాబాద్, గోపె కాకుమణి-కొండపి (ప్రకాశం), జి.సత్యవతి- విశాఖపట్నం, జి.కనకమహాలక్ష్మి- వెగయమ్మపేట (తూ॥గో॥జిల్లా), సత్యవతి- హైదరాబాద్, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, కె.శ్రీవల్లి- హైదరాబాద్, డి.మెహర్‌గౌతం- పార్వతీపురం (విజయనగరం), బాలనాగు స్వప్నరాజ్యలక్ష్మి- భీమడోలు (ప॥గో॥జిల్లా), ఆవల్లి దేవసేన సుబ్రహ్మణ్యేశ్వర్-అత్తిలి (ప॥గో॥జిల్లా), పి.తిరుమల ప్రసాద్- హైదరాబాద్, పాణ్యం ప్రత్యూష-హైదరాబాద్, లక్ష్మినారాయణ-కాగజ్‌నగర్, పర్చా వాసుదేవరావు-దేవరకొండ(నల్గొండ), రజని-హైదరాబాద్, తుర్లపాటి చంచలరావు- హైదరాబాద్, బులుసు కమలకుమార్- హైదరాబాద్, సి.విజయసారథి- కర్నూలు, కర్రి ఝాన్సీ- హైదరాబాద్, అవసరాల మణి-విశాఖపట్నం, ఎ.వీరభద్రరావు-పెద్దాపురం (తూ॥గో॥జిల్లా), ఎ.మల్లిఖార్జునరావు- హైదరాబాద్, ఎ.వీరమ్మడు- పెందుర్తి(విశాఖపట్నం), టి.ఎస్.హిమరాణి-కాకినాడ, పురుషోత్తపట్నం నాగరాజు- గుంటూరు, విష్ణు మానస కంచిరాజు- హైదరాబాద్, ఎ.పద్మిని-విశాఖపట్నం, పి.కృష్ణారావు- అమలాపురం(తూ॥గో॥జిల్లా), సి.వి.రాజేశ్వర్-విశాఖపట్నం, ఎమ్.సుహాసిని-హైదరాబాద్, ఎన్.మెహర్‌బాబా-విశాఖపట్నం, వి.శ్యాంబాబు- హైదరాబాద్, డి.ఎన్.కేదార్ చరణ్- తాడేపల్లిగూడెం (ప॥గో॥జిల్లా), బి.కవిత- ప్రొద్దుటూరు (కడప), కె.కనకాచారి-నల్గొండ, పి.శరిష్ కుమార్-రాజమండ్రి, తాతిరాజు మోహన్ రావు-విశాఖపట్నం, ఎమ్.శరత్‌కుమార్-హైదరాబాద్, ఎ.హరిప్రసాద్-హైదరాబాద్, యనమండ్ర రాజ్యలక్ష్మి-సికింద్రాబాద్, టి.సత్యనారాయణ-గూడూరు, కె.సాయికుమార్- కరీంనగర్, ఎ.గుమ్మశ్వేర్‌రావు-పొగిరి(శ్రీకాకుళం), రాచర్ల పద్మజ - హైదరాబాద్, కె.విజయ కుమారి-జగిత్యాల, ఫణికిరణ్-అవనిగడ్డ (కృష్ణా), నండూరి సుబ్బారావు- కాకినాడ, పెంటకోట షర్మిళాబుషి-విశాఖపట్నం, లంకశ్రీ ఆదిత్య-విజయవాడ, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, పి.మీనాకుమారి-పాలెం, వాలి హిరణ్మయీదేవి-హైదరాబాద్, ఎ.రాజశేఖర్‌రెడ్డి- కాజా (గుంటూరు), తులసి ఫణి-కాకినాడ, బి.ఎ.ఎస్.ప్రసాద్-పుల్లపాడు(ప॥గో॥జిల్లా), నీలిమావాణి యర్రా-కాకినాడ, యార్లగడ్డ చిట్టిబాబు-కేశవరం (తూ॥గో॥జిల్లా), టి.వి.రమాదేవి-నిజామాబాద్, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, బి.పాండురంగశర్మ- హైదరాబాద్, పమిడిముక్కల వరలక్ష్మి-చోడువాడ (విశాఖజిల్లా), బొజ్జా హరికృష్ణ-మద్రాసు, పసుపులేటి ఝాన్సీ- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా), ఎమ్.తిరుమలరావు- ములకలపల్లి (ఖమ్మం), మామిడి మహేంద్ర-పూణే(మహారాష్ట్ర), టి.నాగభూషణం-సికింద్రాబాద్, ఎ.రాధిక- అమలాపురం(తూ॥గో॥జిల్లా), కొడూరు సందీప్- ఆదిలాబాద్, యు.ఆర్.ఎన్.కె. విహార్- హైదరాబాద్, శ్వేత- చిత్తూరు, కె.పరిమల-హైదరాబాద్, ఐ.లిఖిత-హైదరాబాద్, కామేశ్వరీ రఘురామ్-విశాఖపట్నం, జి.దేవేంద్ర నాథరెడ్డి-పత్తికొండ(కర్నూలు), డాం.కె. సంజీవ్ కుమార్- నవీపేట్ (నిజామాబాద్), సి.హెచ్.సురేష్‌కుమార్-విజయగనరం, యజ్జల జగన్నాధం-పాతపట్నం, కొండపల్లి గంగయ్య-లంగ్డాపూర్ (నిజామాబాద్), గూడుపు జగదీష్‌కుమార్-నర్సీపట్నం(విశాఖజిల్లా), వంకాయలపాటి అంజయ్య-నల్గొండ, ఎస్.సుప్రియ- హైదరాబాద్, పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, ఎం.గాయత్రి-హైదరాబాద్, ప్రిన్సీప్యారీ- కాకినాడ, జ్యోతిర్మయి-హైదరాబాద్, ఎ.శ్రీధర్- ఖమ్మం, చింతాసాయి మౌనిక- కాకినాడ, ఎస్.శ్రీరంజిత- తిరుపతి, బోడపాటి దీప-మంగళగిరి, ఇందిర సపారే-కళ్యాణ్, కె.నాగరాజు- గజ్వేల్(మెదక్), పి.రాజశేఖర్-నవిముంబాయి, యం.ఎ.ఆర్.ఆన్.లక్ష్మి-విశాఖపట్నం, వి.దుర్గాంబా- ఒంగోలు, పి.వి.వి.ఆర్.ప్రకాశ్-చీపురుపల్లి, ఎమ్.దుర్గా మనోజ్ఞ-హైదరాబాద్, ఎ.వి.ఆర్.ఎన్.శ్రీనివాస్-హైదరాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

పి.పార్థసారథి-ఆకుతోటపల్లి(అనంతపురం), బి.యం.శంతన కుమార్-నెల్లూరు, జి.పద్మజ- హైదరాబాద్, ఎ.బి.వి.ఎన్.రమేశ్- వేలూరు, టి.విద్యారాణి- నల్గొండ, టి.నిర్మల-నెల్లూరు, జల్లేపల్లి శ్రీనివాసరావు-విశాఖపట్నం, ఎమ్.నరేంద్ర గాంధీ-పార్వతీపురం (విజయనగరం), ఇ.ఝాన్సీలక్ష్మి-సికింద్రాబాద్, ఆర్.ఫణిబాల-ధవళేశ్వరం, కె.శ్రీనివాసరావు- పిఠాపురం (తూ॥గో॥జిల్లా), జి.బాలాత్రిపురసుందరి-శ్రీకాకుళం, పి.శేఖర్‌బాబు-ధర్మసాగర్ (వరంగల్), ఎమ్.శర్మ-తణుకు, ఎన్.రాధాకామేశ్వరి-హైదరాబాద్, జి.స్వాతి స్వప్న క్రాంతిసాగర్- వనపర్తి (మహబూబ్ నగర్), వై.శ్రీకృష్ణ-సికింద్రాబాద్, జి.యామిని ఈశ్వర్ కిరణ్ సాగర్- వనపర్తి (మహబూబ్‌నగర్), ఎల్.శారద-విశాఖపట్నం, ఎల్.ఎ.వి.ఎస్.భగవాన్ శాస్త్రి-గాంధీపాలెం (నెల్లూరు), ఎమ్.అంజిరెడ్డి-ఒంగోలు, జి.జయచంద్రగుప్త-కర్నూలు, జి.జయలక్ష్మి-కర్నూలు, జి.కళ్యాణి- కర్నూలు, కె.మురళిమోహన్- మార్కాపూర్, సామంచి సువర్ణ సత్యనారాయణ- విజయవాడ, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), పి.వి.ఎస్.ఎ.ప్రసాదరావు- పినపళ్ళ (తూ॥గో॥జిల్లా), ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ, బి.చంద్రశేఖరయ్య- రామసముద్రం, బి.మురళీధర్‌రావు-దుందిగల్, జె.భాగ్యలక్ష్మి- కర్నూలు, కె.వి.ఎన్.ఎస్.భగవాన్-రాజమండ్రి, మామిడి మునుశ్రీలత- రేపల్లె, యం.శ్రీఅనుదీప్-కాకినాడ, ఎమ్.ఏడుకొండలు- చిలకలూరుపేట, కాకుటూరు సుజాత నాగరాజురావు- హైదరాబాద్, ఎన్.గాయత్రిదేవి- హైదరాబాద్, శ్రీనివాస్ పవర్- ఆర్మూర్ (నిజామాబాద్), మల్లివలస దుర్గప్రసాద్- వరంగల్, టి.సూర్యశ్రీ భరణీకాంత్-హైదరాబాద్, బొమ్మకంటి రవికిషోర్-హైదరాబాద్.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

పింగళి కనకవల్లి-గుంటూరు, బి.జాకిర్‌హుస్సేన్-ఎమ్మిగనూరు(కర్నూలు), బి.రాము- శర్మనగర్ (కరీంనగర్), ఎస్.పున్నంచెందర్- హన్మకొండ (వరంగల్), ఎస్.కె.సుబాని- ఒంగోలు, ఎం.వి.ఎస్.లక్ష్మి- కాకినాడ, వెత్సా రామకృష్ణ- విజయనగరం, ఉడాలి భాస్కరయ్య- చెన్నై, పి.భక్తమురళి- ప్రొద్దుటూరు, మోచెర్ల సురేష్- రాజమండ్రి, అల్లూరి రామరాజు- విజయవాడ, ఆర్.హరినాథ్- చెన్నై, వరయోగి రామ్‌మోహన్‌రావు- సికింద్రాబాద్, వుండమాటి ఆదిలక్ష్మి- కాకినాడ, జి.ప్రసాద్‌రెడ్డి- శ్రీకాకుళం, ఎస్.శివనారాయణ- వేటపాలెం (ప్రకాశం), పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), ఎ.ఎం.పురుషోత్తమా చార్యులు- హైదరాబాద్, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ. ■

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

25



**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.
ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి అండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడిన వెంకట్రావుకు తెల్లవారుజాము మూడున్నరకు ఆయనను కలిసే అవకాశం దొరుకుతుంది. తన సమస్యను వాస్తుభూషణరావుకు విన్నవించటంతో స్వయంగా వచ్చి ఇంటి వాస్తు పరిశీలిస్తానని చెప్పి వెంకట్రావు ఇంటికి వస్తాడు.

(ఇక చదవండి)

"అయ్యో.. సిలెండర్ తూర్పున ఉంచారా?

**తూర్పున పెట్టిన సిలెండర్**
**అగును అతి పెద్ద బ్లండర్**

అని సింగపూర్లో చెప్పా. అరెరె! ఈ మోరీ ఇటు వైపు పెట్టారా?

**ఈశాన్యం చూసే మోరీ**
**జేబులు శూన్యం చేసే గోరీ**

అని సోమాలియాలో గొంతు చించుకున్నాను. వినలేదా?" అన్నాడు వాస్తుభూషణం.

"అవునండీ. అందుకే కాబోలు ఈమధ్య మీ దగ్గర అసలు డబ్బులే మిగలడం లేదు." అన్నది సుందరి వెంకట్రావుతో

"అరెరె.. దేవుడి విగ్రహం వాయువ్యాన ఉంచారా! ఘోరం. ఉంటే

**వాయువ్యాన విగ్రహం**
**మనిషి కోల్పోవును నిగ్రహం**

అని నిజామాబాద్ సభలో అన్నాను."

"నిజమేనండీ ఈమధ్య నాకు ఉత్తి పుణ్యానికే చచ్చే కోపం వస్తున్నది." అన్నాడు వెంకట్రావు.

"అబ్బెబ్బే.. ఇదేంటి ఈషెల్ఫును ఈ వైపుంచారు? ఛ ఛ..ఈ ఫ్రిజ్జునిటుంచారేంటి? అరె! ఈ గోడలో మూలకోణం వంకరొచ్చిందే... వంటింట్లోనే ఇన్ని లోపాలుంటే ఇక ఇల్లంతా ఎన్ని లోపాలతో నిండి ఉందో... ముందు బెడ్ రూమ్‌కు పదండి..." దారి తీశాడు వాస్తుభూషణం.

దంపతుల గుండెలు గుబగుబ మంటున్నాయి.

"అర్రెర్రెర్రె... కిటికీ నైరుతిలో పెట్టారేంటి?

**ఉంటే కిటికీ నైరుతిలో**
**పడక తప్పదు యజమాని గోతిలో**

అని గోవాలో గొంతు చించుకున్నాను. అయ్యో.. అయ్యొ.. బాత్‌రూమ్ ఐదు బై ఆరు వేశారేంటి? నాలుగు బై ఏడు గదా ఉండాల్సింది.

**తగ్గినచో బాత్‌రూమ్ పొడవు**
**మల బద్ధకములు వీడవు**

అని మాంఛెస్టర్లో చెప్పాను. ఛ ఛ.. లెట్రిన్ బేసి తూర్పు పడమరలుగా పెట్టారండీ? ఉత్తర




దక్షిణాలు కదా ఉండాల్సింది! అయ్యో.. రామ రామ! అటకను తూర్పున కట్టారేంటి?

**తూర్పునున్న అటక**
**ఆరోగ్యం కటకట**

అన్నాను కాంబోడియాలో. హాఁ... బీరువా దక్షిణాభి ముఖంగా ఉంచారేమిటి? ఉంటే

**దక్షిణాన బీరువా**
**ఇంట్లో కరువుకు కరువా**

అని కర్నూలు జ్యోతిష మహాసభలో కంఠం చించుకుని చెప్పానే." రకరకాల ఎక్స్‌ప్రెషన్స్ ఇవ్వసాగాడు వాస్తుభూషణం.

గుటకలు మింగ సాగారు దంపతులు.

పెరట్లోకి నడిచాడు వాస్తుభూషణం దంపతులు అనుసరించారు.

"ఆగ్నేయాన్నానుకుని టాయ్‌లెట్లా? మైగాడ్!

**ఆగ్నేయం చూసిన టాయ్‌లెట్లు**
**దంపతుల మధ్య పెంచు సిగపట్లు**




అని సింగపూర్లో చాటాను గదా! వాటర్ టాప్ ఈ దిక్కున పెట్టారా!

**దక్షిణం పారే నీరు**
**తక్షణం వ్యాధులు చేరు**

అన్నాను వంగ దేశంలో వినలేదా?"

"వినిపించలేదండీ" వణుకుతూ చెప్పాడు వెంకట్రావు.

"ఈ బాత్రూమ్ రెండడుగులే ఉందేంటి? ఎవడు చెప్పింది?

**ఉంటే బాత్రూమ్ రెండడుగులు**
**వంటి రోగాల పిడుగులు**

అని ఫిజీలో చెప్పాను. ఈ దొడ్డి వాకిలి వద్ద రెండు మెట్లు కట్టారేంటి? ఒకటే కదా ఉండాల్సింది!

**వాకిలి వద్ద కట్టిన రెండు మెట్లు**
**తప్పించును కీళ్ళ వద్ద జాయింట్లు**

అని జాంబియా సభలో నెత్తీ నోరు కొట్టుకున్నానే... నా నెత్తి పగిలింది గానీ ఎవరూ విన్నట్లు లేదే!" తల బాదుకున్నాడు వాస్తుభూషణం.

వణికిపోసాగారు దంపతులు.

అంతా ఈయన వల్లనే వచ్చింది. ఇంటిని కట్టేముందు ఎవరైనా మంచి వాస్తు పండితుడికి చూపించమని చెప్పి చెప్పి నానోరు నొప్పి పుట్టింది. ఎవడో పనికి మాలిన అంట్ల సన్నాసి ఉప్పరి వెధవ రాసిన పుస్తకం తెచ్చి దాన్ని బట్టి ఇల్లు కట్టించాడు." కళ్ళు తుడుచుకుంటూ అన్నది సుందరి.

"అడ్డమైన గాడిదలు రాసిన దాన్ని చదివి నమ్మడమేనా?

ఏం పుస్తకమమ్మా అది?" నవ్వుతూ అన్నాడు వాస్తుభూషణం.

"ఏదో వాస్తు విజ్ఞాన చింతామణి అని ఎవడో అణాకానీ వెధవ రాశాడు. పేజీలు నలభై. రేటు మాత్రం నూట అరవై. జనాన్ని దోచుకునే దొంగ గాడిదలు," తిట్టిపోసింది సుందరి.

గతుక్కుమన్నాడు వాస్తు భూషణం. "ఆ.. ఆఁ .. ఆఁ.." నత్తలు కొట్టసాగాడు.

వెంకట్రావు సుందరి చెయ్యి పట్టుకుని అవతలకు లాక్కెళ్ళి- "బుద్ధి లేకుండా మాట్లాడకు. ఆ పుస్తకాన్ని రాసింది ఈయనే." చెవిలో గొణిగాడు.

సుందరి గుటకలు మింగింది.

"ఆఁ.. చూడమ్మా. వాల్మీకి రామాయణం రాశాడు. వ్యాసుడు భారతం రాశాడు. ఆ తరువాత అనేక మంది రచయితలు ఎవరికి తోచినట్లు వారు వ్యాఖ్యానాలు చేస్తూ మళ్ళీ వందలకొద్దీ రామాయణాలు, భారతాలు రాశారు. అలాగే అనుభవజ్ఞులైన నాలాంటి వాస్తు శాస్త్రవేత్తలు ఎన్నో సంవత్సరాలు ప్రకృతిని పరిశీలించి పరిశోధించి కనిపెట్టిన రహస్యాలు, వింతలు, విశేషాలు గుదిగుచ్చి సామాన్య ప్రజలకు అందజేస్తాం. కేవలం గ్రంద పఠనం సరిపోదు. ప్రాక్టికల్ నాలెడ్జి చాలా అవసరం. ఈత కొట్టడం ఎలా అనే పుస్తకం చదివి వెంటనే గోదావరిలో దూకితే ఏమౌతుంది? భద్రాచలంలో బాడీ తేలుతుంది. ఇదీ అంతే. సరే పదండి. మేడపైన

చూద్దాం." మెట్ల వైపు దారి తీశాడు వాస్తు భూషణం.

మొదటి మెట్టును చూడగానే ఏదో పాము అడ్డం వచ్చినట్లు ఠక్కున ఆగాడు వాస్తు భూషణం.

"అరె.. మెుదటి మెట్టు దక్షిణం చూస్తున్నదే! ఇది అతిపెద్ద దోషం.

**దక్షిణం చూస్తున్న మెట్టు**
**పక్షవాతం తెచ్చిపెట్టు**

అన్నాను తెనాలి సభలో. అర్రెర్రెర్రె... ఇదేంటి ఎనిమిది మెట్ల తరువాత ప్లాట్‌ఫామ్ కట్టారు? దోషం కదా! అయ్యో.. ఈపిట్టగోడేమిటి రెండంగుళాల మందంతో కట్టారు?

**మందం లేని పిట్టగోడ**
**ప్రగతికి అడ్డుగోడ**

అన్నాను అమెరికాలో.... ఇదేంటి వాయువ్యం వైపు మెరకైంది?

**వాయువ్యం పెట్టిన మెరక**
**పర్సులో మిగల్చదు గడ్డి పరక**

అన్నాను గాటిమాలాలో. ఛీ ఛీ... ఇదేంటి? ఉత్తరం వైపున్న సీకులకు ఇటుకలు పెట్టి ప్లాస్టరింగ్ చేశారు? ఏగాడిద కొడుకిచ్చాడీ వెధవ సలహా?" కోపంగా అన్నాడు వాస్తుభూషణం.

"అఁ..అఁ.. అవి వర్షానికి తుప్పు పడతాయని అలా కట్టించమన్నాడు మా సూపరెంటెండెంట్ ఇంజనీర్‌గారు. అందుకని...." సంజాయిషీ ఇచ్చాడు వెంకట్రావు.

"ఇంజనీర్ల కేం తెలుస్తాయి ఇటుకలు సీకుల సంగతులు? తుప్పు పడితే మాత్రం? ఆఫ్టరాల్ వందరూపాయలు విలువ చెయ్యని ఇనుప చువ్వలు! వాటికోసమని పదిలక్షలు విలువ జేసే ఇల్లు నాశనం చేసుకుంటారా? లండన్లో ఏం చెప్పాను?

**ఉత్తరం మూసిన సీకులు**
**వృద్ధిని చెండాడే చాకులు**

అని చెప్పాను. తుప్పు పట్టే చువ్వల కోసమని ఇంత పెద్ద తప్పు చేస్తారా!" అని వాటర్ ట్యాంకు వైపు నడిచాడు వాస్తు భూషణం.

"పుస్తకాన్ని చదవడం కూడా రాదు. ఇన్ని పొరపాట్లా ఈ చిన్నకొంపలో" కోపంగా అన్నది సుందరి భర్తను చూసి.

"అసలే నా మూడంతా పాడైంది. నువ్వు అరవమాకు." విసుక్కున్నాడు వెంకట్రావు.




అది విని తృప్తిగా ఫీలయ్యాడు వాస్తు భూషణం.

"ఒరెరెరె! ఈ వాటర్ ట్యాంక్ ఇంత పెద్దదిగా ఏదో బావిని నిర్మించినట్లు కట్టించారేం? అదీ ఆగ్నేయమూల! మీ ఇంట్లో గ్యాస్ సిలెండర్ ఎన్నాళ్ళొస్తుందమ్మా" అడిగాడు వాస్తుభూషణం.

"నెలరోజులొస్తుంది సార్" చెప్పింది సుందరి.

ఎలా వస్తుంది? ఇదే ట్యాంకు నైరుతి మూల ఉంటే గ్యాస్ రెండు నెలలొచ్చేది." అన్నాడు వాస్తు భూషణం.

గ్యాసుకి, వాటర్ ట్యాంకుకు సంబంధ మేంటో బుర్రబద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు వెంకట్రావుకు.

అయ్యో.. అయ్యో.. అయ్యో.. ఇదేంటండీ ఈ తూము! ఇంత చిన్నదిగా ఉందేం కనీసం ఎలుక దూరే సందు కూడా లేకుండా?...."

అంటుండగానే కెవ్వున అరిచింది సుందరి.

"ఏమైందమ్మా" కంగారుగా అన్నాడు వాస్తు భూషణం.

"ఆ... అహ... ఏం లేదు సార్... ఎలుకంటే మా ఆవిడకు ఎలర్జీ అసలు మా ఈ కష్టాలన్నింటికీ మూలకారణం ఆ పాడు ఎలుకే." అన్నాడు వెంకట్రావు.

"ఐసీ... వర్షపు నీరు ధారాళంగా పారాలంటే కనీసం పిల్లి కూనైనా పట్టేంత రంధ్రం....

మళ్ళీ కెవ్వున అరిచింది సుందరి.

"మళ్ళీ ఏమైందమ్మా" గాభరాగా అన్నాడు వాస్తుభూషణం.

"స్వామీ ఆ పిల్లి ఊసెత్తకండి. ఆ ముదనష్టపు పిల్లి వల్ల సర్వ నాశన మయ్యాం." అన్నాడు వెంకట్రావు.

తలపంకించి ఆలోచనలో పడ్డాడు వాస్తు భూషణం.

"పోనీయండి జంతువులనొదిలెయ్యండి. కనీసం మనిషి చెయ్యి పట్టేంతకంతయినా ఉండాలి. కానీ ఈ తూములో చిటికిన వేలు కూడా దూరదు.

**సన్నని రంధ్రపు తూము**
**కీర్తిని కాటు వేసే పాము**

అన్నాను పాలస్తీనా తెలుగు మహా సభలలో. క్లింటన్ సెక్స్ స్కాండల్లో ఇరుక్కుంటాడని వైట్ హౌస్‌లోని తూములు చూసి ఎపుడో చెప్పాను." అన్నాడు.

ముగ్గురూ కిందికి వచ్చారు.

"దక్షిణం వైపు ఖాళీ స్థలం ఐదడుగులు వదిలారు. తూర్పు వైపు ఐదున్నరడుగులు మాత్రమే వదిలారు. కనీసం ఆరడుగులైనా ఉండాలి. దీనివలన మీకు రావలసిన ప్రమోషన్లు ఆగిపోతాయి.

**దక్షిణాన తరిగిన స్థలము**
**ఉద్యోగం పాలిట విషం**

అని విజయనగరంలో గంటకొట్టి చెప్పాను."

"అవునండీ... ప్రమోషన్ సంగతి దేవుడెరుగు, రావల్సిన ఇంక్రిమెంట్లు కూడా రాలేదు."

"అదే నాయనా వాస్తు దోషమంటే! వా అంటే పాపం. స్తు అంటే పుణ్యం. అంటే పాపాలను నివారించి పుణ్యాలను పెంచేదే వాస్తుశాస్త్రం." నవ్వుతూ చెప్పాడు వాస్తు భూషణం. వెంకట్రావు ఆలోచనలో పడ్డాడు.

ఇంతకు ముందు తమ సూపర్నెంట్ మరేదో నిర్వచనం ఇచ్చినట్లు గుర్తుంది.

**-(ఇంకావుంది)**

మార్చి 10 ఆర్.పి.పట్నాయక్ పుట్టినరోజు సందర్భంగా...

# స్వరకాయం నుంచి పరకాయంలోకి...



అమృతం ఎప్పుడు పుట్టిందో కచ్చితంగా తెలీదు గానీ
అమృతం కన్నా తియ్యనైన స్నేహాన్ని పంచే..
ఆర్పీ పట్నాయక్ పాట ఎప్పుడు పుట్టిందో నాకు తెలుసు..
అది 2000 సంవత్సరం..
జనవరి 1వ తేదీన మొదలైంది...
సంగీత సాగర మథనం..
యిది నిజం...!! కాదు కథనం..
అందరి అంతర్మథనం..
పదారణాల తెలుగు వాళ్ళ ఆత్మగౌరవాభరణం..
పుట్టేది హాలాహలమా...?
అమృత జలపాతమా...?
పరభాషా గాయకుల గొంతు మోసే తలపండిన వాళ్ళంతా
'వాసుకి' తల పట్టుకున్నారు..
అప్పటికీ  ఇప్పటికీ తలా తోకా తెలీని నా బోటి వాళ్ళందరం...
తేజా గారి సారథ్యంలో తోక పట్టుకున్నాం...
మథనం ప్రారంభమైంది...!!!
అక్కడ క్షీర సాగర మథనంలో మొదట హాలాహలం పుట్టిందిట....!
కానీ యిక్కడ సంగీత సాగర మథనంలో కోలాహలం పుట్టింది..!
**"ఊహల పల్లకీలో ఊరేగించనా..**
**ఆశల వెల్లువై రాగం పలికించనా"** అంటూ..
చిత్రంగా ...ఓ సమ్మోహన గీతం..
పదారణాల తెలుగింటి ఆడపిల్ల గొంతునుంచి జాలు వారింది...
తెలుగు వాళ్ళందరినీ 'ఉషా' రెత్తించిందాపాట...
అలా వరుసగా...
కామధేనువు...కల్పవృక్షం...ఐరావతం....పుట్టుకొచ్చినట్టు....
నిహాల్, సందీప్, రవివర్మ, కౌసల్య, మల్లికార్జున్  అనే అచ్చతెలుగు..
గాయనీ గాయకులు పుట్టుకొచ్చారు...
కాదు తేజ, ఆర్పీ పట్టుకొచ్చారు..
పరభాషా గాయకుల మోజులో సినిమా ఇండస్ట్రీ ఉన్న రోజుల్లో...
అందరినీ కాదనీ తెలుగు వాళ్ళతో రూపొందించిన "చిత్రం" ఆడియోని
ఆంధ్ర ప్రజానీకం ఆదరించింది.
ఆర్పీని అగ్రస్థానంలో కూర్చోబెట్టింది...



'శీనూ వాసంతి లక్ష్మి' చిత్రంలో
గ్రుడ్డివాని పాత్రలో...

ఐతే యిది ఆదరించిన తెలుగు వాళ్ళగొప్పతనమే తప్ప
తెగించి చేసిన తమది కాదంటారు ఆర్పీ.....!
ఇదీ ఆర్పీ వ్యక్తిత్వం..!!!
ఆర్పీకి పెద్దగా సంగీతజ్ఞానం లేదు..
కాని యింగిత జ్ఞానం వుంది..!
మ్యూజిక్ తెలీదు... లాజిక్... తెలుసు..!
మధ్యమావతి అంటే తెలీదు ...మధ్యతరగతి అంటే తెలుసు..!
స్వరాల ఆరోహణ అవరోహణల కన్నా జీవితంలో ఒడిదుడుకులు బాగా తెలుసు...!
వీణ తీగ ఎలా మీటాలో తెలీదు...కానీ హృదయవీణ ఎలా మీటితే మనసు
పులకించి ఆనంద మందాకిని అయిపోతుందో తెలుసు..
ఆర్పీ వైద్యనాథ అయ్యంగార్ దగ్గరో...
బాలమురళీకృష్ణ దగ్గరో..
ఎం.ఎస్.సుబ్బలక్ష్మి దగ్గరో సంగీతం నేర్చుకోలేదు...!
ఏ మ్యూజిక్ డైరెక్టర్ దగ్గరా అసిస్టెంటు గానూ పని చేయలేదు..!
విశాఖ సముద్రంలో ఎగిసిపడే కెరటాల గలగలల్లో సరిగమలు నేర్చుకున్నాడు...
నాగావళీ నదీపాయల హొయల్లో గమకాలు తెలుసుకున్నాడు...
ఆంధ్ర విశ్వవిద్యాలయం చూసి లయ అంటే ఏంటో నేర్చుకున్నాడు...
ఉత్తరాంధ్ర జానపదాలతో జ్ఞానపథాన్ని ఎంచుకున్నాడు...
ఉమ్మడి కుటుంబంలో అప్యాయతానురాగాలు చూసి...
అవే రాగాలు నేర్చుకున్నాడు...
యిదీ ఆర్పీ అనే సంగీత దర్శకుడి నేపథ్యం!!
అందుకే ఆయన ప్రధాన పాత్రధారిగా రూపొందుతున్న..
'శీనూ వాసంతి లక్ష్మి' అనే సినిమాలో ఆయన గాయక నేపథ్యాన్ని వివరిస్తూ...
"గలగల పారే సెలయేరమ్మ సరిగమలంటే నేర్పింది..
కిలకిల పాడే ప్రతి గువ్వమ్మా గమకములంటే చూపింది..
అమ్మపాటలో లాలి లాలన... చిన్ని పాపలో హాయి భావన..
కదలి అలల కమనీయ కీర్తన ...పుడమి ఎదను చినుకమ్మ నర్తన...
గాలి తరగలో గాన మధురిమ..... పేద వెదురులో ప్రాణ స్పందన...
సుప్రభాత సుమరాగరంజన... సూర్యదేవ కిరణాల దీవెన..
వేదమంత్రముల నాదఘోషణ... కాగితాలలో కావ్యవేదన..
గుండెగూటిలో వాయులీనమై... కంటిపాపలో స్వప్న రాగమై...
గానపథమ్మున నను నడిపించే ...జానపదమ్ముల జాను తెలుగు...
తొలిపాటతల్లి నా జోతలందుకొని పొంగిపోగా...
పాడనా మదిని మురిపించు గీతం..." అని రాశాను...
ఇది ఆర్పీ జీవితం.. అందుకే అదే రాశాను...!!!


'చిత్రం' సినిమా వర్కింగ్ స్టిల్‌లో ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ అట్లూరి రామారావు, కులశేఖర్, తేజ, ఆర్పీ పట్నాయక్ తదితరులు

ఆర్పీ నటిస్తున్నాడని తెలిసి ఆశ్చర్యపోయాను..!
ఆర్పీకి చాలా మందిలా నటించటం రాదు...!
వస్తే ఎప్పుడో కోట్లకి పడగలెత్తి ఉండేవాడు.....
ఆర్పీ నటిస్తున్నాడనటం కన్నా పరకాయ ప్రవేశం చేస్తున్నాడనటం బెటర్..!
ఆర్పీకి నటించటమే కాదు, చాలా తెలీదు..!
లౌక్యం తెలీదు...యితరుల విషయాల్లో జోక్యం తెలీదు...!
ఇవన్నీ వస్తేనే ఇండస్ట్రీలో రాణించగలమన్న విషయం అసలు తెలీదు..!
"తియతియ్యని కలలను కనడమే తెలుసు
కమ్మనీ ప్రేమలో..



మనసంతా నీవని చెప్పటం తెలుసు
ప్రేమనే మత్తులో....."
(శ్రీరామ్ సినిమాలోని ఈ పాట ముందు ఆరు లైన్లూ
ఆర్పీ రాసినవే)
అని రాసిన ఆర్పీకి నిజమైన ప్రేమ గురించే తెలుసు...!
కపట ప్రేమలూ, కల్లబొల్లి మాటలూ తెలీవు.....!
అందర్నీ నమ్మేస్తాడు
అలా అని అమాయకుడు కాదు అసాధ్యుడు..!!
తను ఏమనుకుంటే అది చేసి చూపిస్తాడు..
ప్రస్తుతం అదే పనిలో ఉన్నాడు...!!!
ఆర్పీ అంటే ఇండస్ట్రీకి రాక ముందే తెలుసు....
ఆర్పీ సంగీతం గురించి ఇండస్ట్రీకి వచ్చేక తెలుసు.....
ఆర్పీకి, ఆర్పీ సంగీతానికి వున్న క్రేజూ ఇమేజూ ఏంటో...
విశాఖపట్నం మ్యూజికల్ నైట్‌లో తెలిసింది!
యిసకవేస్తే రాలనంత జనం అన్న సామెత చిన్నప్పుడే తెలుసు..
అయితే అది అనుభవైకవేద్యమైన రోజు ఆ రోజు...
పదిలక్షల మంది జనం సాక్షిగా..!!
ఆర్పీకి ముందూ వెనకా ఎవరూ లేరనుకున్నా అంతవరకూ...
కానీ ఆ రోజు తెలిసింది.. ఆర్పీ బలగమెంతో....
నిజం ఆర్పీకి స్వరబలం కన్నా... గళబలం కన్నా, జనంబలం ఎక్కువ!
అందుకే ఆర్పీ పాట మోగని...
ఊరుగానీ...కారుగానీ... హోటల్‌గానీ... ఆటోగానీ ఉండవు..!!!
ఆర్పీ, నేనూ పాటయాత్ర ఒకేసారి ప్రారంభించాం...
ఇవాళ నేను గీత రచయితగా స్థిరపడటానికి ఊతం ఆర్పీ సంగీతం ....సుస్నేహం....
తేజా సారథ్యం...!
ఆర్పీ నన్ను నమ్మటం వల్ల ఆర్పీకి ఒరిగిందేమిటో నాకు తెలీదు గానీ
ఆ నమ్మకమే నను మునుముందుకు నడిపించింది..నడిపిస్తోంది..!
ఆర్పీ గాయకుడుగా సంగీత దర్శకుడుగా అందరికీ తెలుసు!
మంచి స్నేహితుడిగా కొంతమందికి తెలుసు!
నటుడిగా ఆంధ్ర దేశానికంతటికీ కొద్దిరోజుల్లో పరిచయమవబోతున్నాడు..
వీటన్నిటికీ మించి ఆర్పీ మానవతావాది..
ఎదుటివాడి కష్టానికి తన ఎదనిండా కన్నీళ్ళెట్టుకుంటాడు..!



'శీనూ వాసంతి లక్ష్మి' లో అంధునిగా ...

అసలైన ఆశావాది..
రేపటిగురించి ఎంతో నిబ్బరంగానూ నిర్భయంగానూ ఉంటాడు..!
ఎందరినో తన పాటలతోనే కాదు...
స్నేహపద్రమైన మాటలతో ఓదార్చటం నాకు తెలుసు...!
యిలాంటి సుపుత్రుణ్ణికన్న ఆయన తల్లిదండ్రులు చరితార్థులు
మనసుకు హాయిగొలిపే పాటలిచ్చే సంగీత దర్శకుణ్ణి ఇండస్ట్రీకి,
మంచి స్నేహితుణ్ణి మాకూ యిచ్చిన వారికి కృతజ్ఞతలు..!
సంగీత దర్శకుడిగా గాయకుడిగా ప్రజల హృదయసీమల్లో..
చిరనివాసం, స్థిరనివాసం ఏర్పరచుకున్న ఆర్పీ..
నటుడిగా కూడా ఆస్థాయిని చేరుకోవాలని ఆశిస్తూ....

జన్మదిన శుభాకాంక్షలతో...



**- కులశేఖర్**


పాటల
ప్రత్యేకం
NRK CINEMA'S
ఎన్. ఆర్. కె. సినిమాస్
దోస్త్
There is truth in youth...
ఎన్. రాధాకృష్ణారెడ్డి
కోటి
ముప్పలనేని శివ

రచన: ముప్పలనేని శివ (1) గానం : కార్తిక్, టిప్పు, కోరస్

సాకీ: టీనేజి గుండెల్ని తియ్యంగ దోచేసి
కళ్లింత చేసేసి కవ్వించి చంపొద్దె
రాక్షసి - రాక్షసి - రాక్షసి!!
ఎంగేజి మోజుల్ని ఎండార గట్టేసి
సయ్యంటు మాలోని ఓల్టేజి పెంచొద్దె
రాక్షసి - రాక్షసి - రాక్షసీ!!
చ: సారీ చెప్పి చెంతకొస్తె - సమ్మతిస్తాం రాక్షసీ
మరీ పోజు కొట్టావంటె - అంతుచూస్తాం రాక్షసీ ॥సారీ॥
మిడిసి పడ్డావే... బోడి అందచూసి ఓ నారీ...
దిగులు పడ్డామె... మమ్మే అలుసుచేస్తె వయ్యారీ...
కలుకులు పంచూ - కొంచెం... నీ టెక్కు తగ్గించూ!! ॥సారీ॥
కలలు కనే వయసిది కన్యాకుమారీ
కాలేజ్‌లో టీజింగ్ మామూలె ప్యారీ...
పడుచుతనం సొగసులు పంచాలి గానీ
కొంటెగుణం కొంపే ముంచేనె పోరీ
టీనేజీ సందళ్లూ మళ్లీమళ్లీ రావమ్మో
అమ్మమ్మే అయ్యాకా నీలైఫే బోరమ్మో...
అల్లరి చెయ్యాలి - అల్లుకు పోవాలి
అందరి గుండెల్లో - పల్లవి పాడాలి
రాక్షసి - రాక్షసి - రాక్షసీ!!॥సారీ॥
ఇంటర్నెట్‌లో చాటింగ్ చేసే రోజుల్లో
ఈమెయిల్లో లెటర్సే రాసే వేళల్లో
పెప్సీ కోకూ పెదాల్ని తాకే మోజుల్లో
ఫాషన్ షోలే ఫాన్స్‌ని ఊపే రోజుల్లో
ఆ కాలం గిమ్మిక్కూ ఈ కాలం చెల్లవులే
నీ టైమే బ్యాడైతే పంతాన్నే వీడదులే
కోతలు కోశావో - కేకులు తింటావే
సోకులు పోయావో - షాకులె తింటావే
రాక్షసి - రాక్షసి - రాక్షసీ ॥సారీచెప్పి॥

రచన: ముప్పలనేని శివ (2) గానం : ఉదిత్ నారాయణ్, చిత్ర

ఆమె : మళ్లీ మళ్లీ ముద్దిమ్మంది - మాఘమాసమెప్పుడంది
ఏమిటీ ఈడుగోల
అతడు: తుళ్లీ తుళ్లీ కవ్విస్తోంది - తీపిహాయి కమ్మేస్తోంది
ఎందుకే మధుబాలా
ఆమె : మనసంత నువ్వనీ తెలిసాక...
మైమరపు ప్రేమగా మారాక...
అతడు: అల్లరి చాల్లే... అల్లుకుపోవే మేఘమాలా!!
అతడు: అణువణువూ నిరీక్షణలో - తొలివలపే తపించింది
ఆమె : ప్రణయమనే పరీక్షలలో - తన గెలుపే లిఖించిందీ
అతడు: ఏకాంత సేవల్లో ఈ కాంత అందాలూ...
నా కొంటె ఊహల్లో ఎల్లోరా శిల్పాలూ...
ఆమె : నాతోడై నువ్వుంటే అందిస్తా స్వర్గాలూ
ఓ నేస్తం విన్నావా... విన్నపాలూ...
అతడు: ఇది నిజం - మనం - చెలిసగం సుఖం...
చిరునవ్వుల అల్లికలో ॥మళ్లీ మళ్లీ॥
ఆమె : వలపులలో వసంతాలే అర విరిసీ వరించాయీ
అతడు: తలపులలో తమాషాలే పెదవులపై ఫలించాయి
ఆమె : ఆనందం హద్దులు దాటీ ఆకాశం అందిందీ
నా ప్రాణం నువ్వంటూ ఈ ప్రాయం కోరింది
అతడు: ఉల్లాసం ఉయ్యాల్లూగీ సల్లాపం చేసిందీ
నా శ్వాసే నీరాగం పలికింది
ఆమె : మన ప్రేమే జయం - ఇక స్వయంవరం - పద
పరిణయ పల్లకిలో ॥మళ్లీ మళ్లీ॥





రచన: భువనచంద్ర (3) గానం : కార్తిక్, టిప్పు

జీవితం ఒక ఆటరా ఆడేద్దాం సరదాగా ॥2॥
జీవితం ఒక పాటలా పాడేద్దాం జల్సాగా
పదరా బ్రదర్ కలలు కందాం
కలనే మనం నిజం చేద్దాం
కృషినే మనం నమ్ముకున్నాం
జతగా ఫలం పంచుకుందాం ॥జీవితం॥
A+B హోల్‌స్క్వేర్ ఇంగ్లీషు లిటరేచర్
ఏనాడో చదివేశాం బ్రదర్
లేటెస్టు టెక్నోవేర్... Lap Top కంప్యూటర్
ట్రైచేద్దాం రారా మైడియర్
ఎదురన్నదేది లేనెలేదు నీలినింగె నీకు హద్దు
నేస్తం చెయ్‌కలుపూ మనదేరా తుది గెలుపూ ॥జీవితం॥
అటుచూడు మేరేయార్ నవ్విందో చుడీదార్
చూపించేద్దామా లవ్వు జోర్
లౌలోన పడకోయీ టోటల్‌గా చెడకోయీ
అన్నాడేనాడో షేక్స్‌పియర్
నువ్వన్నమాటె రాచబాట ఉన్నచోటె పూలతోట
దోస్తీ చాలంటూ
నా దోస్త్‌కి జై అంటా... ॥జీవితం॥

రచన: సామవేదం షణ్ముఖశర్మ **4** గానం : విజయ్ జేసుదాస్

ఆచూపే సుప్రభాతం - అది నన్నే మేల్కొలిపె
ఆనవ్వే చైత్రగీతం - అనురాగాలే చిలికె
ఊహకైనా అందరాని
ఒక వరము దొరికిన ఈవేళ !! ॥ఆ చూపే॥
ఊయలలు లాలనలు - ఎదుగని పసితనమే దాటె
నీ ఒడిలో ననుచూసి - చెదరిన బాల్యమె ననుచేరె
నీ కనుపాపలో నన్నే
కనుగొని పాపనైనానే
నిజమైన జన్మ ఈనాడే
ఏవేవో జ్ఞాపకాలు తొలిరాగాలై పలికె
ఎన్నెన్నో స్వాగతాలు నవలోకంలో నిలిపె !!
అమృతమై మురిపించి - మధురిమ పంచెను నీ మమత
అనుభవమై తెలిసినది - అమ్మను చిరుపలుకుల ఘనత
నా హృదయాన ఇన్నాళ్లూ
దాగిన అమ్మ అనుమాట
పలకాలి గొంతులో నేడే
ఆ చూపే సుప్రభాతం - అది నన్నే మేల్కొలిపె
ఆ నవ్వే చైత్రగీతం - అనురాగాలే చిలికె
ఊహకైనా అందరాని
ఒక వరము దొరికిన ఈవేళ





రచన: భువనచంద్ర **5** గానం : కార్తీక్, చిత్ర,హనుమంతరావు

ఇప్పసార కొట్టరో డప్పుచేత పట్టరో
మల్లేశో మల్లేశా
గుప్పెడంత గుండెలో గుప్పుమంది సంబరం
హైలెస్సో హైలెస్సా
గువ్వ గూటికి చేరిన వేళ
పల్లె మనసే పల్లవి కాగా
జాముురాతిరి జాతర చెయ్యాలా
ఊరంతా ఈ సందడితోనే మారుమోగాలా
నూరేళ్లూ ఇలా పండగలాగా సాగిపోవాలా ॥ఇప్పసార॥
అమ్మఅన్న పదములోని కమ్మదనమే తెలిసిందీ
కన్న ప్రేమలో కరిగిపోయె సుఖము నేడే కలిగింది
మాటరాని బొమ్మలాగా బతికివున్నా ఇన్నాళ్లూ
అమ్మ ఒడినీ చేరికూడా ఆగవేమ్మా కన్నీళ్లూ
ఎంతగొప్పదీ అనుబంధం
అంతులేనిదీ ఆనందం
అరె భాయీ పదరా ఖుషీ చేసుకుందాం
ఊరంతా ఈ సందడితోనే మారుమోగాల
నూరేళ్లూ ఇలా పండగలాగా సాగిపోవాలా
అమ్మచాటూ అందగాడా సైగచేస్తే వచ్చేయ్‌నా
వస్తివంటే అమ్మతోటి అన్ని కథలూ చెప్పేయ్‌నా
కంటిచూపే కథలు చెబితే సైగలెందుకె చినదానా
కోరుకున్న వరుడితోనే సాగుతుందీ నీ మేనా
కొంటె మల్లికి పెళ్లంటా కోటి ఆశలా జల్లంటా
కానుకగా నేస్తం ఏమి ఇవ్వనంటా
నీ సుఖమే నాకు చాలంట నీ స్నేహం మరువలేనంట
నా ప్రాణాలన్నీ నీవంట
నీ నీడై తోడుగా వుంటా
దోస్తంటే ఎలా వుండాలో భయ్ చూపించావంటా
దోస్తీకే మరో పేరుంటే అది నీపేరేనంటా ॥ఇప్పసార॥

రచన: ముప్పలనేని శివ **6** గానం : ఉదిత్‌నారాయణ్, స్వర్ణలత

అతడు : వెయ్ వెయ్ వాటెయ్ వళ్లంతా కాటెయ్
వడగళ్ల ఈ వానలో
ఆమె : సయ్ సయ్ చోటియ్ సల్లంగ ఓటెయ్
పరువాల నా గూటిలో
అతడు : వేడున్నదీ యమా వాడున్నదీ
లేదు ఎదురంటూ నా ధాటికీ
ఆమె : ఈడున్నదీ యమా జోడున్నదీ
మహా మొనగాడి తోడున్నదీ ॥వెయ్ వెయ్॥
ఆమె : ఈడు కోడైతే కనిపెట్టూ పనిపట్టూ
హద్దు రద్దయ్యే ఈ హాయిలో
అతడు : తోడూ నీడయ్యా కడతానే కనికట్టూ
అందమీవమ్మో తొలిరేయిలో
ఆమె : మోజూ మొగ్గాయే - బుగ్గే సిగ్గాయే
అతడు : తోక తొక్కావే - మీట నొక్కావే
ఆమె : తడిసి తడిసి తపన పడకు మావా!!!! ॥వెయ్ వెయ్॥
ఆమె : వాడ వెర్రెత్తే నీ జోరూ తగ్గించూ
జోడు గుర్రాల సయ్యాటలో
అతడు : ఎవ్వరే మన్నా అదరొద్దూ బెదరొద్దూ
లేదు సరిహద్దూ ఈ కేళిలో
ఆమె : చుమ్మా ఇప్పించూ - దమ్మే చూపించూ
అతడు : దుమ్మూ రేపేస్తా - దూలే అనిపిస్తా
మిడిసి పడకె మీసముంది భామా!!! ॥వెయ్ వెయ్॥




## తారాగణం

శివ, కార్తిక్, నేహ (దిల్), ప్రీతి మెహ్రో
కె.విశ్వనాథ్, సుహాసిని, వేణుమాధవ్, బ్రహ్మానందం,
ఎం.ఎస్.నారాయణ, తనికెళ్ళ భరణి, ఆలీ, మేల్కోటి,
రఘునాధరెడ్డి, కళ్ళచిదంబరం, రఘుబాబు, సన


ముప్పలనేని శివ


కోటి

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | – | "గంగోత్రి "విశ్వనాథ్ |
| సంగీతం | – | కోటి |
| పాటలు | – | భువనచంద్ర, సామవేదం షణ్ముఖశర్మ ముప్పలనేని శివ |
| ఎడిటింగ్ | – | రాంగోపాల్ రెడ్డి |
| కళ | – | బి. వెంకటేశ్వరరావు |
| డాన్స్ | – | శంకర్, రాజశేఖర్, స్వర్ణ |
| కెమెరా | – | రమణరాజు |
| ఫైట్స్ | – | నందూ |
| స్టిల్స్ | – | కె.విజయకుమార్ |
| పబ్లిసిటీ | – | రామ్‌డిజి గ్రాఫిక్స్ |
| పిఆర్‌ఒ | – | సురేష్ కొండేటి |
| నిర్వహణ | – | ఎం. శివకోటారెడ్డి |
| నిర్మాత | – | ఎన్. రాధాకృష్ణారెడ్డి |
| స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | – | ముప్పలనేని శివ |


భువనచంద్ర


సామవేదం షణ్ముఖశర్మ

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తెలుగు | | తమిళం | |
|---|---|---|---|
| చిత్రం | : ప్రేమించిచూడు | చిత్రం | : కాదలిక్క నేరమిల్లై |
| రచన | : ఆరుద్ర | రచన | : కణ్ణదాసన్ |
| సంగీతం | : మాస్టర్‌వేణు | సంగీతం | : విశ్వనాథన్‌రామ్మూర్తి |
| గానం | : పి.బి.శ్రీనివాస్ | గానం | : పి.బి.శ్రీనివాస్ |
| అభినయం | : నాగేశ్వరరావు, రాజశ్రీ, కాంచన | అభినయం | : రవిచంద్రన్, రాజశ్రీ, కాంచన |

కాదలిక్క నేరమిల్లై తమిళ చిత్రంలోని పాటలలో అల్లరిపాటల పాలు ఎక్కువ కావడంతో - ఆ పాటలు ఆ తర్వాత చాలా చిత్రాలలో అల్లరి పాటలు చోటు చేసుకోవడానికి కారణాలయ్యాయి. అబ్బాయి,అమ్మాయిని ఆట పట్టించడం, అమ్మాయి, అబ్బాయిని ఆటపట్టించడం వంటి చిత్ర క్రీడలకు ఒరవడి దిద్దిన పాటలలో 'కాదలిక్క నేరమిల్లై'లోని 'ఉంగపొన్ నాన కైగళ్ పుణ్ణాగలామా' అనే తమిళగీతాన్ని (అదే సన్నివేశంలో 'ప్రేమించి చూడు' తెలుగు చిత్రంలోని 'మీ అందాల చేతులు కందేను పాపం' పాట ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

తమిళ చిత్రంలో నాయికలుగా నటించిన రాజశ్రీ, కాంచన తెలుగు చిత్రంలోనూ నాయికలుగా నటించారు. తెలుగు చిత్రంలో నాయకులు అక్కినేని నాగేశ్వరరావు, జగ్గయ్య. నాయికల కారు ఆగిపోతే - నాయకుడు అల్లరిపెడుతూ పెట్టే ఈ సన్నివేశంలోని పాటను తమిళ చిత్రం కోసం కణ్ణదాసన్ రాశారు. తమిళంలో రవిచంద్రన్ నటించిన పాత్రను తెలుగులో నాగేశ్వరరావు పోషించారు. తమిళగీతం పాడిన పి.బి.శ్రీనివాస్ తెలుగుపాటనూ పాడారు. తెలుగు పాట రాసిన వారు ఆరుద్ర.

ముందు కణ్ణదాసన్ రాసిన తమిళ గీతాన్ని చూద్దాం.

**ఉంగ పోన్‌నాన కైగళ్ పుణ్ణాగలామా**
**ఉదలిక్‌కు వరలామా సమ్మదమ్‌వరుమా**
**సందేగమ్‌తానా?**
**శేలాట్‌టమ్ కణ్ణుమ్ నూలాట్‌టమ్ ఇడైయమ్**
**తిండాట్ టప్ పడలామా**
**తాలాట్‌టుమ్ పెణ్ణిన్ పూ వాట్‌టమ్ కైగళ్**
**కారోట్‌ట వదలామా?**
**కట్‌టాన మేని కలంగిడ కులుంగిత**
**వేలై శెయ్‌య లామా -ఇదు**
**నాగరీగమా పోఅ వేగమా**
**నానుమ్ వరలామా! ॥ఉంగ॥**
**ఆనాన పదిప్‌పు నీ పడిత్ తాలుమ్**
**అదుక్ కదు తుణై వేణుమ్**
**కోతాను కోడివ్ పణమిరున్‌ణాలుమ్**
**కుంబిట్‌టు విళవేణుమ్**
**కొంజాద కిళియుమ్ కువాద కుయిలుమ్**
**ఉలగినిల్ కిడైయాదు - ఇన్‌దక్**
**కోపం ఆగుమా - పోగముడియుమా**
**నాన్ తాన్ విడువేనా ॥ఉంగ॥**
**కణ్ణాలే వార్‌త్తై శొన్ నాలుమ్ పోదుమ్**
**మున్‌నాలే వరువేనే**
**కల్‌యాణత్ తేడిల్ - ఉల్‌లాస ఊరిల్**
**ఊర్‌వలమ్ వరువేనే - ఇన్ ద**
**అత్‌తానైప్ పార్‌త్‌తు మామా**
**ఎన్ ఆలుమ్ తుడిప్ పేనే -అన్‌ద**
**వేలై పోనదిల్ ఇన్‌దచ్ చే వై యిల్**
**కాలత్‌తై కళప్‌పేనే ॥ఉంగ॥**



నాయికల కారణంగా వాళ్ల దగ్గర నాయకుడు చేస్తున్న ఉద్యోగం ఊడిపోతుంది. ఉద్యోగం తిరిగి ఇవ్వాలంటూ పోరాడుతూ పాడే పాట మరొకటి ఉంది. ఆగిపోయిన కారుతో కుస్తీ పడుతున్న నాయికలను అల్లరి పెడుతూ నాయకుడు పాడే ఈ పాట ఏమంటున్నది?

**మీ బంగారు చేతులు పుండై పోవచ్చా**
**సాయానికి రావచ్చా సమ్మతమవునా**
**సందేహమేనా ॥మీ॥**
**చేపలవంటి కన్నులూ దారం '(తీగ) వంటి నడుమూ**
**ఇబ్బంది పెట్ట బడవచ్చా**
**ఉయ్యాల ఊచే మగువ పువ్వుల వంటి చేతులు**
**కారునడపడానికి రావచ్చా?**
**సొంపైన మేను కదిలేలా అదిరేలా**
**పని చేయవచ్చా - ఇది**
**నాగరికంగా వెళ్లే వేగమా**
**నేనూ రావచ్చా ॥మీ॥**

ఎంతెంత చదువు నీవు చదివినా
దానికది తోడుకావాలి
కోటాను కోట్ల డబ్బున్నా
మొక్కి సాగిల పడాలి
కులకని చిలుకా కూయని కోయిలా
లోకంలో లేనే లేవు - ఈ
కోపం తగునా వెళ్లగలరా
నే వెళ్లనిస్తానా ॥మా॥
కంటితో మాట చెప్పినా చాలు
ముందుకు వస్తానే
కళ్యాణపు తేరులో ఉల్లాసపు ఊరిలో
ఊరేగి వస్తానే - ఈ
బావను చూసి మామా
అంటేనే తుళ్లి పడతానే -ఆ
ఉద్యోగం పోగా ఈ సేవలో
కాలం గడిపేనే ॥మా॥

తమిళ గీతం ఒరవడిలోనే తెలుగు పాట సాగినా తెలుగు పాటలో కొన్ని మార్పులు కనిపిస్తాయి.

ఆ మార్పులు పరిశీలించే ముందు 'ప్రేమించి చూడు' పాటలో చూద్దాం.

మీ అందాల చేతులు కందేను పాపం
ఎందుకు ఈ బెడద సాయము వలదా హోయ్
ఓ చేయి వేసేదా ॥మీ అందాల॥
చిన్నారి మేను సన్నాని నడుము
అల్లాడి పోవాలా - హోయ్
ఉయ్యాల ఊచే వయ్యారి చేతులు
మోటారు తోలాలా?
ఇంపైన సొంపు వన్నెలు తరిగి
వాడిపోవాలా - ఇటు
అప్టుడేటుగా టిప్పు టాపుగా
అలసిపోవాలా - ఓ హోహో ॥మీ అందాల॥
కాలేజి చదువుల తేలేవుగానీ
కాసింత తగ్గాలి హోయ్
వేలాదివేల రూపాయలున్నా
వినయము చూపాలి
మగవాని తోడు వలదన్న వనిత
మహిలోన కనరాదు
ఈ కోపమెందుకు తాపమెందుకు
తగునా ఇది మీకు హోయ్- ఓ హోహో ॥మీ అందాల॥
కడగంటి చూపు కబురంపగానే
శుభలేఖ పంపేను హోయ్
విడిదింటినుంచి ఊరేగి నిన్నే
పెళ్లాడ వస్తాను
మనసైన వాని మామా అనగానే పొంగేను -ఈ
మనసైన వాని మామా అనగానే పొంగేను
ఇక వలపు దారిలో కలికి సేవలో
కాలం గడిపేను - హోయ్ - ఓ హోహో ॥మీ అందాల॥



తమిళ, తెలుగు గీతాలు రెండిటిలోను అల్లరి మాట ఎలా ఉన్నా రెండుగీతాలలోనూ కనిపించే , ఉయ్యాల ఊచటం ప్రస్తావన స్త్రీల పట్ల వివక్ష కనబరిచే ధోరణిలో ఉంది. కాలక్రమాన స్త్రీలను కించపరుస్తూ వచ్చిన అల్లరి పాటలకు నాంది ఈ పాటలతోనే అయిందేమో అనిపిస్తుంది. తమిళ గీతంలో 'తిండాట్టప్పడలామా' (ఇబ్బంది పెట్టబడవచ్చా?) అంటూ 'పడలామా' (పడవచ్చా) అని అదనంగా తమాషా ప్రయోగం చేశారు కణ్ణదాసన్. తమిళగీతం -పల్లవిలోని బంగారు చేతులు చరణంలో పువ్వులవంటి చేతులయిపోయాయి. తెలుగు పాట పల్లవిలో 'అందాల చేతులు' చరణంలో 'వయ్యారి చేతులు' కనిపిస్తాయి.

తమిళగీతం పల్లవిలో 'సాయానికి రావచ్చా ?' అని ఉంటే తెలుగు పాట పల్లవిలో 'సాయము వలదా?' అనడంతో బాటు 'ఓ చేయి వేసేదా' అని చొరవ చూపడమూ ఉంది.

ఎంత చదివినా ఎవరిదో తోడుండాలని తమిళ గీతం అంటే - 'కాలేజి చదువులు చదివినా కాసింత తగ్గాలి' అంటుంది తెలుగుపాట. తమిళ గీతంలోని 'కోటాను కోట్ల డబ్బు' తెలుగు పాటలో విలువ తరిగి వేలాది రూపాయలయింది. మూలగీతంలో సాగిలపడిమొక్కాలని వాచ్యంగా ఉన్నది తెలుగులో 'వినయం చూపాలి' అని సొగసుగా రూపొందింది.

కంటితో కబురుచేస్తే ఊరికి వస్తాననీ ఉల్లాసపు ఊరిలో కళ్యాణపు తేరులో ఊరేగి వస్తానని తమిళ నాయకుడు చెబుతున్నాడు.

తెలుగునాయకుడు రెండాకులు ఎక్కువ చదివిన వాడు. కడగంటి కబురందితే శుభలేఖ పంపిస్తాడట. విడిదింటనుంచి ఊరేగివచ్చి నాయికను పెళ్లాడుతాడుట. తమిళంలో 'అత్తాన్' అంటే వరసయిన బావ. ఆ బావను 'మామా' అనడమూ కద్దు.

'మనసైనవాని మామా అనగానే పొంగేను ' అని తెలుగు పాట చెబుతున్నది. తమిళ గీతంలోని ఉద్యోగం ఊడిన ప్రస్తావన తెలుగు పాటలో లేదు.

తమిళగీతంలోనూ తెలుగు పాటలోనూ కూడా ప్రాసవిన్యాసాలు ఆహ్లాదపరుస్తాయి. పి.బి. శ్రీనివాస్ ఈ పాటలో 'హోయ్' అనే మాట వచ్చిన చోట్లలో చూపిన వైవిధ్యం ఆయనకే సాధ్యం. ఈ అల్లరి పాట పాడినందువల్ల తమిళంలో ఆ తర్వాత ఆయన ఎన్నో అల్లరిపాటలు పాడారు.

- పి.ఎస్.గోపాలకృష్ణ






## "షహర్ కి లడ్‌కీ"

# చందనా దీక్షిత్

వారసత్వంగా అబ్బే కళలకు పట్టు ఎక్కువగా వుంటుందన్న విషయం పాప్‌సింగర్ చందనాదీక్షిత్‌ను గమనిస్తే తెలుస్తుంది. అందరిలా యుక్తవయస్సు వచ్చాక సంగీతాన్ని గురువు దగ్గర నేర్చుకోవటం కాకుండా చిన్నతనం నుండే చందన తల్లి గొంతుకు జత కలిపింది. అందుకే ఆమె పునాది గట్టిదని చెప్పొచ్చు.

తన బాల్యస్మృతుల్ని చందన నెమర వేసుకుంటూ "అప్పట్లో ఆఫ్రికాలోని నైజీరియాలో మేం వుండేవాళ్ళం. అక్కడ భారతీయులందరూ కల్సి ఏ పండుగ చేసుకున్నా, ఏ ఉత్సవం జరుపుకున్నా చుట్టుపక్కల కుటుంబాల వాళ్ళని పిలిచేవారు. అటువంటి కార్యక్రమాలలో మా అమ్మ పాటలు పాడి వాళ్ళ ప్రశంసలను పొందుతుండేది. ఆమె సంగీత విశారద చేసింది. అమ్మతో పాటే నేనూ గొంతు కలిపేదాన్ని. భారత్‌నుండి ఎవరు అక్కడకు వచ్చినా హిందీ పాటల ఆల్బమ్స్ తెస్తూ వుండేవారు. స్వదేశానికి దూరమైనా నా చిన్నతనంలో ఈ భాషకు, ఈ పాటలకు దూరం కాలేదు. వాటిని వింటూ నేను కూని రాగాలు తీస్తుండే దానిని,అలా గాత్రం నను వరించింది"అని అంది.

ఆ తర్వాత చందనా దీక్షిత్ కుటుంబం భారత్‌కు వచ్చింది. పూణెలో స్థిరపడింది. ఇంటిలో అమ్మ దగ్గర కొంత శిక్షణను తీసుకున్నా - పద్ధతిగా గురువు దగ్గర ఈ విద్యను అభ్యసించాలని సరస్వతిరాణే దగ్గర చేరింది. గానంలోని మెళుకువల్ని అక్కడే తెలుసుకున్నానంటుంది చందనా దీక్షిత్. "అప్పట్లో చుట్టుపక్కల ఎంతో మంది స్నేహితులు వుండేవాళ్ళు. వాళ్ళ ప్రోత్సాహం ఇంతా అంతా కాదు. దగ్గరలో ఏ కార్యక్రమం జరిగినా- నన్ను వేదికపైకి పిలిచి పాటలు పాడించేవారు. పదహారు సంవత్సరాల వయసులో ఓ సంగీత కార్యక్రమంలో పాల్గొని ప్రథమ బహుమతి పొందాను. సంగీత పరంగా జ్ఞానం వున్నవాళ్ళు, వయసులో పెద్దవారు ఆ పోటీలో పాల్గొన్నా- ప్రథమ స్థానం నాకు దక్కేసరికి-నా మీద నాకు నమ్మకం కలిగింది. ఇంకే ముంది నా సత్తా చూపుకోవడానికి ముంబై రైలెక్కాను"అంది.

ఇది దాదాపు దశాబ్దం క్రిందటిమాట. అప్పట్లో మామూలుగా కొత్త గాయని, గాయకులకు పెద్దగా అవకాశాలుండేవికావు. వెంటనే అవకాశాలు అందిపుచ్చుకొని రాత్రికి రాత్రి పాపులర్ సింగర్ అయిపోవాలనే ఆలోచనలు చందనాదీక్షిత్‌కి లేవు. నిదానమే ప్రధానం అనే పాలసీ కాబట్టి -అవకాశాలకోసం వేచి చూసింది. చివరకు టిప్స్‌సంస్థ ఆమె తలుపు తట్టింది.

'టిప్స్'లో అనుబంధం గురించి చెబుతూ"ఓ ప్రముఖ మ్యూజిక్ కంపెనీ నుండి అవకాశం రావటం ఆనందం అనిపించింది కానీ ఆ సంస్థలో ఒప్పందం నాకు లాభ నష్టాలు రెండింటినీ కలిగించింది. ఆ సంస్థ రూపొందించే నాన్ ఫిల్మ్ ఆడియో క్యాసెట్స్‌లో నేను పాటలు పాడాలన్నది ఒప్పందం. అయితే ఆ సంస్థకి మాత్రమే పాడాలన్నది వాళ్లు పెట్టిన షరతు. 'టిప్స్' లాంటి సంస్థలో పాడితే గుర్తింపు వస్తుందనే ఉద్దేశంతో అంగీకారాన్ని తెలిపాను. వరుసగా అనేక క్యాసెట్స్‌లో పాటల్ని పాడాను. అటువంటి సమయంలో ఊహించని విధంగా



సినిమాలో పాటలుపాడే అవకాశం వచ్చింది" అని తెలిపింది.

అప్పటివరకూ ఆడియో రంగానికే పరిమితమైన టిప్స్ సంస్థ 'కూలినెం.1' చిత్రంతో చిత్రనిర్మాణంలోనే ప్రవేశించింది. ఆ సినిమాకోసం ఓ పాటను ప్రముఖ గాయని పాడాలనుకున్నారు. అయితే ఆవిడ పాడేలోగా పిక్చరైజ్ చేయటంకోసం చందనాదీక్షిత్‌తో ట్రాక్ పాడించారు. అయితే అదేపాట తన తొలి సినీగీతం అవుతుందని ఆ క్షణంలో ఆమెకు తెలియదు.



ఆ క్షణాల్ని గుర్తుకు తెచ్చుకుంటూ" ఆనంద్ మిలింద్ ఆ చిత్రానికి సంగీత దర్శకులు. 'గోరియా చూరానా మేరా జియా' అనే పాట నాతో పాడించారు. విన్న తర్వాత వాళ్ళకి బాగా నచ్చింది. 'మళ్ళీ వేరే గాయనితో ఎందుకు పాడించటం? ఈవిడతోనే ఫైనల్ ట్రాక్ పాడిద్దాం అని అనుకున్నారు. నాకే వాళ్ళు అవకాశం కలిగించారు. 'కూలినెం.1' చిత్రం ఘనవిజయం సాధించటంతో నాకు - ఆపాటకు మంచి పేరు వచ్చింది. కానీ ఆనందం వెనుకే విషాదము వుంటుంది కదా- టిప్స్‌తో నాకున్న ఒప్పందం కారణంగా ఆ సమయంలో వచ్చిన మంచి మంచి అవకాశాల్ని వినియోగించు కోలేకపోయాను. ఆ తర్వాత ఆనంద్ మిలింద్ సంగీత దర్శకత్వంలోనే వచ్చిన 'రక్షక్' లోనేను పాడిన 'షహర్ కి లడ్‌కీ' పాట ఘనవిజయం సాధించింది. అది నాకు రెండవ బ్రేక్‌గా భావించాను. కానీ దురదృష్టం కొద్దీ ప్రింటింగ్ మిస్టేక్ జరిగి - ఆడియో క్యాసెట్ రేపర్స్ పై నాపేరు మిస్ అయ్యింది. అప్పుడు నేనెంత బాధపడ్డానో వర్ణనాతీతం. సరే....దర్శక నిర్మాతలూ చాలా ఫీల్ అయ్యారు. జరిగిన పొరబాటు దిద్దుకోలేనిది. అప్పటికే టిప్స్‌తో ఒప్పందం పూర్తికావడంతో బయటి చిత్రాలకు కొన్నిపాడాను. ఆనంద్‌మిలింద్ 'దన్‌వీర్', 'జాన్ జిగర్' తదితర చిత్రాలలో పాడేఅవకాశం ఇచ్చారు. సినిమాలు ఆశించిన స్థాయిలో ఆడకపోవడం -ఆడియోకు సరైన మార్కెటింగ్ జరుగక పోవటంతో రావాల్సినంత గుర్తింపు రాలేదు" అని వివరించారు.

## పాప్‌సింగర్ గా..

నేపథ్యగానం అచ్చిరాకపోవటంతో పాప్‌సింగర్‌గా చందనాదీక్షిత్ ట్రాక్ మార్చింది. ఆ ముచ్చట్లు చెబుతూ "1997లో వీనస్ సంస్థతో పాప్ ఆల్బమ్‌కు రూపకల్పన కోసం ఒప్పందం కుదుర్చుకున్నారు. అయితే కొత్తగాయని-పైగా తొలి ఆల్బమ్‌ని విడుదల చేయటం అంత తేలికైన విషయం కాదు. దాదాపు మూడేళ్ళు శ్రమపడిన తర్వాత మేం ఆశించిన స్థాయిలో 'జవాని' అనే పాప్ ఆల్బమ్‌ని తీసుకు రాగలిగాం"అని చెప్పింది. అప్పటి ట్రెండ్‌ను ఫాలో అవుతూనే అన్ని వర్గాల పాప్ శ్రోతల్ని చందనాదీక్షిత్ తొలి ఆల్బమ్ 'జవానీ' తో ఆకట్టుకుంది.

గాయనిగా లతామంగేష్కర్ తనకు ఆదర్శం అని చెప్పే చందనాదీక్షిత్ లక్ష్యాలు చాలా స్పష్టం. విభిన్నమైన పాటల్ని మన సంగీత దర్శకుల దగ్గర పాడాలన్నది ఆమె కోరిక. అంతేకాదు భారతదేశ పరిధులు దాటి విదేశాలలోని సంగీత దర్శకుల సలహాలు, సంప్రదింపులు- సౌజన్యంతో విభిన్నమైన పాప్‌ఆల్బమ్ తేవాలనే తపన. బాల్యం ఆఫ్రికా దేశంలో గడవటం -గత రెండుమూడు సంవత్సరాలుగా విదేశాలలో విస్తృతంగా మ్యూజిక్‌షోలను నిర్వహించటంతో చందనా దీక్షిత్ పరిధి విస్తరించింది. ఈ అనుభవాన్ని ఆసరాగా తీసుకుని అంతర్జాతీయ ప్రమాణాలతో ఓ కొత్త ఆల్బమ్‌ను తేవాలనుకుంటున్నదామె.

పాప్‌గాయనీగాయకులు తమకంటూ ఓ మార్కెట్‌ను సృష్టించుకోలేకపోతే- కెరీర్‌ను వైవిధ్యంగా సాగించటం కష్టమని, మ్యూజిక్ కంపెనీలు వీళ్ళతో ప్రయోగాలు చేయడానికి సిద్ధపడవని చందనాదీక్షిత్ అంటోంది. గాయనిగా కెరీర్ గ్రాఫ్ వేగంగా పైకి సాగకపోయినా తను తొందరపడనని ఇటుక మీద ఇటుక పేర్చి ఇల్లుకట్టే చందానా - తను స్థిరంగా ఎదగాలను కుంటున్నాని చందనా చెబుతుంది.

**- వి.అరుణ సత్యవతి**

**కామెడీ స్కెచ్**

# కదనరంగం

**- కోలపల్లి ఈశ్వర్**





"క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగిరండి ....." అంది సుమిత్ర భర్తకు దేవుడి బొట్టుపెడుతూ.

ఆమె కళ్లలో అస్పష్టంగా కన్నీటిపొర....

"అలా కన్నీళ్లు పెట్టుకోవద్దు... ప్లీజ్! నాకేం కాదు... నువ్ ధైర్యంగా ఉండు" అన్నాడతను కుడిచేత్తో ఆమె శిరసు నిమురుతూ.

అలా అంటున్నప్పుడు అతని కంఠం కూడా కొద్దిగా కంపించింది. లోలోన ఓ మూల అతనికీ కాస్త భయంగానే ఉంది. అదీగాక అతని స్నేహితులూ కమ్ సహోద్యోగులూ అయిన రవితేజ, మార్తాండ్ అప్పటికే వికలాంగులయ్యారు. ఎంత వద్దనుకున్నా వాళ్లిద్దరి రూపాలే అతని కళ్ల ముందు కదలాడుతున్నాయి.

చెయ్యి విరిగిన రవితేజ, కాలువిరిగిన మార్తాండ్... ఎక్కడి నుంచో తనకేసి జాలిగా చూస్తున్నట్టనిపించి ఉలిక్కిపడ్డాడోక్షణం. భర్తలోని ఉలికిపాటుని గమనించి బేలగా అడిగింది సుమిత్ర.

"ఏమండీ భయంగా ఉంది కదూ...!?"

"అబ్బే, నాకేం భయం?" అన్నాడతను మేకపోతు గాంభీర్యాన్ని నటిస్తూ.

"అయినా నువ్వు వీరతిలకం దిద్దావ్‌గా - ఇంకా భయమేంటి!?" చిన్నగా నవ్వడానికి ప్రయత్నించాడుగానీ, అతని ప్రయత్నం ఫలించలేదు..

ఎలాఫలిస్తుంది...!?

వెళ్తున్నది కదనరంగానికి కదా.... తిరిగి సక్రమంగా ఇల్లు చేరుకోగలడన్న గ్యారంటీ ఏముంది!? కన్నే పోతుందో, కాలే పోతుందో, చెయ్యసలు ఉంటుందో ఉండదో లేక ఏకంగా ప్రాణాలే పోతాయో ఎవరు చెప్పగలరు?

"పోనీ వెళ్లడం మానేస్తారా?" అంది సుమిత్ర దిగులుగా వున్న భర్త ముఖంలోకి చూస్తూ.

"ఎలా మానెయ్యగలం డ్యూటీ అనుకున్నాక తప్పదుగా...!?" అన్నాడు విక్రాంత్.

"అవును కరెక్టే ?" అనుకుంది సుమిత్ర.

పెల్లుబికి రాబోయిన కన్నీటిని దిగమింగుకుంటూ "సరే బయల్దేరండయితే" అంది భర్తకు దారిస్తూ.

"నేను సాధ్యమైనంత త్వరలో వచ్చేస్తాను" గాధ్గదిక స్వరంతో చెప్పాడు విక్రాంత్.

సుమిత్ర మనసులో కూడా రవితేజ, మార్తాండ్‌లిద్దరూ మెదిలారు! వాళ్లలాగే తన భర్తను కూడా ఓ వికలాంగుడిగా ఊహించుకుంటుంటే... ఆమెకు "ఏమండీ" అంటూ బావురుమని ఏడ్వాలనిపించింది.

కానీ తానలా ఏడిస్తే అది తన భర్తలో అధైర్యాన్ని నూరిపోసినట్టే అవుతుంది కాబట్టి - ఒక వీరపత్నిగా ఆమె ఆ పని చేయలేకపోయింది.

"ఒకవేళ జరక్కూడనిది జరిగి....నాకేమైనా అయితే మన ఇన్సూరెన్స్ ఏజెంట్‌ని సంప్రదించి...." అంటూ ఏదో చెప్పబోయాడు విక్రాంత్.

కానీ సుమిత్ర అతన్ని మాట పూర్తి చేయనివ్వలేదు

"చఛ! అవేం పాడు మాటలండీ ? మీకేం కాదు..... మీరు ధైర్యంగా వెళ్లిరండి" అంది నోటికి చెయ్యిఅడ్డం పెడుతూ.

"అవును నాకేం కాదు" అని లోలోన తనకు తానే ధైర్యం చెప్పుకొని "వెళ్లొస్తాను సుమిత్రా" అంటూ...భారమైన హృదయంతో కదిలాడు విక్రాంత్.

అతనలా గడపదాటగానే పూజా మందిరంలోకి పరుగు తీసి దేవుళ్ల విగ్రహాల ముందు కూలబడింది సుమిత్ర.

ఏరి కోరి చేసుకున్న భర్త!

పెళ్లై రెండేళ్లైనా కాలేదింకా! ...కనీసం కడుపున ఓ కాయైనా కాయలేదు!!!...

"హే భగవాన్! ఆయనకే ఆపదా కలక్కుండా కాపాడు" సజల నయనాలతో , నిండు మనస్సుతో దేవుని ప్రార్థించింది.

యుద్ధానికి వెళ్లిన వారంతా కచ్చితంగా వికలాంగులో, విగత జీవులో అవ్వాలని రూలేం లేదు. అయినా ఏక్షణాన్న ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? రాత బాగుండకపోతే, విధివక్రిస్తే ,ఎంతటి అనర్థమైనా జరగవచ్చును. రవితేజ, మార్తాండ్‌ల విషయంలో అలాగే కదా జరిగింది?

ఆపైన ఆమె మరి ఊహించలేకపోయింది! "ఛ! నా భర్త విషయంలో అలా ఎన్నటికీ జరగదు! చిన్నప్పటినుంచి నేను చేసిన పూజలూ,నోచిన నోములంతా ఊరికే పోతాయా?..... ఎన్నటికీ పోవు. ఆయన ఖచ్చితంగా క్షేమంగానే తిరిగొచ్చేస్తారు...." తనకు తానే ధైర్యం చెప్పుకుంటూ, అలాగే అక్కడే ఆ పూజ గదిలోనే కూర్చుండి పోయింది సుమిత్ర.

పది నిముషాలు గడిచాయి

"సుమిత్రా"

అన్న పిలుపు వినిపించింది. అది తన భర్త గొంతే ఆ భగవంతుడు తన భక్తులకెప్పుడూ అన్యాయం చేయడు అనే నిజాన్ని నిజం చేస్తూ.... విక్రాంత్ కనిపించాడు....క్షేమంగా!!

అతన్ని చూస్తూనే "అదేంటి అప్పుడే ఎలా వచ్చేశారు?" అంటూ ఆనంద భాష్పాలతో అడిగింది సుమిత్ర.

"ఇవ్వాళెందుకో రేషన్ షాపు దగ్గర క్యూ అంత పెద్దగా లేదు. చూస్తున్నావ్‌గా కనీసం నేను వేసుకున్న షర్టయినా నలగలేదు" అంటూ అతను సంతోషంగా నవ్వుతుంటే.

"పోనీలెండి అంతా నా అదృష్టం! ఎంతైనా నా తాళిబొట్టు గట్టిది" అంటూ పైట చాటునుంచి తాళిని బైటకు తీసి కళ్లకద్దుకుని సంతోషంగా నవ్వింది సుమిత్ర! *



జగద్గురు కంచి కామకోటి పూర్వ పీఠాధిపతులు
శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి శంకరాచార్య స్వామివారు



జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతులు
శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతి శంకరాచార్య స్వామి వారు



జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతులు
శ్రీశ్రీశ్రీ విజయేంద్రసరస్వతి శంకరాచార్య స్వామి వారు

## తెలుగువాకిట కంచి కామకోటి కటాక్షవీక్షణం

# శంకర కంటి ఆసుపత్రి

శ్రీ కంచికామకోటి మెడికల్ ట్రస్ట్, శంకర ఐ సెంటర్, కోయంబత్తూర్, శంకర ఐ ఫౌండేషన్, అమెరికా

**విజయవాడ-గుంటూరు జాతీయ రహదారి ప్రక్కన, పెదకాకాని వద్ద, గుంటూరు**

కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురువులు
శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి శంకరాచార్య స్వామీజీ,
శ్రీశ్రీశ్రీ శంకర విజయేంద్ర సరస్వతి స్వామీజీ వార్ల దివ్య సమక్షమున

అందరికీ అందుబాటులో
ఉండే అత్యాధునిక
నేత్రవైద్యశాల

రాష్ట్రపతి డా॥ అబ్దుల్ కలాం కరకమలాల మీదుగా
**శుభారంభం ది. 02-03-04న**
**ఉ॥ గం॥ 10-30 నుండి గం॥ 12-00**



సర్వేంద్రియాణాం
నయనం ప్రధానం

5 ఎకరాల భూదానం
జనచైతన్య హౌసింగ్ లి॥ గ్రూప్ సంస్థల కుటుంబ సభ్యులు



మాదల సుధాకర్
ఛైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్

## జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్

ఇండ్ల స్థలముల కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ

KALYANI ADS/JCH-04

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 8

| పాత్రలు | | నటీనటుల సజేషన్ |
|---|---|---|
| వీరభద్రం | - | కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - | నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - | తరుణ్ |
| అశ్విని | - | శ్రియ |
| పార్వతమ్మ | - | అన్నపూర్ణ |
| హనుమంతు | - | గుండు హనుమంతరావు |
| అనంత్ | - | గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

-జీడిగుంట రామచంద్రమూర్తి



**జరిగిన కథ**

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహుద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్విని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర. సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. మావల సంఘం సెక్రటరీ అప్పారావు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినట్టు వీరభద్రానికి తెలుస్తుంది. అత్తగారి కోరిక మేరకు తనకు రావలిసిన కట్నం బాపతు సొమ్ము రాబట్టు కోవడానికి ఒక సంవత్సరం గడువిస్తాడు రాజేంద్ర. కాలేజీనుండి ఇంటికి బయలుదేరిన శ్రీరామ్‌ను తన కారులో రమ్మంటుంది అశ్విని.

-(ఇక చదవండి)




రోడ్డుమీద ఎవరైనా తమను చూస్తే బాగుండదని బెదిరిపోతూనే, ఓసారి అటూ ఇటూ చూసి కారు ఎక్కేసాడు శ్రీరామ్...

అశ్విని చాలా 'జాలీ' గా 'డ్రైవ్'చేస్తోంది... కొన్ని క్షణాల తర్వాత 'విజిల్'తో పాటకూడా అందుకుంది...అయినా శ్రీరామ్‌లో చలనం లేదు...

గంభీరంగా మారిపోయాడు.

అప్పుడు అశ్విని అడిగింది - 'సినిమాలకీ - జీవితానికీ ఎంత డిఫరెన్సుందో చూశావా?'...

"అంటే...?" కోపంగా చూశాడు.

"సినిమాల్లో అయితే - హీరో కారు 'డ్రైవ్' చేస్తూ - బెట్టు చేసే అమ్మాయిని తనవైపు మరల్చు కోవాలని తాపత్రయపడతాడు... పాటలు పాడ తాడు... అల్లరి చేస్తాడు...! కానీ మన విషయంలో అది రివర్సయిందన్నమాట... అయినా అదేమిటో, నువ్ పెడమొహం పెడుతున్న కొద్దీ- నీమీద 'మోహం' పేట్రేగిపోతోంది!" చెప్పింది అశ్విని.

శ్రీరామ్ బదులుచెప్పలేదు.

కారు వేగంగా వెళుతోంది.

"ఎక్కడికి తీసుకుపోతున్నావ్?"-కొంత దూరం వెళ్లేక సీరియస్‌గా అడిగేడు. "ఆదిలాబాద్ అడవుల్లోకి కాదులే!.. పాల సముద్రంలోకి!" - కూల్‌గా చెప్పింది.

"పాల సముద్రం ఏమిటీ?"

"చూస్తావ్‌గా!"

"కాదు...ముందు అదేమిటో చెప్పాలి!"- కోపంగానే స్టీరింగ్ పట్టుకున్నాడు.

"మా 'బిల్డింగ్' పేరు పాలసముద్రం.... నిన్నిప్పుడు మా ఇంటికి తీసుకెళ్తున్నాను!"

"మీ ఇంటికి నేనెందుకూ?.... కారాపు!... దిగిపోతాను!"

"ష్యూర్! నా ప్రయత్నం కూడా నువ్ దిగిపోవాలనే!.. ప్రేమలో!" - అతని చేతిమీద తనచేయి వేసి చిలిపిగా నవ్వింది.

శ్రీరామ్ నిస్సహాయంగా చూశాడు.

మరో అయిదు నిమిషాల్లో - కారు అశ్విని మేడ ముందు ఆగింది. కాంపౌండు గోడమీద పాలరాతి ఫలకంమీద "పాలసముద్రం" అనే అక్షరాలు చెక్కి వున్నాయి. కారు హారన్ మోగించింది అశ్విని... గూర్ఖా వచ్చి తలుపులు తెరిచాడు. కారు పోర్టికోలో ఆపింది. "కమాన్! మా 'డేడీ' కి నిన్ను పరిచయం చేస్తాను!" కారు దిగి శ్రీరామ్ చేయి పట్టుకుని పక్కనేవున్న గార్డెన్‌లోకి నడిచింది.

'స్టాండు ఉయ్యాల'లో కూర్చుని 'యాపిల్' ముక్కలు తింటున్న విష్ణుమూర్తి అశ్వినిని చూసి పలకరించాడు

"హాయ్ బేబీ! నీ కోసమే చూస్తున్నానమ్మా!"

అశ్విని పరుగెత్తుకుంటూ వెళ్ళి - "థ్యాంక్యూ డేడీ" - అంటూ తండ్రి మెడ చుట్టూ చేతులు వేసి బుగ్గమీద సుతారంగా ముద్దుపెట్టుకుంది.

వాళ్ళవైపు అలాగే కొన్ని క్షణాలు విస్మయంగా చూసిన శ్రీరామ్ కళ్ళముందు మరో దృశ్యం - ఊహామాత్రంగా కదిలింది!

ఆ దృశ్యంలో - విశాలమైన తమ ఇంటి హాల్లో ఉయ్యాల బల్ల మీద కూర్చున్న వీరభద్రం ఉప్మా తింటున్నాడు... సైకిలు రిక్షాలోంచి దిగిన శ్రీరామ్ - చేత్తో సూట్‌కేసు పట్టుకుని లోపలకు వచ్చాడు...అతన్ని వీరభద్రం పలకరించాడు-

"ఇదేనా అఘోరించటం?.. పరీక్షలు బాగా రాసి తగులడితివా?.."

అయినా శ్రీరాం బెదిరిపోలేదు. చేతిలోవున్న సూట్‌కేసు పక్కనపెట్టి, గబగబా తండ్రి దగ్గరకు వెళ్ళి "హాయ్‌డాడీ" - అంటూ ఆయన మెడ చుట్టూ చేతులు వేసి బుగ్గమీద సుతారంగా ముద్దుపెట్టుకున్నాడు.

మరుక్షణంలో - అతని చెంప ఛెళ్లు మనిపించి,దూరంగా తోసేశాడు వీరభద్రం- తాగి తాగి - పైత్యము ప్రకోపించినదా ఏం?.. అయినా కాలేజీనందు చదివినంత మాత్రాన కారుకూతలు కూయనవసరంలేదు... మరోసారి 'హాయ్ డాడీ' లూ, 'ఓయ్ మమ్మీ'లూ తమ నోటివెంట వచ్చినచో - అట్లకాడ కాల్చి నాలుక మీద వాతలు పెట్టేస్తాను!.. పోయి నోరు శుద్ధి చేసుకునిరా!"- అన్నాడు కళ్లెర్ర చేస్తూ....

కళ్ళముందు 'భ్రమ' లా వదిలిన ఆ దృశ్యాన్ని చూసి ఉలిక్కిపడ్డ శ్రీరామ్ - వెంటనే వాస్తవానికి వచ్చాడు.

"డేడీ! ఇతనే శ్రీరామ్!.. నాక్లాస్‌మేట్!.. జెమ్ ఇన్ ఆల్ సబ్జెక్ట్స్"- అంటూ అతన్ని తండ్రికి పరిచయం చేసి - ఆ వెంటనే అతని భుజం మీదకు వంగి, చెవిలో రహస్యంగా అంది- "బట్ - ఐ యామ్ ఇన్‌లవ్!"

ఇంతలో విష్ణుమూర్తి తన చేయి చాపి 'షేక్‌హ్యాండ్' ఇస్తూ అన్నాడు - "ప్లీజ్‌డ్ టు సీ యూ యంగ్ మాన్!..అయామ్ విష్ణుమూర్తి!"



ఆయన చేతిలో తన చేయిని కలిపి ఎందుకో తన చేయి తనకే చల్లగా వున్నట్లు తోచింది శ్రీరామ్‌కి.

"కమాన్! బయట చలిగా వున్నట్టుంది... లోపల కూర్చుందాం!"- అంటూ అతన్ని హాల్లోకి తీసుకెళ్లి - సోఫా చూపించాడు. తెల్లటి మఖ్‌మల్ కవర్లతో మెరిసిపోతున్న ఆ సోఫాలో తను కూర్చుంటే- 'అదెక్కడ మాసిపోతుందో' అన్నట్టుగా - క్షణంసేపు తటపటాయించి - ఆ పిమ్మట నెమ్మదిగా, పొందిగ్గా అందులో కూర్చున్నాడతను.

"మీరు మాట్లాడుతూండండి డేడీ!.. నేను వెళ్ళి జ్యూస్ తెస్తాను!" - లేడిపిల్లలా లోపలకు పరుగెత్తింది అశ్విని.

ఆమెవైపు అలాగే తన్మయంగా చూసి- తర్వాత, శ్రీరామ్‌తో చెప్పాడు విష్ణుమూర్తి - "నా ఏకైక బిడ్డ!...'గారాలకూచి' - అదృష్టాన్నీ - దురదృష్టాన్నీ వెంటబెట్టుకొచ్చింది."

అర్థం కానట్టు చూశాడు శ్రీరాం...

మేడ మెట్లమీదున్న నిలువెత్తు ఫొటోవైపు బరువుగా అడుగులు వేస్తూనే - మళ్లీ చెప్తున్నాడు విష్ణుమూర్తి-

"షి ఈజ్ మై వైఫ్!... మా బేబీ పుట్టిన అయిదు నిమిషాలకే ఆమె నాకు శాశ్వతంగా దూరమైంది.... ఆ తర్వాత మరో అరగంటకు - నాకు బిజినెస్‌లో నాలుగుకోట్ల లాభం వచ్చిందన్న వార్త తెలిసింది"...

ఆయన చెప్తున్న విషయాలు వింటూనే- ఇంద్రభవనాన్ని తలపింప చేస్తున్న ఆ ఇంటినీ - చుట్టూ కనిపిస్తున్న అందమైన అలంకారాల్నీ పరిశీలనగా చూస్తున్నాడు శ్రీరామ్...

విష్ణుమూర్తి ఇంకా చెప్తూనే వున్నాడు..

"అఫ్‌కోర్స్!..నేను నమ్మకాలకీ,మూఢ విశ్వాసాలకీ అతీతుణ్ణి! అందుకే భార్యపోయిన విషాదానికి కృంగిపోలేదు.. కోట్లు కలిసొచ్చిన ఆనందానికి పొంగిపోలేదు. రెండిటినీ సమానంగానే తీసుకున్నాను... తల్లిలేని అశ్వినిని అపురూపంగా పెంచుకొచ్చాను... దానికి అమ్మా నాన్నా, అయిన వాళ్లూ, ఆప్తమిత్రులూ-అందరూ




నేనే!... నాకు అన్నీ తనే!... అది, అరసెకను కనుమరుగైతే తట్టుకోలేను.. ! బై ది బై! కాలేజీ చదువుకంటే ముందే, మా బేబీ నీకు తెలుసా?.. అయ్ మీన్ పరిచయముందా?"-

"లేదండీ! మా పరిచయం కాలేజీలోనే!.. ఇద్దరం ఒకే గ్రూప్!"

"అన్నట్టు నీ హ్యాండ్ రైటింగ్ బాగుంది" చివ్వున తలెత్తి చూశాడు శ్రీరామ్.. అదే!.. మొన్నీమధ్య నువ్ ఆకాశరామన్న ఉత్తరం రాశావ్‌గా .. చూశాను!"

తప్పుచేసిన వాడిలా తలవంచుకున్నాడు శ్రీరామ్.

"అసలు ఆ ఉత్తరం నువ్వే రాసావని అశ్విని చెప్పిన తర్వాత నిన్ను చూడకపోయినా నీ వ్యక్తిత్వం ఎంత గొప్పదో నేనర్థం చేసుకున్నాను...

మా బేబీ తన 'లైఫ్ పార్టనర్'గా నువ్వే కావాలని ఎందుకంత పట్టుపడుతోందో గ్రహించాను!"

శ్రీరామ్ - మౌనంగా వింటూండి పోయాడు.

"బైదిబై!... నామటుకు నేను స్నేహాన్ని తప్ప ఈ సృష్టిలో దేన్నీ నమ్మను!... అందుకే అంటాను- 'అసలు స్నేహమే చెయ్యకు - చేస్తే దాన్ని ప్రాణస్నేహంగా తీర్చి దిద్దుకో- అని!... నువ్ 'అబ్జర్వ్' చేశావో లేదో - నా బిడ్డకి, కాలేజీలో స్నేహితులెవ్వరూ లేరు.. అది పుట్టి ఇన్నేళ్ళయినా - ఇప్పటివరకూ - ఇలా ఎవర్నీ తీసుకొచ్చి - 'నా ఫ్రెండ్' అంటూ పరిచయం చెయ్యలేదు... 'దటీజ్ మై బేబి'అశ్విని''- గర్వంగా చెప్తున్న విష్ణుమూర్తి కళ్ళల్లో మెరుపు చూశాడు శ్రీరామ్.

అశ్విని అప్సరకాంతలా తయారై - 'ట్రే' లో 'ఆరెంజ్ జ్యూస్' గ్లాసుల్ని పెట్టుకుని వచ్చింది..

"కమాన్! హేవిట్ - మా బేబి ఆరెంజ్ జ్యూస్ తయారు చేసిందంటే - అది తాగిన వాళ్ళకి మరో పాతికేళ్ళ అయుర్దాయం పెరుగుతుంది!" - అంటూ ఓ గ్లాసు శ్రీరామ్‌కి అందించి - తానో గ్లాసు తీసుకున్నాడు విష్ణుమూర్తి.

"నీ పేరు 'శ్రీరామ్' అనికదూ అన్నావ్?" కొన్నిక్షణాల తర్వాత జ్యూస్ 'సిప్ చేస్తూ' అడిగాడు,

"నేను అన్లేదండి!... మీ అమ్మాయే నన్ను పరిచయం చేస్తూ చెప్పింది మీకు!..." తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నాడు శ్రీరామ్.

"దట్స్ గుడ్!..." అలా జోక్స్ కట్ చేస్తూ 'లైవ్లీ'గా మాట్లాడే వాళ్ళంటే నాకు చాలా ఇష్టం!... ఆ మాట కొస్తే నాకు శ్రీరాముడంటే కూడా ఇష్టమే!.. ఆదర్శ పురుషుడు!"

"ఈయన కూడా ఆదర్శ పురుషుడే డాడీ!.. తండ్రి మాటంటే వేదవాక్కు!.. నున్నగా గుండు చేయించుకుని, ఆపై ఖద్దరు టోపీ పెట్టుకుని వాళ్ళ ఊరి స్కూల్లో బంట్రోతు పని చెయ్యమని వాళ్ళ నాన్న గారు ఆజ్ఞాపిస్తే తూ.చ తప్పకుండా మరుక్షణం పాటిస్తాడు!" శ్రీరామ్‌ని ఆట పట్టించే ధోరణిలో చెప్పింది అశ్విని...

సరిగ్గా శ్రీరామ్ ఆ క్షణాన అదే రూపంలో కనిపించిన భ్రమ కలిగింది విష్ణుమూర్తికి!... పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకున్నాడు... శ్రీరామ్‌కి మాత్రం ముళ్ళ మీద కూర్చున్నట్టుగా వుంది... అయినా మర్యాద కోసం బలవంతంగా నవ్వు తెచ్చుకొనే ప్రయత్నం చేశాడు.

"కమాన్! మా ఇల్లు చూద్దువుగాని!" జ్యూస్ తాగటం పూర్తయ్యాక శ్రీరామ్ చేయి పట్టుకుని మేడ మీదకు తీసుకెడుతూ అన్నాడు విష్ణుమూర్తి ముగ్గురూ ముందుగా బెడ్‌రూమ్‌లోకి వచ్చారు...

ఆ గది చాలా ఖరీదుగావుంది. నేలమీద బిస్కట్ కలర్ మెత్తటి తివాసీ పరిచివుంది. పందిరి మంచానికి పక్కగా గోడమీద పెద్ద పెయింటింగ్ వేళాడుతోంది. దానిమీద



కిందభాగంలో ఓ 'కొటేషన్' రాసుంది.

".........కెరటం నా ఆదర్శం
లేచి పడినందుకు కాదు..
పడి - లేచినందుకు!"

"ఎలావుంది?" - చదివింతర్వాత అడిగేడు.

"మీ వాయిస్ చాలా బావుంది!"

"వాయిస్ గురించి కాదు!....కొటేషన్..! 'కొటేషన్ ఎలావుందీ' అని అడుగుతున్నాను!"

"మీ వాయిస్ లాగే చాలా గంభీరంగా వుంది... పువ్వుకి తావి అబ్బినట్టుగా వుంది!" చెప్పేడు శ్రీరామ్ గొప్పగా.

"థ్యాంక్యూ అప్పుడప్పుడూ ఎవరైనా పుస్తకం చదువుతున్నప్పుడు ఇలాంటి మంచి వాక్యాలు కనిపిస్తే వాటిని ప్రత్యేకంగా నోట్ బుక్‌లో రాసుకుని ఇలా సద్వినియోగ పరుస్తూంటాను!" గర్వం తొణికిసలాడే స్వరంతో చెప్పాడు విష్ణుమూర్తి.

ఆ 'పెయింటింగ్' వైపు ఇప్పుడు నిశితంగా చూశాడు శ్రీరామ్.

అందులో ఒకే ఒక కెరటం, ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నట్టు కనిపిస్తోంది.. తర్వాత శ్రీరామ్‌ని పక్కనే వున్న మరో గదిలోకి తీసుకెళ్ళాడు... ఆ గది కూడా చాలా అందంగా వుంది.

"ఇది మా అశ్విని బెడ్‌రూమ్!" చెప్పాడు.

శ్రీరామ్‌కి ఎందుకో ఆ గదిని మరింత పరిశీలనగా చూడాలనిపించిది. అలా చూస్తున్న అతనికళ్లు ఒక్కచోటనే - రెప్ప వాల్చకుండా అలాగే నిల్చిపోయాయి. ఆ నిల్చిపోయిన ప్రదేశంలో ఓ డ్రాయింగ్ టేబుల్ ఉంది. దానిమీద నాలుగైదు పుస్తకాలూ, ఒక "టేబుల్ ల్యాంపూ" వున్నాయి... 'ల్యాంప్' పక్కనే ఓ ఫొటో ఫ్రేమ్!.. అందులో - చేత్తో గీసిన 'కేరికేచర్' కనిపిస్తోంది.

"ఏమిటీ అలా చూస్తున్నావ్?" అతని చూపుల్ని అడ్డుకుంటూ అడిగింది అశ్విని.

శ్రీరామ్ జవాబు చెప్పలేదు. ఆమెవైపు తదేకంగా చూశాడు. ఆ చూపుల్లో ఇదివరకటి నిరసన భావం లేదు. ఆరాధనా భావం చోటు చేసుకుంది...

"నువ్ 'క్లాస్‌రూం' లో శ్రద్ధగా పాఠం వింటూ కూర్చున్నప్పుడు నేను నిన్నే శ్రద్ధగా చూస్తూ ఆ బొమ్మ గీసాను.... అందులో నీ పోలికలున్నాయంటావా?" అడిగిందామె.

ఇప్పుడు కూడా అతను మాట్లాడలేదు.. అతని కళ్లు నెమ్మదిగా చెమ్మగిల్లుతున్నాయి...

ఇంతలో విష్ణుమూర్తి చెప్పాడు. 'హార్టు'ను స్పందింపచేసే దృశ్యాల్ని ఇలా 'ఆర్ట్' పేపర్లలో భద్రపరచుకుంటూంటుంది!"

కృతజ్ఞతాపూర్వకంగా ఆమెవైపు చూశాడు శ్రీరామ్! నీటిపొర అడ్డంపడింది. అతని కళ్లకు ఆమె రూపం అస్పష్టంగా కనిపించింది.

"ఇదిగో ఈ పెయింటింగ్ చూశావా?" పక్కనే గోడకు తగిలించివున్న మరో 'ఆయిల్ పెయింటింగ్'ను చూపిస్తూ అన్నాడు విష్ణుమూర్తి.




అదో చిన్న పిచ్చుక గూడు!.. కళ్ళు తెరవని ఎర్రని పసిగుడ్డుకి ముక్కుతో ఆహారాన్ని అందిస్తోంది పిచ్చుక!.. ఆ పెయింటింగ్ కింద కూడా ఓ 'కొటేషన్' రాసివుంది-

"పిచ్చుక గూడులో సైతం స్వర్గముంటుంది...

పిడికెడు గుండెలోనైనా ఆకాశమంత ప్రేమ వుంటుంది!"

అప్రయత్నంగానే ఆవాక్యాన్ని పైకి చదివేశాడు శ్రీరామ్!

"అది మన స్వంత కవిత్వం! ఎలా వుందంటావ్?.. ఆఫ్‌కోర్స్..పెయింటింగ్ మాత్రం మా బేబీయే తీసింది.. సరస్వత్తోడు!.. తలపై చేయి వేసుకుంటూ చెప్పాడాయన..

"సరస్వత్తోడుగా ఈ పెయింటింగ్ నాకెంతో నచ్చింది"- శ్రీరామ్ కూడా ఆయన్ని అనుకరిస్తూ అన్నాడు.

అశ్విని కళ్ళు ఆనందంతో మెరిశాయి.

తర్వాత ముగ్గురూ ఇంకో గదిలోకి నడిచారు... దాన్నీ... దాని పక్కనేవున్న మరో విశాలమైన హాలునీ చూపిస్తూ చెప్పాడు విష్ణుమూర్తి- "ఇది గెస్ట్‌రూమ్!.. అది విజిటర్స్ లాంజ్!"

ఆ లాంజ్‌లో - గోడలకు అమర్చిన రెండు పెద్ద 'పెయింటింగులు' శ్రీరామ్‌ని విశేషంగా ఆకర్షించాయి.

ఒక దాంట్లో ప్రత్యేకించి బొమ్మ ఏదీలేదు. ఓ మూల చిన్న సిగరెట్టు కాలుతోంది. పొడవుగా దాని ముందు కొడిగట్టినుసిలోంచి- నల్లని పొగ -భయంకర భూతంలా తక్కిన ఫ్రేమంతా వ్యాపించి వుంది...!

ఇక రెండో పెయింటింగ్‌లో - 'మదర్ థెరీసా', చెదిరిన జుట్టుతో, చిరిగిన గౌనులో వున్న నాలుగేళ్ళ పాప నుదుటి మీద ముద్దు పెట్టు కుంటున్న దృశ్యం...! దాని కింద రెండు వాక్యాలు రాసి ఉన్నాయి..

"ప్రేమవుంటే చాలు మెండుగా -
డబ్బుఎంత వుండీ ఎందుకు-దండగ!"

ఆ రెండు వాక్యాల్నీ పైకి చదివిన శ్రీరామ్‌తో చెప్పాడు విష్ణుమూర్తి -

"ఆ వాక్యాలు మా బేబీ రాసింది కానీ ఆ 'సిగరెట్ పెయింటింగ్' పక్కనున్న కొటేషన్ నేను చెప్పాను!.. ఓసారెపుడో ఓ ఇంగ్లీషు పుస్తకంలో చదివాన్లే!" అంటూ దాని ముందుకు నడిచాడు.

"నథింగ్ కెన్ క్యూర్ స్మోకింగ్.... ఓన్లీ కేన్సర్! 'థాంక్స్ ఫర్ నాట్ స్మోకింగ్!!"

ఆ వాక్యాల్ని మనసులోనే చదువుకుంటున్న శ్రీరామ్ భుజంమీద చేయివేసి అడిగేడాయన- "నువ్ స్మోక్ చేస్తావా?"

ఉలిక్కిపడి చూశాడు శ్రీరామ్ "నేనా..!"అమ్మో... మా నాన్నగారు...!....అబ్బే.!.ఛస్తే చేయనండి!" - తడబడుతూ చెప్తున్న శ్రీరామ్ అవస్థ గమనించి గలగలా నవ్వేసింది అశ్విని.

**-(ఇంకావుంది)**



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నుండి 2002 సంవత్సరానికి రఘుపతి వెంకయ్య అవార్డు అందుకున్న సందర్భంగా....



# ఆవిడ పాటల కోసం ఆ సినిమాను కనీసం ఓ అరడజను సార్లు చూసుంటాను

దాదాపు పాతిక సంవత్సరాల క్రితం మొట్టమొదటిసారి నేను సుశీలగారితో కలిసి 'చరిత్రహీనులు' అనే సినిమాకి ఒకపాట పాడడం జరిగింది. అంతవరకూ ఆవిడ పాటలు విని పెరిగిన నాకు, ఆవిడతో కలిసిపాడటం అనేది ఓ అందమైన అనుభవం. ఇక్కడ అందమైన అని ఎందుకు రాశానంటే 'ఆవిడ పాట ఎంత కమ్మగా వుంటుందో,ఆమాట,ఆరూపం అంత పొందికగా మనోహరంగా వుంటుంది. ఇరవై నాలుగు గంటలూ పనిచేస్తూ వున్నాకూడా, విసుగ్గా , చిరాకు చూపించటం గానీ, షాబీగా తయారవటంగానీ నేను చూడలేదు. తెల్లటి చీరలో చల్లగా నవ్వుతూ వచ్చేవారు రికార్డింగుకి. అప్పుడప్పుడు కాస్త అల్లరికూడా చేసేవారు. "ఇంత మామూలుగా వుండే ఈ ఆంటీ ఇన్ని అద్భుతమైన పాటలు ఎలా పాడారబ్బా"అనిపించేది. ఖచ్చితంగా ఏ కిన్నెర కన్యో, గంధర్వ కన్యో ఆవిడని ఆవహించుండాలి. అంత తియ్యటి కంఠం ఈ ప్రపంచంలో ఇంకెవరికీ లేదు. ఎంత స్వచ్ఛమైన ఉచ్చారణ!? ఒకసారి పాటవింటే రాసేసుకోవచ్చు. అంత బాగా అర్థమవుతుంది. క్రిస్టల్ క్లియర్ అంటారే అదన్నమాట. ఆవిడ ప్రభావం నామీద చాలావుంది. ఒకప్పుడు చాలా చాలా వుండేది. అయితే మొదట్లోనే అన్నయ్య "ఒరిజినల్ సుశీల వున్నప్పుడు, డూప్లికేట్‌ని ఎంకరేజ్ చెయ్యరు. నువ్వు నీలా పాడటం మొదలుపెట్టు" అని చెప్పాడు. ఊహ తెలిసిన దగ్గర నుంచి ఆవిడ పాటలే పాడేదాన్ని, అందుకే అంత ప్రభావం ఉండేది. తమిళంలో పాడటం మొదలు పెట్టగానే, కాస్త ఆ ప్రభావం తగ్గింది. 'అమాయకురాలు' అనే సినిమాలో 'పాడెద నీ నామమే' అనే పాటను పాడి ఎన్ని బహుమతులు పొందానో నాకే గుర్తులేదు.

ఒక ఇంటర్వ్యూలో ఎమ్.ఎస్.విశ్వనాథన్‌గారు "సుశీల వాయిస్‌ని నేను మాక్సిమమ్ వాడుకున్నా" అని అన్నారు. తమిళంలో ఎమ్.ఎస్.గారికి ఆవిడ పాటలన్నీ అద్భుతాలే. అలాగే కె.వి. మహదేవన్‌గారు సంగీతం సమకూర్చిన 'తిల్లానా మోహనాంబాళ్' అనే సినిమాలో ఆవిడ పాడిన పాటలకోసం ఆ సినిమా కనీసం ఓ అరడజను సార్లు చూసుంటాను. తెలుగులో 'భక్తప్రహ్లాద' సినిమాలోని పాటలు,పద్యాలువిని, "ఇలాంటి పాటలు పాడే అదృష్టం నాకు వస్తుందా" అని వాపోయేదాన్ని. బాపుగారి "భాగవతం"లో పాడటంతో ఆకోరిక తీరింది.



రఘుపతి వెంకయ్య పురస్కారం అందుకుంటున్నారని తెలిసి ఆంటీకి ఫోన్ చేసి "చాలా ఆలస్యంగా ఇచ్చినా,ఈ పురస్కారం మీకు రావటం చాలా సంతోషంగా వుంది"అని అభినందిస్తే "ఫర్వాలేదమ్మా, మంచి అవార్డు కదా?" అని నవ్వేశారావిడ.

అసలు సుశీలగారికి ఇంతవరకు పద్మశ్రీగానీ, డాక్టరేట్‌గానీ ఇవ్వకపోవటం శోచనీయం. ఇటు తెలుగు, అటు తమిళ ప్రభుత్వాలు ఇందుకు చొరవ తీసుకోకపోవటం చాలా బాధాకరం. ఈ మధ్య వచ్చిన గాయకులు పద్మశ్రీలందు కుంటుంటే, ఇన్ని వేల పాటలు పాడి, ఇన్నేళ్ళుగా చిత్రపరిశ్రమలో వెలుగుతున్న సుశీల గారిని కేంద్రప్రభుత్వం గుర్తించలేదంటే ఆ తప్పుమనది. సంగీత అభిమానులది. కాస్త వూరట రఘుపతి వెంకయ్య పురస్కారం అందుకోవటం. ఈ పురస్కారం ఆవిడకు అందచేసి రాష్ట్ర ప్రభుత్వం తనని గౌరవించుకుంది. ఈ సందర్భంగా 'హాసం' పత్రిక వారు ఈ వ్యాసం రాయమని అడినప్పుడు, ముందు భయపడ్డాను. ఎందుకంటే, చక్కగా మాట్లాట్టం, రాయటం, ఈ రెండూ నాకుచేతకాని విద్యలు. అలాంటిది సుశీల గారి గురించి వ్రాయటమంటే మాటలా? ఇంకో వైపు ఈ అవకాశం వదులుకోకూడదనే పట్టుదల కూడా వుందనుకోండి. నామనసుకి తోచినదంతా కాగితంపై పెట్టాను. ఈ రకంగా నాకు ఆవిడ ఎంత స్ఫూర్తినిచ్చారో, ఆవిడంటే నాకెంత అభిమానమో తెలిపే అవకాశం కలిగింది. అందుకు హాసానికి నా కృతజ్ఞతలు. అన్నయ్య ఎప్పుడూ సుశీలగారిని, 'తెల్లకోకిల' అనేవాడు. నిజమే... కోకిలలు ఎన్నోవుంటాయి. కానీ 'తెల్ల కోకిల' అరుదు కదా? ఒక్క మా సుశీల ఆంటీ తప్ప. మా ఆంటీ మరిన్ని ఉన్నత పురస్కారాలు అందుకోవాలని కోరుకుంటూ...

సదా ఆవిడ ఆశీస్సులను ఆశించే... - **ఎస్.పి.శైలజ**



# సుశీల హిట్స్

### చిత్రం: ఈనాటి బంధం ఏనాటిదో(1977)

రచన : దేవులపల్లి    సంగీతం : యస్. రాజేశ్వరరావు

ఎవరు నేర్పేరమ్మ ఈ కొమ్మకూ
పూలిమ్మనీ రెమ్మరెమ్మకూ
ఎంత తొందరలే హరి పూజకూ
ప్రొద్దు పొడవక ముందె పూలిమ్మనీ ॥ఎవరు॥
కొలువైతివా దేవి నా కోసమూ...
కొలువైతివా దేవి నా కోసమూ... తులసీ...
తులసీ దయా పూర్ణ కలశీ
మల్లెలివి నా తల్లి వరలక్ష్మికీ
మొల్లలివి నన్నేలు నా స్వామికీ ॥ఎవరు॥
ఏ లీల సేవింతు ఏమనుచు కీర్తింతు
సీత మనసే నీకు సింహాసనం
ఒక పువ్వు పాదాల
ఒక దివ్వెనీ మ్రోల
ఒదిగి నీ ఎదుట ఇదె వందనం ఇదె వందనం

### చిత్రం: బండరాముడు(1959)

రచన : ఆత్రేయ    సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి

సాగిపోయే ఓ చందమామా...ఆగుమా...
ఒకసారి ఆగుమా...ఓ చందమామా
మనసార నా మాట ఆలించి పొమ్మా ॥ఒకసారి॥
నీలి మబ్బుల తెరచాటు మాటున
మాటి మాటికి యిటు దాగనేల..... ॥నీలి॥
ఎందుకో చనలేవు సూటిగ ॥2॥
ఎదలోన నీవైన యోచించుకొమ్మా ॥ఒకసారి॥
పరుల సొమ్మును హరియించు వాడె
పగటి పూటను యిలు వీడలేడోయ్ ॥పరుల॥
మంచిగా మనపోయి జాబిలి ॥2॥
మలినమ్ము యికనైన తొలగించుకొమ్మా॥ఒకసారి॥
మారేనా నీ మనసు ఓ చందమామా
మారేనా నీ మనసు ఓ చందమామా
మారేనా నీ మనసు ఓ చందమామా

### చిత్రం: శ్రీకృష్ణ తులాభారం (1966)

సంగీతం : పెండ్యాల

మీర జాలగలడా..
మీర జాలగలడా నా యానతి
వ్రత విధాన మహిమన్ సత్యాపతి ॥మీర॥
నటన సూత్రధారి మురారి
ఎటుల దాటగలడో నా యానతి
వ్రత విధాన మహిమన్ సత్యాపతి (2) ॥మీర॥
సుధా ప్రణయ జలధిన్ వైదర్భికి
ఈడ తావుగలదే నాతోనిక
వాదులాడ గలడా సత్యాపతి (2) ॥మీర॥
మధుర మధుర మురళీగాన రసాస్వాదనమున....ఆ..
మధుర మధుర మురళీగాన రసాస్వాదనమున
అధర సుధారస మదినే గ్రోలగ (2) ॥మీర॥

### చిత్రం: భూకైలాస్(1958)

రచన :సముద్రాల(సీనియర్)    సంగీతం : సుదర్శనం-గోవర్ధనం

సుందరాంగా అందుకోరా
సౌందర్య మాధుర్య మందారము
అందలేని పొందలేని
ఆనందలోకాలు చూపింతురా॥ఆనంద॥ ॥సుందరాంగా॥
కేలుకేలుగొని మేనులేకముగ
ఏకాంతసీమలలో
మది సంతాపమారగ సంతోషమూరగ
చెంత చేరరార ॥కేలు॥ ॥సుందరాంగా॥
యోగము చేదు విరాగము చేదు
అనురాగమె మధురమ్
చాలు సాధన విడపోయి వేదన
సంతోషాబ్ధికి పోదము ॥యోగము॥
అటరంగారు బంగారు మీనాలమై
చవులూరించుచు తేనె జూరాడుదాం ॥అట॥
తేలాడుదాం ఓలాడుదాం ముదమార
తమితీర ఈదాడుదాం ॥తేల॥ ॥సుందరాంగా॥

### చిత్రం:ఆరాధన(1962)

రచన : నార్ల చిరంజీవి    సంగీతం : యస్. రాజేశ్వరరావు

నీ చెలిమి నేడె కోరితిని,ఈ క్షణమే ఆశ వీడితిని॥నీ చెలిమి॥
పూవువలె ప్రేమ దాచితిని పూజకు నే నోచనైతిని ॥నీ చెలిమి॥
మనసు తెలిసిన మన్నింతువని
తీయని ఊహల తేలితి నేనే ॥మనసు॥
పరుల సొమ్మై పోయినావని నలిగె నా మనసే॥నీచెలిమి॥
చెదరి పోయిన హృదయములోన
పదిల పరచిన మమతలు నీకే ॥చెదరి॥
భారమైనా దూరమైనా బ్రతుకు నీ కొరకే ॥నీ చెలిమి॥

### చిత్రం: కర్ణ

రచన : సి.నారాయణరెడ్డి    సంగీతం : విశ్వనాధం-రామ్మూర్తి

గాలికి కులమేది ॥2॥
ఏదీ నేలకు కులమేది
గాలికి కులమేది
మింటికి మరుగేది ఏది ॥2॥
కాంతికి నెలవేది ॥గాలికి॥
పాలకు ఒకటే...
పాలకు ఒకటే తెలివర్ణం
ఏది ప్రతిభకు కలదా స్థలబేధం
వీరుల కెందుకు కులబేధం
అది మనసుల చీల్చెడు మతబేధం ॥గాలికి॥
జగమున యశమే.....
జగమున యశమే మిగులునులే
అది యుగములకైనా చెదరదులే
దైవం నీలో నిలుచునులే
ధర్మం నీతో నడుచునులే
ధర్మం నీతో నడుచునులే ॥గాలికి॥

మార్చి 10 ఆర్.పి.పట్నాయక్ పుట్టినరోజుని పురస్కరించుకుని.....



# ఆర్.పి.పట్నాయక్ హిట్స్

## చిత్రం : నువ్వు-నేను

రచన : కులశేఖర్ గానం : ఎస్.పి.చరణ్, ఉష

అ : ప్రియతమా ఓ ప్రియతమా
ఈ మౌనరాగాలనే పలికే హృదయం ॥ప్రియ॥
నిన్ను చూడాలని ఓ మాట చెప్పాలని
కలవరిస్తోందని తెలుసా ॥ఓహో ప్రియ॥
అ : ఎప్పుడో అపుడెప్పుడో ముడిపడినదీ బంధమేదో
ఆ : ఇప్పుడే ఇపుడిప్పుడే నీ మనసు చెప్పింది నాతో
అ : వానవిల్లు ఏదో మెరిసిందలా
ఆ : పూలజల్లు నాపై కురిసిందిలా
అ : రాగమో అనురాగమో
ఈ వింత మాయ నేమంటారో ఆ: ॥ప్రియతమా॥
ఆ : గుట్టుగా కనిపెట్టగా మనసంత నీ సంతకాలే
అ : మత్తుగా గమ్మత్తుగా ఎదనిండ నీ జ్ఞాపకాలే
ఆ : నిన్ను చూడకుండా మనసుండదే
అ : నిన్ను చూసినాక కునుకుండదే
ఆ : మోహమో వ్యామోహమో
ఈ వింత మాయనేమంటారో అ/ఆ: ॥ప్రియతమా॥
అ : నిన్ను చేరిందనీ తన మనసు విప్పిందని
ఐలవ్ యూ అంటోందని తెలుసా ॥నిన్ను॥

## చిత్రం : మనసంతా నువ్వే

రచన : సిరివెన్నెల గానం: చిత్ర

ఆ : కిటకిటతలుపులు తెరిచిన కనులకు సూర్యోదయం
అటు ఇటు తిరుగుతు అలసిన మనసుకు చంద్రోదయం
రెండూ కలిసి ఒకసారే ఎదురయ్యే వరమా
ప్రేమా ప్రేమా ప్రేమా ప్రేమా ॥కిట॥
ఆ : నిన్నలా చేరేదాక ఎన్నడూ నిదురేరాక
కమ్మనీ కలలో అయినా నిను చూడలేదే
నువ్విలా కనిపించాక జన్మలో ఎప్పుడూ ఇంక
రెప్ప పాటైనా లేక చూడాలనుందే
నా కోసమా అన్వేషణ నీడల్లె వెంట వుండగా
కాసేపిలా కవ్వించనా నీమధుర స్వప్నమై ఇలా
ప్రేమా ప్రేమా ప్రేమా ప్రేమా ॥కిట॥
ఆ : కంటతడి నాడూ నేడూ చెంప తడిమిందే చూడు
చెమ్మలో ఏదో తేడా కనిపించలేదా
చేదు ఎడబాటే తీరి తీపి చిరునవ్వే చేరి
అమృతం అయిపోలేదా ఆవేదనంతా
ఇన్నాళ్ళుగా నీ జ్ఞాపకం నడిపింది నన్ను జంటగా
ఈనాడిలా నీ పరిచయం అడిగింది కాస్త కొంటెగా
ప్రేమా ప్రేమా ప్రేమా ప్రేమా ॥కిట॥

## చిత్రం: చిత్రం

రచన : కులశేఖర్ గానం: నీహాల్, ఉష

ఆ : ఊహల పల్లకీలో ఊరేగించనా
ఆశల వెల్లువై రాగం పలికించనా ॥ఊహ॥
కలహంసై కబురులందించనా
రాచిలకై కిలకిల నవ్వనా
నా పెదవుల మధువులే సైయ్యాటలోనా ॥ఊహ॥
అ : ప్రేమలో తీపి చూసే వయసే నీదిరా
బ్రతుకులో చేదు అన్న భయమే వద్దురా
సుడిగుండం కాదురా సుమగంధం ప్రేమరా
పెనుగండం కాదురా అనుబంధం ప్రేమరా
సిరి తాను గానే వచ్చి నిన్ను చేరునురా
అ : ఊహల పల్లకీలో ఊరేగించనా
ఆశల వెల్లువై రాగం పలికించనా
మేఘాలకు నిచ్చెనే వేయనా
ఆకాశపుటంచులే పంచనా
ఆ జాబిలి క్రిందకే దించనా నా కన్నెకూన ఆ: ॥ఊహ॥
ఆ : ఆశగా పల్లవించే పాటే నీవులే
జీవితం తోడులేని మూడేంకాదులే
కలిసుండే వేళలో కలతంటూరాదులే
అమవాసై పోదులే అడియాశేం కాదులే
చిరు దివ్వెకాంతులింక దారి చూపునులే ॥ఊహ॥

## చిత్రం: నువ్వు-నేను

రచన : కులశేఖర్ గానం : ఆర్పీకోరస్

అ : గాజువాక పిల్లా మేం గాజులోళ్ళంకాదా ॥3॥
నీ చెయ్యి చాపలేదా ॥2॥
మా గాజు తొడగలేదా
గాజువాకే పిల్లామాది గాజులోళ్ళమే పిల్లా మేము ॥2॥
అ : సబ్బవరం పిల్లా మేం సబ్బులోళ్ళంకాదా ॥2॥
సబ్బవరం పిల్లా మేం సబ్బులోళ్ళం కాదా నీ వీపు చూపలేదా
నీ వీపు చూపలేదా మా సబ్బురుద్దలేదా
సబ్బవరమే పిల్లా మాది సబ్బులోళ్ళమే పిల్లా మేము ॥2॥
అ : సిరిపురం పిల్లా మేం సీరలోళ్ళంకాదా ॥3॥
నీ సీరవిప్పలేదా ॥2॥
మా సీరసుట్టలేదా
సిరీపురమే పిల్లా మాది సీరలోళ్ళమే పిల్లా మేము ॥2॥
అ : మువ్వలపాలెం పిల్లా మేం మువ్వలోళ్ళంకాదా ॥3॥
నీ కాలు చాపలేదా ॥2॥
మా మువ్వ కట్టలేదా
మువ్వల పాలెమే పిల్లా మాది మువ్వలోళ్ళమే పిల్లా మేము ॥2॥

## చిత్రం : నీకోసం

రచన : సాహితి గానం: రాజేష్, కౌసల్య/ఆర్.పి., కౌసల్య

అ : నీకోసం నీకోసం నీకోసం నీకోసం
ఎప్పుడూ లేని ఆలోచనలు ఇప్పుడే కలిగెను ఎందుకు నాలో
నీకోసం నీకోసం
ఈ లోకమిలా ఏదో కలలా
నా కంతా కొత్త వింతగా కనిపిస్తూవుంది ॥నీకోసం॥
అ : నాలో ఇది ఏరోజూ లేనిది ఏదో అలజడి నీతోనే మొదలిది
నువ్వే నాకని గుర్తుంటావని ఒంటిగా
నీ జంటకే వున్నాను నేనిన్నాళ్ళుగా ॥నీకోసం॥
అ : నాలో ప్రేమకి ఒక వింతే ప్రతి ఇది
వీణే పలుకనీ స్వరమే నీ గొంతుది
మెరిసే నవ్వదీ మోనాలీసదీ
ఈ నిజం ఇక కాదనే ఏమాటనూ నే నమ్మను
ఎప్పుడూ లేని ఆలోచనలు ఇప్పుడే కలిగెను
ఎందుకు నాలో నీకోసం నీకోసం
ఈ లోకమిలా ఏదో కలలా
నా కంతా కొత్త వింతగా కనిపిస్తూవుంది ॥నీకోసం॥

సప్త స్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

**త**న ఉర్దూ ఉచ్చారణకి, తొలిరోజులలో సహకరించిన మహామహులు నౌషాద్, గులాం హైదర్, సజ్జాద్, ఖేం చంద్‌ప్రకాశ్ ప్రభృతులని లత వారికి కృతజ్ఞత తెలియజేస్తూ వుంటారు.

ఆమె పాడిన ఫిల్మీఘంజల్స్‌లో అతి ముఖ్యమైనవి

1. హమారే బాద్ అబ్ మెహఫిల్‌మే అఫ్‌సానే బయా హోంగే అనే మజరూహ్ సుల్తాన్‌పురి రాసినది, 'బాగీ' సినిమా, మదన్ మోహన్ సంగీతం

2. హై ఇసీమే ప్యార్ కీ ఆబ్‌రూ వో జఫా కరే మై వఫా కరూ / రాజా మెహందీ ఆలీ ఖాన్ / అన్‌పఢ్ / మదన్ మోహన్

3. న మిల్‌తా గమ్‌తో / శకీల్ బదాయూనీ / అమర్ / నౌషాద్

4. ఆప్‌కీ నజరోంనే సంఝా / రాజా మెహందీ ఆలీ ఖాన్ / అన్‌పఢ్ / మదన్‌మోహన్

5. జుల్మే ఉల్ఫత్ హై హమే లోగ్ సజా దేతే హై / సాహిర్ లుధియాన్వీ / తాజ్‌మహల్ / రోషన్

6. ఖుదా-ఏ-బర్‌తర్ జమీపర్ / సాహిర్ / తాజ్‌మహల్ / రోషన్

7. కభీ ఐ హకీకతే మంత్‌జార్ / ఇక్బాల్ / దుల్‌హన్ ఇక్ రాత్‌కీ / మదన్‌మోహన్

ఇవేకాదు, జగజీత్‌సింగ్.. ప్రవేట్ సాంగ్ గా రికార్డుచేయించిన ఆల్బమ్ "సజ్‌దా" చాలా విజయవంతంగాసాగింది. ఇన్ని సాధనలు సాధించిన ఒక సందర్భాన లతాకి రావాలసిన భారతరత్న బిరుదును పండిట్ రవిశంకర్‌కి లభించడాన్ని విమర్శించిన తన అభిమానికామె ఇచ్చిన వివరణ "మీ దృష్టిలో నేను చాలా గొప్ప కళాకారిణినే కావచ్చు అందుచేత మీరావిధంగా విమర్శించారు. కాని నా దృష్టిలో రవిశంకర్ మరీ గొప్ప కళాకారులు. ఆయన ఔన్నత్యాన్ని అందుకోవడానికి, ఆశించడానికి కూడా నాకు అర్హత లేదు" అని అన్నారట. నిరహంకార భావానికి ఇది నిదర్శనం. ఆమె అన్న ఈ మాటలు చాలు. అంతేకాక, "మనదేశ ప్రజలు నాకు ప్రేమాభిమానాల నిధులు అందజేశారు. మన

**1923**లో బల్వంత్ సంగీత్ మండలీ తరఫున 'రాజ్ సన్యాస్' నాటక ప్రదర్శనకై ఇండోర్ వెళ్లారు మాస్టర్ దీనానాథ్. దీనానాథ్ గురించి విన్న ఇండోర్ రాజు తుకోజీరావు హోల్కర్ పున్నమినాడు తన దర్బార్‌లో సంగీతకచ్చేరీ చేయవలసినదిగా ఆహ్వానం పంపాడు. సరేనన్నాడు దీనానాథ్.

పున్నమిన సంగీతబృందమంతా అక్కడకు చేరేసరికి రాజుగారు లేరు. వెన్నెలకదా, జంతువులను వేటాడుదామనిపించింది ఆ మహానుభావుడికి. వేటకు వెళుతూ ఆ సంగీతం వాళ్లను రేపు రమ్మనమను అని కబురుపంపాడు తన అసిస్టెంటు చేత.

దీనానాథ్ ఏమీ అనలేదు. మర్నాడు కచ్చేరీ చేయలేదంతే! ఆ రాజరికపు రోజుల్లో రాజాజ్ఞ ధిక్కరించడమంటే మృత్యువును ఆహ్వానించినట్లే. కనీసం తన సంస్థకు దక్కే విరాళాలు ఆగిపోతాయన్న భయమైనా ఉండాలి. కానీ దీనానాథ్ జంకలేదు.

ఆరు దశాబ్దాల తర్వాత -

దీనానాథ్ కుమార్తె లతామంగేష్కర్ దుబాయిలో ఒక ప్రదర్శన ఇచ్చింది. బ్రహ్మాండంగా ఆదరణ లభించింది. మర్నాటి ఉదయమే దుబాయిలోని ఒక గౌరవనీయుడు, అత్యంత ధనికుడు అయిన పెద్దమనిషి నుండి కబురు - 'మా ఇంట్లో మాకై ప్రత్యేకంగా 'మెహఫిల్' జరపాలి. పారితోషికం ఎంతైనా సరే, ఫర్వాలేదు.' అని. 'పబ్లిక్ షోలే తప్ప ప్రైవేటు షోలలో పాల్గొనను కదా' అని జవాబిచ్చింది లతా.

మర్నాడు మళ్లీ ప్రతిపాదన వచ్చింది.'ప్రైవేటు షో అంటే డాన్సు గట్రా ఉంటుందనుకుంటారేమో, అదేం కాదు, దుబాయిలో ఉన్న మర్యాదస్తుల కుటుంబాలను చెందిన స్త్రీలు వచ్చి వినడానికి వీలుగా ఏర్పాటు చేద్దామని ఉద్దేశ్యం. సరేనంటే పదిలక్షల డాలర్ల పారితోషికం మీది! ఇది మిమ్మల్ని గౌరవించడానికి ఏర్పాటు చేసినదే కానీ, తేలికభావంతో ఏర్పాటు చేయలేదు.' అని.

"కళాకారులు షోలకు హాజరయేది కళాభిమానుల ఆశీస్సులు పొందడానికే! నేను మీ ఆహ్వానాన్ని మన్నిస్తే, మర్యాదస్తులు ప్రైవేట్ షోలకు వెళతారనీ, పబ్లిక్‌షోకి హాజరయిన స్త్రీలు అంత గౌరవనీయులు కారన్న అభిప్రాయం జనాలకు కలుగుతుంది. అది నాకు ఇష్టం లేదు." అని జవాబిచ్చింది లతా. ఆమె అవగాహనకు జోహార్లర్పించి వాళ్లు వెళ్లిపోయారు.

తండ్రి వారసత్వం పుణికిపుచ్చుకోవడం అంటే ఇదే కాబోసు!

**- ఎమ్బీయస్ ప్రసాద్**

54వ సంచికలో సిల్వర్‌జూబిలీ సందర్భంగా లతా ఎంపిక చేసిన పాటలు చూశారు. తన 75వ యేట, అంటే 61 యేళ్ల కెరియర్ పూర్తి చేశాక 2003లో తన ఫేవరెట్స్ గురించి అడిగితే లతా చెప్పిన లిస్టు చూడండి. వ్యక్తిగత దృష్టి పక్కకుబెట్టి నిష్పక్షపాతంగా తన కెరియర్‌ను అంచనా వేసినట్టనిపిస్తుంది. అందుకే సి.రామచంద్ర, శంకర్‌జైకిషన్ ('వారి సంగీతంలో నేను పాడిన 70 శాతం పాటలు నాకిష్టమైనవే') వసంత్‌దేశాయి వంటి పేర్లు - అనిల్‌బిశ్వాస్ తప్ప - కనబడుతున్నాయి. చాలా పాటల ఎంపికతో అభిమానులు అంగీకరించకపోవచ్చు. బర్మన్ విషయంలో అయితే తమకు సయోధ్య కుదిర్చిన పాటను ఎంచుకోవడం తమాషాగా ఉంది.

**శ్యామ్‌సుందర్** - సాజన్ కీ గలియా ఛోడ్ చలే (బాజార్), సున్‌లో సాజన్ దిల్ కీ బాత్ (లాహోర్)

**సజ్జాద్ హుసేన్** - ఆజ్ మేరే నశీబ్ నే ముఝే రులా రులా దియా (హల్‌చల్), ఐ దిల్‌రుబా ( రుస్తుమ్ సొహ్రాబ్)

**గులాం మహమ్మద్** - పాకీజాలో అన్నిపాటలు

**సి.రామచంద్ర** - మొహబ్బత్ ఐసీ ధడ్‌కన్ హై (అనార్కలి)

**నౌషాద్** - జానేవాలే సే ములాకాత్ (అమర్)

**ఖయ్యాం** - బహారోం మేరా జీవన్‌భీ సవారో (ఆఖ్రీఖత్), ఐ దిలే నాదాన్ (రజియా సుల్తానా)

**హేమంత్‌కుమార్** - కహీదీప్ జలే కహీ దిల్ (బీస్ సాల్ బాద్), ఓ బేకరార్ దిల్ (కొహరా), కుఛ్ దిల్‌నే కహా (అనుపమా)

**రోషన్** - పావ్ ఛూలేనే దో (తాజ్‌మహల్), చిత్రలేఖాలో అన్ని పాటలూ

**శంకర్-జైకిషన్** - యేం శామ్‌కీ తన్‌హాయియా (అహ్), అజీబ్ దాస్తాన్ హై (దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయీ) అజీ రూఠ్‌కర్ (ఆర్‌జూ)

**సలిల్ చౌధురీ** - ఓ సజ్‌నా బర్‌ఖా బహార్ (పరఖ్), రాతోం కే సాయే ఘనే (అన్నదాతా)

**ఎస్.డి.బర్మన్** - జోగీ జబ్‌సే తూ ఆయా మేరే ద్వారే (బందినీ)

**మదన్‌మోహన్** - అనేక పాటలు, ఉదా.కి వో చుప్ రహే తో మేరే దిల్ కీ దాగ్ జల్తే హై (జహా ఆరా)

**చిత్రగుప్త** - దిల్ కా దియా జలాకే గయా (ఆకాశ్‌దీప్)

**వసంత్ దేశాయి** - ఘన్‌శ్యామ్ సుందరా (మరాఠీ)

**రవిశంకర్** - అనురాధాలో అన్ని పాటలూ

**కళ్యాణ్‌జీ ఆనంద్‌జీ** - అకేలే హై చలే ఆవో (రాజ్) చందన్ సా బదన్ (సరస్వతీ చంద్ర)

**లక్ష్మీ, ప్యారే** - వోహై జరా ఖఫా ఖఫా (షాగిర్ట్), చలో సజ్‌నా జహా తక్ ఘటా చలే (మేరే హమ్‌దమ్ మేరే దోస్త్), ఇంతకామ్‌లో అన్ని పాటలూ

**ఆర్.డి.బర్మన్** - నా జా మేరే హమ్‌దమ్ (ప్యార్ కా మౌసమ్), బాహోం మే చలే ఆవో (అనామికా)

**రవీంద్రజైన్** - రామ్ తేరీ గంగా మైలీ, హెన్నాలలో పాటలు

**హృదయనాథ్ మంగేష్కర్** - లేకిన్‌లో పాటలు

**విశాల్ భరద్వాజ్** - పానీ పానీ రే (మాచిస్)

**అనూ మాలిక్** - సందేసే ఆతే హై (బోర్డర్)

**ఏ.ఆర్.రెహమాన్** - జియా జలే (దిల్ సే)

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

దేశానికే సదా సేవ చేస్తూ వుండాలనేదే నా అభిలాష. నా ఉద్దేశంలో నేనేమీ అసాధారణ గాయని కాను'' అని మరో సందర్భంలో వివరించారామె.

తనకి భారతరత్న బిరుదు వచ్చినపుడు "మా తండ్రి గారి జయంతి జరిగిన కొన్ని రోజులలో ఈ బిరుదు రావడం, ఆయన ఆశీర్వాదాల వలననే అని భావిస్తున్నాను. ఆయన వుండి వుంటే నాకు దక్కిన ఈ అమోఘ గౌరవానికి చాలా సంతోషించి వుందురు'' అని కంటతడి పెట్టుకున్నారట. "ఎలా పాడాలో నేర్పిన నా ప్రథమ గురువు, నా తండ్రిగారే కదా'' అని అన్నారట "అయినా నా విజయాన్ని చూసి మా తల్లిగారు ఆనందించడం నాకు మహానందం'' అని చెప్పారట.

"భారతదేశం నాకు భారతరత్న బిరుదు ఇవ్వడం వలన నాకు అధిక సంతోషం. నిజానికి భారతదేశం అభిమానంతో నాకు ఒక 'సుమం' (పువ్వు) బహుకరించినా, అది నాకు భారతరత్నతో సమానమైన కానుక అని అనిపిస్తుంది'' అన్న లత మాటలు వింటే ఆమెలో అంతర్గతంగా ప్రవహిస్తూ వుండే భారతీయత విశదంగా వ్యక్తమౌతుంది.

భారతీయతతో పాటు లతలో మహారాష్ట్రీయత కూడా పొంగిపొర్లుతూ వుంటుంది. అస్సామీస్ సంగీత కళాకారుడైన భూపెన్ హజారికా ఒక లివింగ్ లెజెండ్. ఆయన అంటారుట మనకి సరస్వతి ఒకర్తే కాదు, ఇద్దరు సరస్వతులు. లతా, ఆశాలు. అని - వారిద్దరూఅంటే హజారికాకి అభిమానంతో పాటు అమిత గౌరవం. అలాగే ఆయన అంటే లతా, ఆశా ఇద్దరికీ అభిమాన గౌరవాలు. తమాషా ఏమిటంటే ఆశా పుట్టిన రోజూ, హజారికా పుట్టిన రోజూ ఒకే రోజున. అది సెప్టెంబర్ 8. ఒకసారి, ఆశా, తన పుట్టిన రోజున ఆయన్నీ తన అక్క లతనీ తన ఇంటికి ఆహ్వానించి, విందు ఇచ్చారు. అప్పుడు వారు ముగ్గురు గతంలో తమ మైత్రిని గుర్తు తెచ్చుకుని చాలాసేపు ముచ్చటించుకున్నారు.

హజారికా రాసిన ఒక అస్సామీస్ గీతం లత పాడారు. హజారికా సంగీత దర్శకత్వంలో విభిన్న భాషల్లో పాడారు లతా, ఆశాలు. కాని ఆశాయే ఎక్కువ గీతాలు పాడారు. "నేను ఇన్ని పాటలు భూపెన్‌కి పాడినా ఆయనకి మాత్రం "అక్క" గానం అంటేనే ఎక్కువ అభిమానం అని చెప్పుతారు ఆయనని. నా వుద్దేశ్యంలో కళాకారులందరూ వారివారి స్థాయిలో గొప్పవారే - వారి వారి వ్యక్తిత్వం కలవారే. కాని ఒకరితో ఒకర్ని పోల్చడం, ఒకరికన్న మరొకరు గొప్పవారని నిర్ణయించుకోవడం మానవ స్వభావపు దౌర్బల్యం. లతా అభిమానులందఱికీ లతాయే అందరికన్నా గొప్ప కళాకారిణి. ఆశా అభిమానులందఱికీ, ఆశాయే గొప్ప కళాకారిణి. ఈ ప్రత్యేకాభిమానం అనే విషయం కళా రసజ్ఞతకి చెందినది. కాని, సంగీత ప్రేమికులు లతాని అభిమానించే వారి సంఖ్య చాలా ఎక్కువ అని ఒప్పుకోక తప్పదు.

"నా ఆరోగ్యం నన్ను పాడనిచ్చే వఱకూ, నేను పాడుతూనే వుంటాను. గానమే నా జీవనం అదేకాక సాంఘికసేవ చెయ్యడం కూడా నా జీవితంలో మఱో ఘట్టం. అందుకే మా తండ్రిగారి మధురస్మృతికై ప్రజల కోసం ఒక ఆస్పత్రి కట్టించేందుకు పూనుకున్నాను. ఇంతకీ ఆ ఐడియా మా తమ్ముడిదే. ఒక మంచి పని తన వలన జరిగినా, తను చాటుననే ఉండి ఇతరులకి ప్రాధాన్యం పంచడం అతనిలోని ప్రత్యేక విశేషం. చాలా అరుదైన సుగుణం'' అంటారామె.

ఆమె ప్రత్యేక ప్రశంసకి అర్హులైన అదృష్టవంతులలో నేటి సంగీత ఝంఝూ మారుతం (ఇశైప్పుయల్) అనబడే సంగీత దర్శకులు ఏ.ఆర్.రహమాన్. ఆమెకి నేటి చిత్ర సంగీతంలో రహమాన్ అందించిన 'లగాన్' చిత్ర సంగీతం ఎక్కువగా నచ్చడం సహజం. ఇళయరాజా సంగీతానికి లత మంచి ముఖ్యత్వం ఇస్తారు. ఆయనకై తెలుగు, తమిళంలోనే కాక హిందీ చిత్రంలో కూడా రాజ్‌కుమార్ సంతోషి దర్శకత్వంలో "కౌన్ డగర్, కౌన్ నగర్" అనే పాట తను లండన్ ఫ్లైట్ అందుకునే ముందు సాయంత్రం ఏడుగంటల వఱకూ పాడుతూనే వున్నారట.

బిస్మిల్లాఖాన్ పలికించే శహనాయి (సన్నాయి), మంగళ వాద్యంగా పేరు పొందింది. లతా ''గళం'' కూడా నిస్సందేహంగా మంగళగాత్రం! ఈ విషయం ఎందరో వ్యక్తుల జీవితాల్లో ఋజువైంది. మంగళవాద్య వాదకులైన బిస్మిల్లాకీ, "మంగళ గళనాద గాయకురాలైన లతాకీ, భారత ప్రభుత్వం, ఒకే సంవత్సరంలో ఉత్తమోత్తమ బిరుదైన ''భారతరత్న'' అందించడం అందరికీ ముదావహం! సమంజసం! ఔచిత్య సమాయుక్తం. ఆయనతో పాటే తనకి కూడా ఆ టైటిలు లభించడం 'లతా' తన ప్రత్యేకమైన అదృష్టంగా భావిస్తారు.

జీవితంలో అనేక సంభావాలు యాదృచ్ఛికంగా జరుగుతూ వుండడానికి మఱో

# లతాకు పేరు తెచ్చిన కొన్ని పాటల ఉదంతాలు

## ఎక్కిళ్ల పాట

సి.రామచంద్ర సంగీతదర్శకత్వంలో వచ్చిన ఫిల్మిస్తాన్ వారి 'అనార్కలి'(1953)లో పాటలన్నీ లతాకు మంచిపేరు తెచ్చాయి. 'జమానా యే సమ్‌ఝా కీ హమ్ పీకే ఆయే..' అనే పాట వాటిలో ఒకటి. ఆ పాటలో ఎక్కిళ్లు కూడా ఉంటాయి. తాగివచ్చిన వాళ్లు ఎక్కిళ్లు పెడుతూ పాడడం సహజంగా ఉంటుందని భావించాడు .రామచంద్ర. పాట తృప్తికరంగా వచ్చిందని భావించి మరాఠీ సినిమాకి పనిచేయడానికి కొల్హాపూర్ వెళ్లాడు. అతనలా వెళ్లగానే ఫిల్మిస్తాన్ చీఫ్ ఎస్.ముఖర్జీ ఆ పాట వినడం సంభవించింది. ఈ ఎక్కిళ్లూ అవీ చాలా చీప్‌గా ఉంది అనిపించిందతనికి. పైగా స్టూడియోవాళ్లు చెప్పారు - రామచంద్ర ఆ ట్యూన్ నిమిషాలమీద కట్టేశాడని. వెంటనే కొల్హాపూర్‌కి రామచంద్ర పేర ఓ లీగల్ నోటీస్ వెళ్లింది - ఓ చీప్‌సాంగ్ రికార్డు చేయడానికై కంపెనీ డబ్బు వేస్టు చేసినందుకు 75,000 రూ.లు కట్టమని!

అనలు అనార్కలి సినిమాతో రామచంద్రకు ముందునుండి పేచీయే! ఆ సినిమాకు రామచంద్రను నియమిస్తూ ముఖర్జీ 'పాటలన్నీ గీతాదత్ చేత పాడించు' అని చెప్పాడు. 'ఎవరిచేత పాడించాలో చూసుకోవాల్సింది నేను, నువ్వు కాదు' అని రామచంద్ర అనడంతో అతన్ని తీసేసి హేమంత్‌కుమార్‌ను పెట్టారు. రెండుపాటలు రికార్డయ్యాక ('జిందగీ ప్యార్ కీ దో చార్ ఘడీ హోతీ హై' వాటిలో ఒకటి) హేమంత్‌కుమార్ కూడా గుడ్‌బై చెప్పాడు. ఖేమ్‌చంద్‌ప్రకాష్ సోదరుడు బసంత్ ప్రకాష్‌ను సంగీతదర్శకుడుగా పెట్టారు. అతను గీతాదత్‌చేత ఒకపాట పాడించాడు కానీ అది నచ్చలేదే ఏమో ఫిలింస్తాన్ వారు మళ్లీ రామచంద్రనే పిలిచారు. 'అన్ని పాటలు లతాచే పాడించడానికి ఒప్పుకుంటేనే...' అనే షరతు పెట్టి రామచంద్ర తిరిగివచ్చాడు.

ఈ నోటీసు అందుకున్నాక రామచంద్రకు మరింత ఒళ్లు మండింది. కానీ 'సరేలే, కాస్త క్లాసీగా ఉండే పాట చేస్తాను' అని ఒప్పుకున్నాడు. కానీ చూడబోతే సినిమా పూర్తి కావచ్చింది, హీరోయిన్ బీనారాయ్ ఫారిన్‌టూర్ వెళ్లబోతోంది. డైరక్టరు పాట పిక్చరైజ్ చేసేశాడు కూడా. నిర్మాత ముఖర్జీ నుదురుకొట్టుకుని 'సరే, కానీలే..,' అన్నాడు. సినిమా రిలీజయినరోజు పాటలో ఎక్కిళ్లు విని ప్రేక్షకులు కాస్త ఖంగారుపడ్డారు. కా స్సే పు                పో యా క అలవాటు పడ్డారు. భలే, భలే అని అన్నారు చివరకి. మాస్ మెచ్చారు. పాట గొప్పగా ఉందనేశారు.

## ఖయ్‌మని అందుకునే పాట

'చోరీచోరీ'లోని 'రసిక్ బల్‌మా..' పాట (తెలుగులో ఈ ట్యూన్‌తో 'దేవుడున్నాడా' పాట తయారయ్యింది) ఎత్తుకోవడం ఎత్తుకోవడమే హైపిచ్‌లో ఖయ్‌మని ప్రారంభమవుతుంది. రికార్డింగు రోజునే లతా జైకిషన్ (అతనేగా ట్యూన్ చేసినది) ఈ ముక్క అంది కూడా! 'ఈ పాట బాగుందని పేరు వస్తుంది కానీ ఎవడూ హమ్ చేయడానికి కూడా వీలులేకుండా తయారవుతుంది' అని. 'అలాగే ఉండనీ' అని పట్టుబట్టాడు జైకిషన్.

1956లో ప్రఖ్యాత దర్శకనిర్మాత మెహబూబ్‌ఖాన్ అమెరికాలోని లాస్ ఏంజిలిస్‌లో హాస్పటల్‌లో చేరవలసివచ్చింది. బొంబాయినుండి లతా ఫోన్ చేసి ఎలా ఉన్నారని అడిగింది. 'లతా నీ పాట ఒకటి వినాలని మహా ఆశగా ఉంది. ఇక్కడ దొరుకుతుందో లేదో, నాకోసం ఫోన్‌లోనైనా పాడి వినిపించవా?' అని అడిగాడు మెహబూబ్‌ఖాన్. 'అందాజ్' ద్వారా తనకు స్టార్‌సింగర్ స్టేటస్ కలగజేసిన మహానుభావుడి కోరిక కాదనగలదా లత? 'తప్పకుండా పాడతాను. ఏ పాట కావాలి?' అంది.

'చోరీ చోరీ లోని రసిక్ బల్‌మా' అన్నాడు మెహబూబ్‌ఖాన్. అదా? అని ఆశ్చర్యపడుతూనే లతా పాడి వినిపించింది. ఒకరోజే కాదు, వారం రోజుల పాటు ప్రతీ రోజూ ఫోన్ చేసి పాడి వినిపించేది. పాట మహత్యమేమిటో గాని మెహబూబ్‌ఖాన్‌కి అతిత్వరగా స్వస్థత చేకూరింది.



మెహబూబ్‌ఖాన్

## లతా సూచించిన రాగం

అది 'మేరా సాయా' తయారవుతున్న రోజులు. పాట రికార్డింగుకి అన్ని ఏర్పాట్లూ జరిగినా సంగీతదర్శకుడు మదన్‌మోహన్‌కి ట్యూన్ ఏదీ తట్టటం లేదు. లిరిక్ రెడీగా ఉంది. 'తూ జహా జహా చలేగా మేరా సాయా సాథ్ హోగా..'. ఇటుచూడబోతే దర్శకనిర్మాత రాజ్‌ఖోస్లా గురుదత్ శిష్యుడు. మంచి సంగీతరసజ్ఞుడు. ఆషామాషీ వ్యవహారం కాదు.



మదన్‌మోహన్

రిహార్సల్ కొచ్చిన లతా పరిస్థితంతా ఆకళింపు చేసుకుంది. కాస్సేపు లిరిక్ చూసి, 'మదన్ భయ్యా, నంద్ రాగ్‌లో ట్యూన్ చేస్తే..?' అంది. ఒక్కసారి హమ్ చేసుకుని చూసుకుని ఎగిరి గంతేశాడు మదన్‌మోహన్. ఆ పాట ఎంత హిట్ అయిందో వేరే చెప్పనక్కరలేదు.



'ముఘలే ఆజమ్'లో మధుబాల

## పాటలో ప్రతిధ్వని రావాలంటే...

'ప్యార్ కియాతో డర్నా క్యా..' (ముఘలే ఆజమ్) పాటను రికార్డింగు స్టూడియోలో కాకుండా ఫిలిం సెట్‌పైననే రికార్డు చేయడం జరిగింది. రంగమహల్ స్టూడియోలో అక్బరు దర్బార్ సెట్ వేసిన ఫ్లోర్‌పైనే పాట రికార్డింగ్. కానీ ఆ ఫ్లోర్ సౌండ్ ప్రూఫ్ కాదు. సౌండ్ రికార్డిస్టుగా పనిచేసిన రాబిన్ చటర్జీ చుట్టూ దుప్పట్లు కట్టించాడు. పాట పాడమన్నాడు. మైకుల దగ్గరకు వచ్చేసరికి రెండే మైకులున్నాయి. ఒకటి వాద్యబృందానికి. మరోటి సింగర్‌కి. కానీ ఇప్పుడు కోరస్‌కి కూడా మరోటి కావాలి. ఆ కోరస్ కూడా 'ఆ..' అని ఒకరకమైన ప్రతిధ్వనితో పాడాలి. అందువల్ల నౌషాద్ మూడోమైకు కాస్త దూరంగా బాత్‌రూమ్ వద్ద పెట్టించాడు.

రెండో చరణంలో లతా కూడా ప్రతిధ్వనితో పాడాలి. అందువల్ల మొదటిచరణం కాగానే రికార్డింగు జరుగుతూండగా లతా మెత్తగా అడుగులు వేసుకుంటూ బాత్‌రూమ్ వద్దకు వెళ్లి మూడో మైకు వద్దకు వెళ్లి అక్కణ్నుంచి పాడవలసివచ్చేది. పైగా శృతి మారకూడదు. మహా ఇబ్బంది కరమైన పని. అయినా లతా సరేనంది. ఒకసారి కాదు, రెండుసార్లు కాదు. నౌషాద్ వంటి పెర్‌ఫెక్షనిస్టు టేకులు మీద టేకులు తీసుకున్నాడు. కాస్సేపటికి విసుగెత్తి 'ఇది చాల్లే..' అని అన్నారు. అన్నది నౌషాద్, లతా కాదు! 'ఇంకొక్కసారి చేసి చూద్దాం..' అని రిక్వెస్టు చేసి ఓకే చేయించుకుంది లతా!

- ఎమ్మెస్ స్వాతి

నిదర్శనం. లతా కొన్ని ఏళ్ల తరబడి, కొంత మందికి కొంతమందితో పాడకపోవడం.

మనసావాచాకర్మణా లత సాగిస్తున్న దేశసేవ ఆదర్శప్రాయమైనది. ఈ మహిళామణి జీవన చరిత్రాన్ని ముందుగా వ్రాయబూనుకున్న మహామహులలో శ్రీహరీష్ భీమానీ, శ్రీరాజూ భరతన్ వంటి వారు లతా అభిమానులందరికీ కావించిన మహోపకారం ఎన్నటికీ మఱువరానిది. ఇద్దరూ లత ఘనతని బాగా ఎఱిగున్నవారే. ఆత్మీయ పరిచయమున్నవారే. అట్టి మహా రచయితలకి నా వినీత వందనాలు. ఈ రచయితల రచనలు ఎందరెందరికో ఆవశ్యక స్ఫూర్తినిస్తూనే వుంటాయి.

దివ్యమైన స్వరం లతా గళాన్నే అంటిపెట్టుకుని వుండడానికి ఒక ముఖ్య కారణం ఆమె తరచూ చబాయించే (నమిలే) "చూయింగ్ గమ్" అని తెలుసుకున్న వారికి, సంభ్రమం కలిగితే సంభ్రమం లేదు. అంతకన్న ఆశ్చర్యమేమంటే ఆమె తన గళాన్ని తీయనిదిగా మెంటెయిన్ చేసుకోవడం కోసం చేసే వింత ప్రయత్నంగా తఱుచూ ఆమె పచ్చిమిరప కాయల్ని పచ్చిగానే నమలడం.

ఇతరులు రచించిన గీతాల్ని తను పాడేటప్పుడు తన స్వహస్తాలతో ఆమె కంప్లీట్‌గా ఆ పాట ఒక తెల్ల కాగితంపైన రాసుకుని పిదప పాడడం సముచితమే - అదేకాదు "శ్రీ"కారం చుట్టనిదే ఏపాటి కాగితంపైన రాసుకోకపోవడం ఆమె అలవాటు. అలాటివన్నీ మూఢ నమ్మకాలని కొట్టిపారేసే నిర్లక్ష్య భావం ఆమె స్వభావంలోనే లేదు.

చిన్ననాటి నుండీ, సంగీత కుటుంబంలో జనించిన లతకి సహజంగానే శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం అలవడింది. అందుకే చిన్నతనంలోనే శాస్త్రీయ సంగీత కచ్చేరీ సమర్పించారు. అలా అలా శాస్త్రీయ సంగీతానికే అంకితమైపోయి వుండివుంటే, చిత్ర పరిశ్రమ ఒక గొప్ప నేపథ్య గాయకురాలిని కోల్పోయి వుండేది. కాని దైవ నిర్ణయమే లత చిత్ర సంగీత నేపథ్యగాయనిగా సదా వెలుగినుతూ వుండాలనీ సాటిలేని మేటి సంగీత ప్రతీకగా మెఱుస్తూ వుండాలనీ తీర్మానించిన పిదప ఎవరు మార్చగలరు?

లతా స్వర మాధుర్యం, ఎన్నో వేల చిత్ర గీతాలలో జీవం నింపి, ఆమెని అభిమానులందరికీ ఆరాధ్య దేవతగా అందించింది. వివిధ రసాల గీతాల్ని వివిధ రీతులలో ఆమె ఆలపించిన వైనం, గొప్ప గొప్ప సంగీత మేధావులని కూడా చకితులు గావించింది. వజ్నా (సంతులనం), 'మాడ్యులేషన్' (ఇది చెబితే వచ్చేది కాదు, దైవదత్తం) "ఎక్స్‌ప్రెషన్" అనగా ఫీలింగుతో (ఎమోషన్‌తో) పాడడం లాంటి అనితర సాధ్య సాధనలు లతకి దైవదత్త సహజ వరాలుగానే లభించాయి. వాటిని అధ్యయనం చేసి లతా అనుయాయులు చాలామంది, తమ గాన విధానాన్ని ఉత్తమంగా మలచుకున్నారు. ఎక్కడ ఏ గాయని పాడినా, "అచ్చం లతాలాగే పాడావమ్మా" అనే ప్రశంసని అందఱికీ ఆదర్శనీయ ప్రమాణం. ఎల్లభాషల గాయనీమణులూ, తమ అభిమాన గాయనీమణిగా లతా మంగేష్కర్‌నే ఎన్నుకోవడం, లతా పాడే బాణీలో గల ప్రత్యేక వైశిష్ట్యానికి తార్కాణం.

నేను కూడా నా ఏకైక ప్రియ పుత్రికకి సంగీత లత అని పేరుపెట్టుకోవడం లతా మంగేష్కర్ కళానైపుణ్యం పట్ల నాకు గల అభిమానాన్నీ గౌరవాన్నీ సూచిస్తుంది. ఇలా ఎంత మంది ఎన్ని విధాల లతా కళాభిజ్ఞతకి ఋణపడి వున్నారో మఱి!

ఈ కళాకల్పవృక్షం తన అగణిత కళాశాఖా వైదుష్యాన్ని నిరూపిస్తూ, దీర్ఘాయురారోగ్య ఐశ్వర్య సమస్త సన్మంగళాలతో విలసిల్లి, భారతదేశ ప్రఖ్యాతినీ, ప్రజ్ఞా పాటవాన్నీ, అన్ని ఇతర దేశాలకీ చాటి, ఆదర్శప్రాయమైన జీవనాన్ని గడుపుతూ, అందఱికీ స్వరాల వరాలనందిస్తూ, స్పందిస్తూ స్పందింపజేస్తూ, పెద్దల ఆశీస్సులూ, పిన్నల శుభాశయాలూ, రసజ్ఞుల ప్రత్యేక ప్రశంసలూ అందుకుంటూ కలకాలం వెలుగొందుతూ, వెలుగినుతూ, కళా సరస్వతికి నీరాజనాలని అందజేస్తూ, ఆనంద సుధలు గ్రోలుతూ అభిమానులకి కూడా పంచియిస్తూ నిరంతరంగా, అద్భుతంగా, దివ్యంగా, గీత రాగాలాపనలు కావిస్తూ సర్వదిగ్విజయాలు సాధిస్తూ, సంతతం సంతసంగా జీవిస్తూ, దీనులందరికీ జీవనోపాధిని కల్పిస్తూ ధన్యమాన్యం చరిత్రయై, దీనానాథ్ మంగేష్ గారి పుత్రికా స్థాయినీ గౌరవాన్నీ నిలబెట్టుకుంటూ చేతనైనంత వరకు, నూతన గాయనీమణులకు కూడా, ఉపాధ్యాయినిగా సరిదారి చూపిస్తూ సర్వమాన్య మహిళామణియై కళాసేవ సాగిస్తూ వుండాలని అందరం ఆశిద్దాం! ప్రార్థిద్దాం!!!

ఇతిశ్రీ

**(సమాప్తం)**



# స్వాతి సినీగీతకోశం 2003

(గత సంచిక తరువాయి)

## బ్యాక్‌పాకెట్

విడుదల తేదీ:15-11-2003 దర్శకత్వం : శ్రీధర్ బీచెరాజు బ్యానర్: నవత ఇన్నోవేషన్స్ సంగీతం :జూపూడి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.స్వాతి చినుకులా | శ్రీపతి వాసుదేవమూర్తి | కె.బాలచంద్రన్, నాగ సాహితి |
| 2.గోల గోల | బండి సత్యం | శ్రీకాంత్, లెనినా చౌదరి |
| 3.సోనా చిలిపివానా | కాసర్ల శ్యాం | నిత్య సంతోషిణి |
| 4.గుమ్మాడి పూలు | బండి సత్యం | విశ్వ, నిష్మ |
| 5.రారో రంగేళి రాజా | కాసర్ల శ్యాం | భార్గవి |

## విలన్

విడుదల తేదీ:21.11.2003 దర్శకత్వం :కె.యస్.రవికుమార్ బ్యానర్:కనకరత్న మూవీస్ ప్రై లిమిటెడ్ సంగీతం :విద్యాసాగర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.పంచదార చిలకా పలుకు ఏదిష్టం కంచిపట్టు రవికా | వేటూరి | ఉదిత్‌నారాయణ్, సాధనా సర్గమ్ |
| 2.నా గుండె గుడిలో నువు శిలవా దేవతవా | భువనచంద్ర | ఉన్నికృష్ణన్, సుజాత |
| 3.దుమ్మేయిక దులిపెయ్యర తకధిం తక దరువెయ్యర | కులశేఖర్ | కార్తీక్, స్వర్ణలత |
| 4.ఈ పొడు గూడొదిలి పారిపో పసిచిలకా | కులశేఖర్ | బాలు |
| 5.హలో..హలో..మహాశయ నీకు నాకు నందమయా | భువనచంద్ర | టిప్పు, షాలిని, హరిణి |
| 6.వాడి చూపో వేడి చూపో వడిలోకి పిలుపో | వేటూరి | శంకర్‌మహదేవన్, సుజాత |

## చంటిగాడు

విడుదల తేదీ: 26.11.2003 దర్శకత్వం :జయ బ్యానర్:సూపర్‌హిట్ ఫ్రెండ్స్ సంగీతం :వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కొక్కొరకో(2) ఇది నిప్పుకోడి పెట్టరో | కాసర్ల శ్యామ్ | శంకర్‌మహదేవన్ |
| 2.ఒక్కసారి పిలిచావంటే...కోటిసార్లు పలకనా | జిల్లెళ్ళ ప్రసాద్ | ఉదిత్‌నారాయణ్, మహాలక్ష్మి అయ్యర్ |
| 3.చిరుగాలిలా చిగురాకులా.... | భువనచంద్ర | చరణ్, ఉష |
| 4.లవ్ మీ..లవ్‌మీ(2) కిస్‌మీ...కిస్‌మీ(2) | భువనచంద్ర | శ్రీయా గోషల్ |
| 5.స్వాతిముత్యమై....నన్ను అల్లుకోరా... | భువనచంద్ర | కార్తీక్, ఉష |
| 6.సీతాకోక చిలుకలు రెండు స్నేహం చేశాయి | పైడిశెట్టి రామ్ | బాలు |
| 7.సిగ్గులొలికే సీతాలు నా చెంతకు చేరవమ్మా | కాసర్ల శ్యామ్ | గంగాధర్, సునీత |

## మిస్సమ్మ

విడుదల తేదీ: 28.11.2003 దర్శకత్వం :నీలకంఠ బ్యానర్:సత్యం ఎంటర్‌టైన్‌మెంట్స్ సంగీతం :వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నువ్వలా జిలిబిలి గువ్వలా | సాహితి | ఉదిత్‌నారాయణ్, ఉష |
| 2.నే పాడితే లోకమే పాడదా | భువనచంద్ర | వసుంధరాదాస్, బృందం |
| 3.ఎంత సుఖమిదో మనోహరా... | భువనచంద్ర | శంకరమహదేవన్, శ్రీయాగోషల్ |
| 4.ఆకాశానికి ఆశలనిచ్చిన వేసెను మనవాడు | సాహితి | రాందాస్ |
| 5.అందాల గుమ్మరో ఆ బాపు బొమ్మరో | సాహితి | కార్తీక్, నిష్మా |
| 6.అచ్చం తెలుగు... ఇంటికి వెలుగు అమ్మాయండీ మిస్సమ్మ | సాహితి | బాలు |

## రహస్యం

విడుదల తేదీ: 28.11.2003 దర్శకత్వం : యస్.సతీష్ కుమార్ బ్యానర్:శ్రీరాజా ఎన్.బ్రో.స్ సంగీతం: గురురాజ్

**ఈ చిత్రంలో పాటలు లేవు**

# నవ్వు-నవ్వించు

విడుదల తేదీ: 28.11.2003 దర్శకత్వం : డి.రంగారావు బ్యానర్: అయ్యప్ప ఆర్ట్స్ సంగీతం : సురేష్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.విన్నే నే చూసాకే నాకేదో అయ్యిందే | డి.బి.చారి | శ్రీకాంత్ |
| 2.కుందనాల బొమ్మ ఏ ముద్దుగుమ్మ నాప్రాణములే | చంద్రబోస్ | మనో |
| 3.మెరిసే మేఘమా కురిసే ప్రణయమా ॥3॥ | శ్రీకాంత్ | శ్రీకాంత్ |
| 4.కాలేజిలో జూనియర్స్‌తో మస్తుగుంది | నీలమ్ | సురేష్ |
| 5.నీవేనా హృదయాన..... | నాగు | శ్రీకాంత్ |

# హంతకురాలు

విడుదల తేదీ: 5.12.2003 దర్శకత్వం : వల్లభనేని జనార్దన్ బ్యానర్: క్రియేటివ్ ఎంటర్‌టైనర్స్ సంగీతం : షణ్ముఖ్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఎదలో ఈవేళ ఎగిసింది జ్వాల | బల్లెం వేణుమాధవ్ | గాయత్రి బృందం |
| 2. జాబిలమ్మ జంట చేరేనమ్మ | బల్లెం వేణుమాధవ్ | పార్థసారథి, గాయత్రి |

# నీ మనసు నాకు తెలుసు

విడుదల తేదీ: 06.12.2003 దర్శకత్వం :ఎ.ఎం.జ్యోతికృష్ణ బ్యానర్: శ్రీ సూర్యామూవీస్ సంగీతం :ఎ.ఆర్.రెహమాన్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.అందని అందం అస్కావా సరసాలాడగా వస్తావా | ఎ.ఎమ్.రత్నం | సుర్జోభట్టాచార్య, శ్రీయ, కోరస్ |
| 2.కలుసుకుందామా ఇద్దరం కలుసుకుందామా | ఎ.ఎమ్.రత్నం | ఉన్నిమీనన్, అనుపమ, చిన్మయి, కోరస్ |
| 3.కమ కమ తొలి వయసుని తట్టే కమ కమ | ఎ.ఎమ్.రత్నం | అనుపమ, అపర్ణ, కునాల్, బ్లాజీ, జార్జ్ పీటర్ |
| 4.స్నేహితుడే వుంటే ఒక స్నేహితుడే ఉంటే | ఎ.ఎమ్.రత్నం | మనో, ఉన్నికృష్ణన్, చిన్మయి |
| 5.ఏదో ఏదో నాలో పులకింత | ఎ.ఎమ్.రత్నం | కార్తీక్, గోపికా పూర్ణిమ |
| 6.మస్తురా మస్తురా మస్తురా పెదవితో భువినే | ఎ.ఎమ్.రత్నం | శ్రీరామ్ పార్థసారధి, చిత్ర శివరామన్,మాతంగి,జార్జ్ పీటర్ |

# మా అల్లుడు వెరీ గుడ్

విడుదల తేదీ:06.12.2003 దర్శకత్వం :ఇ.వి.వి.సత్యనారాయణ బ్యానర్: రోజామూవీస్ సంగీతం :యం.యం.కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ముత్యాల పల్లకిలో నా కలల రాణి అదిగో | చంద్రబోస్ | ఎస్.పి.చరణ్ |
| 2.ఏం ఒంపులు పెంచావే దుంపతెగ నీదుంపతెగ | చంద్రబోస్ | ఉదిత్‌నారాయణ్, చిత్ర |
| 3.మామగారూ పిల్లనచ్చింది... చాలా బాగుంది | చంద్రబోస్ | బాలు, చరణ్, పల్లవి |
| 4.పడక పడక(2) ప్రేమలోన పడ్డందుకు | చంద్రబోస్ | కీరవాణి, స్మిత |
| 5.పెళ్ళంటూ చేసుకుంటే యిట్టాంటి దాన్నే | చంద్రబోస్ | రవివర్మ, కౌసల్య |
| 6.పలుకే బంగారమాయెనా సిగ్గంత పోయె | చంద్రబోస్ | బాలు, సునీత |

# ప్రేమాయనమః

విడుదల తేదీ:12.12.2003 దర్శకత్వం :శివరామ్ బ్యానర్: ట్వంటీ ఫస్ట్ సెంచరీ లయన్స్ సంగీతం :రమేష్ ఎర్రా

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.తెలుగింట్లోని తులసిమొక్క కోవెలలోని కొబ్బరి మొక్క | చంద్రబోస్ | మల్లికార్జున్, సుధారాణి |
| 2.అమెరికా ॥3॥ అందమయిన అమ్మాయిలాంటి అమెరికా | చంద్రబోస్ | సందీప్, సునీత |
| 3.గదిలో మదిలో శృంగార క్షీరమదనం గుడిలో ఒడిలో ... | చంద్రబోస్ | హరిహరన్, సునీత |
| 4.రా...రంజు భలే చేపా రమ్యకృష్ణకి నువ్వే దూపా ॥2॥ | చంద్రబోస్ | రఘు కుంచె, సందీప్, లెనీనా చౌదరి |
| 5.ఇన్నాళ్ళుగ ఎన్నో కలలే కన్నా కొన్నాళ్ళుగా తనతో కలిసే ఉన్నా | చంద్రబోస్ | శంకర్‌మహదేవన్ |
| 6.జానెడు నడుముకు రిబ్బను ముక్క | భాషాశ్రీ | రమేష్ ఎర్రా |
| 7.మనసే చిలకై ఎగిరే వేళా మనిషే శిలలా నిలిచే వేళా | చంద్రబోస్ | సునీత, డా॥ బంటిజే.సి |
| 8.ఆకాశమే నాకోసం రెక్కలు కట్టి దిక్కులు దాటి అక్కున చేరిందే | చంద్రబోస్ | సందీప్, సునీత |

## నీకే మనసిచ్చాను

విడుదల తేదీ: 12.12.2003 దర్శకత్వం :సూర్యతేజ బ్యానర్: జి.ఎస్.కె.ఆర్ట్ మూవీస్ సంగీతం :శ్రీ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.తొలిచూపే ఏదో చిత్రం చేసిందా చిరునవ్వే ఏదో | సిరివెన్నెల | రాజేష్ |
| 2.అందీ అందక తుళ్ళే అందమా... అన్నీ పొందక | సిరివెన్నెల | దేవిశ్రీ ప్రసాద్, సుమంగళి |
| 3.ఆకుపచ్చని సిరిఅందాలు రేకు విచ్చిన అరదండాలు | సిరివెన్నెల | చిత్ర |
| 4.ఇంతే అనుకోనా నాకు నీ ఋణం జంటే విడిచేనా | సిరివెన్నెల | బాలు |
| 5.మెహబూబా మెహబూబా యువరాజా ... | భువనచంద్ర | టిప్పు, నిత్యసంతోషిణి |
| 6.మాఘమాసం మంచి ముహూర్తం కుదిరిందే ఇంచక్కా | సిరివెన్నెల | రాజేష్, గోపికా పూర్ణిమ |

## ప్రేమపందిరి

విడుదల తేదీ: 12.12.2003 దర్శకత్వం :యస్.నారాయణ్ బ్యానర్: చన్నింబిక ఫిలింస్ సంగీతం :ఎస్.ఎ.రాజ్‌కుమార్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కుహు కుహు...కోకిల కూ అంటే కూ అన్నది | ఇ.యస్.మూర్తి | హరిహరన్,చిత్ర |
| 2.అందమైన కన్నులు చూసి కలువలెమో అనుకున్నా | ఇ.యస్.మూర్తి | హరిహరన్, కోరస్ |
| 3.పల్లికిలిస్తూ పిల్లని తెస్తే అవుతుందా షాదీ | ఇ.యస్.మూర్తి | మనో, మానిక వినాయగమ్, సుజాత, కోరస్ |
| 4.ఆహ జుమ్‌తక జుమ్‌(జుమ్ ఆక జుమ్ | ఇ.యస్.మూర్తి | చిత్ర కోరస్ |
| 5.కుహు, కుహు కోకిల కూ అంటే కూ అన్నది | ఇ.యస్.మూర్తి | చిత్ర కోరస్ |
| 6.వేగుల చుక్క... దారీ వీడును | ఇ.యస్.మూర్తి | ఎస్.ఎ.ఆర్,కోరస్ |

## అవునా

విడుదల తేదీ:12.12.2003 దర్శకత్వం :సి.ఉమామహేశ్వరరావు బ్యానర్:మేఘన ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్ సంగీతం :భవతారిణి ఇళయరాజా

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కళ్ళల్లో నువ్వే నువ్వే చూపుల్లో నువ్వే నువ్వే | భువనచంద్ర | ఉదిత్‌నారాయణ్, ఉష |
| 2.పాడాలి ప్రేమగీతం రాయాలి ప్రేమ కావ్యం | భువనచంద్ర | బాలు, స్వర్ణలత,కోరస్ |
| 3.ఇద్దూ ఇచ్చేద్దూ ఓ చిన్నముద్దు | సిరివెన్నెల | విజయ్ ఏసుదాసు, ఉష, మాల్గాడిశుభ |
| 4.హమ్మ॥5॥ బ్రహ్మాండంగా వుంది రబ్బరు బొమ్మ | సిరివెన్నెల | కార్తిక్, రంజిత్, హరీష్, సుజాత |
| 5.నేస్తమా ఓ నేస్తమా ॥2॥ నీకోసమే ఆవేదన | భువనచంద్ర | ఆర్పీ, భవతారిణి ఇళయరాజా, కోరస్ |
| 6.ఎర్ర గులాబి ॥6॥ తెల్లని మనసున ముడివేస్తుంది | చంద్రబోస్ | యస్.పి.చరణ్, కోరస్ |

## టైగర్ హరిశ్చంద్రప్రసాద్

విడుదల తేదీ:18.12.2003 దర్శకత్వం :వి.సముద్ర బ్యానర్:శ్రీ లక్ష్మి నరశింహ ప్రొడక్షన్స్ సంగీతం :ఎస్.ఎ.రాజ్‌కుమార్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కాడేద్దుల...గణగణ గంటలు ఘల్లుమంటుంటే | జాలాది | ఎస్.పి.బాలు, చిత్ర, కోరస్ |
| 2.ప్రేమలోని ఏమిమాయ...ఉన్నదా మరి | ఇ.యస్.మూర్తి | కార్తిక్, శ్రీయగోషల్ |
| 3.చెప్పనా...(2)లక్షసార్లు చెప్పనా నిన్నే ప్రేమిస్తానంటూ | చిర్రావురి విజయకుమార్ | టిప్పు, స్వర్ణలత, |
| 4.సింహమొచ్చినట్టుంది నడిచొస్తుంటే | చిర్రావురి విజయకుమార్ | ఎస్.పి.బాలు,సుజాత |
| 5.ప్రేమలోన ఏమిమాయ...ఉన్నదా మరి | ఇ.యస్.మూర్తి | కార్తిక్, శ్రీయగోషాల్ |
| 6.దేశమా...స్వతంత్ర దేశమా.. | జాలాది | ఎస్.పి.బాలు, కోరస్ |

## సత్యం

విడుదల తేదీ:19.12.2003 దర్శకత్వం : ఆర్.సూర్యకిరణ్ బ్యానర్:అన్నపూర్ణ స్టూడియోస్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఓ మగువా నీతో స్నేహంకోసం ఎంతో ట్రయ్‌చేశా | భాస్కరభట్ల | చక్రి |
| 2.కుచ్ కుచ్ పానాహై తో ఫిక్సిట్ | విశ్వ | విశ్వ, కౌసల్య |
| 3.రెండు మొక్కజొన్న పొత్తులున్నయ్ తిందువా | వెంకి, రాజేష్ | వెంకటరమణ, సూర్యకిరణ్, రాజేష్ |
| 4.మధురమె..మధురమె మధురమె | కందికొండ | శంకర్‌మహదేవన్ |
| 5.కనులలో దాచిన కావ్యమే నువ్వు | కందికొండ | వేణు |
| 6.పిలిచిన పలకదు ప్రేమా... | భాస్కరభట్ల | చక్రి, రవివర్మ, రమేష్, పల్లవి |
| 7.ఓరి దేవుడా లోకం మారెరా | కందికొండ | వాసు, సూర్యకిరణ్, రాజేష్ |

## ఏసు మహిమలు

విడుదల తేదీ: 25.12.2003 దర్శకత్వం :నట్టికుమార్ బ్యానర్:జీసెస్ మూవీస్ ఇంటర్‌నేషనల్ సంగీతం :మహర్షి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.క్రైస్తవ కుటుంబం క్రీస్తు నీ ఆలయం ప్రభు దీవెనే | మహర్షి | హర్షిక, ఎస్.కె.బాలచంద్రన్ |
| 2.నా ప్రభూ మనవి విను వేదనాయే నా యెదా రగిలి | మహర్షి | హర్షిక |
| 3.ఏ క్రాంతి లేని ఏకాంతవేళ నా ఏసు నిను చేరుకోనా | మహర్షి | వి.రామకృష్ణ |
| 4.తెగిపోయేనా ఈ బంధము మమతానురాగమూ | మహర్షి | వి.రామకృష్ణ |
| 5.కరుణే లేదా కరుణామయుడా శరణే కోరా | మహర్షి | నిష్మా |
| 6.బాల యేసు పుట్టాడంటా ఈ రోజు | మహర్షి | హని, నిష్మా |

ఈ కింద్రి చిత్రాల వివరాలు ఇటీవలే లభించాయి. విడుదల తేదీల ప్రకారం మీ రికార్డులలో చేర్చుకొనగోరుతున్నాం

- ఎడిటర్

## ధనుష్

విడుదల తేదీ: 12.04.2003 దర్శకత్వం :నల్లమోతు శ్రీనివాసరావు బ్యానర్:ప్రశాంతి ప్రొడక్షన్స్ సంగీతం :దిన

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చినపాపా! చినపాపా!... దేవుడెంత చిలిపోడే | భువనచంద్ర | శంకర్‌మహదేవన్, ప్రసన్న |
| 2.నువ్వంటే... నువ్వంటే ఎంతో ఇష్టం ఒప్పుకోవె కొంచెం | పి.హెచ్.విజయ్ కుమార్ | మనో, రాధిక |
| 3.మళ్ళీ మళ్ళీ నీతో నేను నువ్వేకావాలంటున్నాను | సుద్దాల అశోక్‌తేజ | ఎస్.పి.బాలు, ఉష |
| 4.అమ్మానాన్నా వద్దొద్దన్నా ఐస్‌క్రీం పార్లర్‌కి వెళ్ళావంటే | భువనచంద్ర | మహంతి |
| 5.ఓ ఎర్రబుగ్గల పిల్ల నీ మీద అసలు జల్ల | సుద్దాల అశోక్‌తేజ | కోటి, కార్తిక్ |

## అంతా ఒక మాయ

విడుదల తేదీ: 22.08.2003 దర్శకత్వం :డి.రంగారావు బ్యానర్: అయ్యప్ప ఆర్ట్స్ సంగీతం :సురేష్ (లలిత్‌సురేష్)

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. చకోరిల్లా | వడ్డేపల్లి కృష్ణ | మనో, రాధిక |
| 2. మల్లికలా ప్రేమ | వడ్డేపల్లి కృష్ణ | మనో, రాధిక |

## భయం

విడుదల తేదీ: 9.09.2003 దర్శకత్వం : డి.రంగారావు బ్యానర్: అయ్యప్ప ఆర్ట్స్

**ఈ చిత్రం లో పాటలు లేవు**


ఈ సంకలనానికి అధికశాతం సహకరించిన ఫిలిం జర్నలిస్ట్ - పులగం చిన్నారాయణ,
మిత్ర ధర్మంగా చేయూతనందించిన ఫిలిం జర్నలిస్ట్‌లు - ఎన్.సుబ్బారావు, వి. ఓంప్రకాష్,
ఆర్.డి.యస్.ప్రకాష్, యు.వినాయకరావు, సురేష్ కొండేటి, జగన్, అండా రామారావు,
శబ్దాలయా రికార్డింగ్ థియేటర్‌కు చెందిన శ్రీ రమేష్
ప్రముఖ ఆడియో కంపెనీలు- ఆదిత్య మ్యూజిక్, సుప్రీమ్ మ్యూజిక్, సోహన్ మ్యూజిక్,
సూర్య మ్యూజిక్, మాయూరి ఆడియో, బ్లిస్ మ్యూజిక్
ఇంకా ఎందరెందరో సినీ గీత రచయితలు, సంగీత దర్శకులు, నిర్మాతలు, దర్శకులతోపాటు,
'హాసం' సిబ్బందిలో ముఖ్యులైన పి.గిరి, జి.రాజేష్, టి.నవీన్
అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలతో...

- 'హాసం' యాజమాన్య సంపాదకవర్గం

# సినిమాల్లో సంప్రదాయ కీర్తనలు



సినీ గీతాలలో ఉపయోగించుకొన్న సాంప్రదాయ కీర్తనలను నాకు తెలిసినంతలో మీకు తెలియ జేయుచున్నాను.

**అష్టపదులు :-** భక్త జయదేవుడు రచించిన తన గీత గోవిందం అనే కావ్యంలోని అష్టపదులను ఉపయోగించుకొన్న కొన్ని చిత్రాల పేర్లు (భక్త జయదేవ అనే చిత్రం కాకుండా)

1. చం చర దధర సుధామధుర ధ్వని (భక్త కబీరు 1936)
2. చందన చర్చిత, నీలకళేబరు (సతీ తులసి 1936, తెనాలి రామకృష్ణ 1956, శ్రీకృష్ణసత్య)
3. సావిరహే తవ దీనా రాధా (మాలపిల్ల 1938, విప్రనారాయణ)
4. రాధికా కృష్ణా రాధికా (త్యాగయ్య 1946, అమ్మాయి పెళ్ళి, మేఘసందేశం)
5. ధీర సమీరే, యమునా తీరే (జగన్నాటకం)
6. ప్రియే చారుశీలే (మేఘ సందేశం, ఈ చిత్రంలో ఈ అష్టపదికి పాలగుమ్మి పద్మరాజుగారి స్వేచ్ఛాను వాదం కూడా ఉంది)



**తరంగాలు :-** శ్రీనారాయణ తీర్థులు రచించిన కృష్ణలీలా తరంగిణి అనే కావ్యం లోని తరంగాలు ఉపయోగించుకొన్న చిత్రాలు

1. బాల గోపాల మాముద్ధరా కృష్ణా (దొంగ రాముడు, ఒక తల్లి పిల్లలు)
2. శరణం భవ కరుణామయ (అనురాగం)
3. ఆలోకయే శ్రీ బాలకృష్ణం సఖీ (శ్రుతి లయలు)
4. కృష్ణం కలయ సఖీ సుందరం (పెళ్ళిపుస్తకం)
5. పూరయ మమ కామం (దేవాంతకుడు)

**సదాశివ బ్రహ్మేంద స్వామి కీర్తనలు :-**

1. మానస సంచరరే, బ్రహ్మణి మానస (అంతా మన మంచికే, శంకరాభరణం)
2. పిబరే రామరసం, రసనే (పడమటి సంధ్యా రాగం)
3. శరణు, శరణు సురేంద్ర సన్నుత (శ్రుతిలయలు)



**అన్నమయ్య :-** (అన్నమయ్య చిత్రం కాకుండా)

1. జో అచ్యుతానంద, జో జో (అనసూయ 1936)
2. ఇచ్చకాలు నీకు నాకు ఇంక చాలు (తెనాలి రామకృష్ణ)
3. విన్నపాలు వినవలె, వింత వింతలు (అనురాగం, శుభలేఖ)
4. నెయ్యములల్లో నేరెళ్ళో (శుభలేఖ)
5. అదివో, అల్లదివో శ్రీహరి వాసము (కలియుగం)
6. ముద్దు గారే యశోద ముంగిట ముత్యము (పడమటి సంధ్యారాగం)
7. తందనాన అహి (శ్రుతిలయలు)
8. ఇన్ని రాశుల యునికి (శ్రుతిలయలు)
9. కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు (అల్లుడుగారు)





**రామదాసు కీర్తనలు :-**

(భక్తరామదాసు చిత్రం కాకుండా)

1. క్రూర కర్మములు నేరక జేసితి (దేవత 1941)
2. చరణములే నమ్మితి (దేవత 1941)
3. గరుడా గమనా రారా (దేవత 1941)
4. ఇక్ష్వాకు కులతిలక (ఆస్థిపరులు)
5. ఏతీరుగ నను దయచూచెదవో (శంకరాభరణం)
6. పలుకే బంగారమాయెరా (శంకరాభరణం)

**క్షేత్రయ్య పదాలు :-**

(మహాకవి క్షేత్రయ్య చిత్రం కాకుండా)

1. ఇంత తెలిసి యుండి, ఈ గుణమేలరా (దేవదాసు 1953)
2. రారా నా స్వామి రారా (విప్రనారాయణ)
3. ముందటి వలె నాపై నెనరున్నదా స్వామి (ఆత్మగౌరవం)
4. మక్కువ తీర్చరా మువ్వ గోపాలా (లేత మనసులు)

**త్యాగరాజు స్వామి కీర్తనలు :-**

(త్యాగయ్య చిత్రం కాకుండా)

1. రాగసుధా రసపానము జేసి (సారంగధర, మిస్సమ్మ)
2. మరుగేలరా ఓరాఘవా (బాలయోగిని, సప్తపది)
3. పలుకవేమి నా దైవమా (వరవిక్రయం)
4. నగుమోము గన లేని నా జాలి (వివాహ బంధం, అల్లుడుగారు)
5. ఏక్కలా నిలబడి (చక్రపాణి)
6. ఏతావురా నిలకడ నీకు (వరుడు కావాలి)
7. రామా, నన్ను బ్రోవరా (ఆప్తమిత్రులు)
8. మా జానకి చెట్టబట్టగా (సీతా కళ్యాణం)
9. గంధము పూయరుగా (శుభోదయం)
10. బాల కనక మయ చేల (సాగర సంగమం)
11. శ్రీ గణనాధం భజామ్యహం (శ్రుతిలయలు)
12. జగదానంద కారకా (పెళ్ళి పుస్తకం)

పైన పేర్కొన్న వాగ్గేయ కారుల కీర్తనల బాణీలో వారే రాశారేమో అని పించేట్లుగా ఉండే సినీగీతాలు కొన్ని :-

1. తెలవారదేమో స్వామి (అన్నమయ్య బాణీ, సిరివెన్నెల, శ్రుతిలయలు)
2. పలుకే బంగారుమాయెరా, నను బ్రోవమని (రామదాసు బాణీ, ఆరుద్ర, అందాల రాముడు)
3. శ్రీరామ నీనామ మెంతో రుచిరా (రామదాసు బాణీ, కొసరాజు, ఇద్దరుమిత్రులు)
4. నడిరేయి ఏ ఝాములో (రామదాసు బాణీ, దాశరథి, రంగుల రాట్నం)
5. శ్రీరాజ గోపబాలు (సిద్ధేంద్ర యోగి బాణీ, సినారె, ఏకవీర)
6. కొలువైతివా రంగశాయి (సిద్ధేంద్ర యోగి బాణీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఆనందభైరవి)

**మరికొన్ని విశేషాలు:**

1. నారీ నారీ నడుమ మురారీ చిత్రంలోని ఇరువురి భామల కౌగిటిలో పాట పల్లవి వ్రాసినది ఆత్రేయ, చరణాలు వేటూరి సుందర రామ్మూర్తిగారు వ్రాసేరు.

2. వాగ్దానం చిత్రంలోని హరికథ శ్రీనగజా తనయం వ్రాసినది మహాకవి శ్రీశ్రీ. అయితే ఫెళ్ళుమనె విల్లు అను పద్యం (తేటగీతి) కరుణ శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి శివధనుర్భంగం లోనిది, భూతల నాధుడు రాముడు అను పద్యం (కందం) పోతన భాగవతం నవమ స్కంధం లోనిది.

3. ఒకటి లేదా రెండు పాటలే వ్రాసినా వాసి కెక్కిన కవులు.

01. ఇంతేరా ఈ జీవితం తిరిగే రంగుల రాట్నము (రంగల రాట్నము) ఎస్.వి.భుజంగ రాయశర్మ
02. నిదురించే తోటలోకి (ముత్యాల ముగ్గు) గుంటూరు శేషేంద్ర శర్మ
03. తనువా, ఉహు, హరిచందనమే (కధానాయకురాలు) జి. విజయ రత్నం.











**సేకరణ : యస్.వెంకటరావు, విశాఖపట్నం -2**






హాస్యం, సంగీతం - రెండింటికీ పెద్దపీట వేసిన సంస్థ విజయా. ఆ సంస్థ మూలస్తంభాలలో ఒకరైన నాగిరెడ్డి ఇకలేరు. ఫిబ్రవరి 25 న తన 91 వ యేట కన్నుమూశారు. విజయాసంస్థలోని ప్రముఖులు - చక్రపాణి, కె.వి.రెడ్డి, పింగళి, ఘంటసాల, కమలాకర కామేశ్వరరావు, ఎల్.వి.ప్రసాద్, రాజేశ్వరరావు, పెండ్యాల, సముద్రాల ఇలా ఎందరో వెళ్లిపోయాక కూడా విజయా బ్యానర్‌ను గుర్తు చేసే నాగిరెడ్డి కూడా ఇప్పుడు కీర్తిశేషులయ్యారు.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**ఎస్. శివనారాయణ, కొత్తపేట**

**ప॥ ఎరక్కపోయి ఇరుక్కుపోవటం అంటే?**

జ॥ లవ్ చేసిన అమ్మాయినే పెళ్లి చేసుకోవడం

**ప్ర॥బ్రహ్మచారుల సంఘంలోని వారు బైటికి వెళ్ళి పెళ్ళిచేసుకుంటే వారిని ఎలా శిక్షించాలి?**

జ॥ ఆల్రెడీ శిక్షను అనుభవిస్తున్నవారిని ఇంకో శిక్షకు ఎలా గురిచేస్తాం.

**రమణ శాస్త్రి, సంగారెడ్డి**

**ప॥ నాడా దొరికిందని గుర్రం కొన్నాడట... దీనికి హైటెక్ వర్షన్ ఏంటి?**

జ॥ మౌస్ దొరికిందని కంప్యూటర్ కొన్నాడట.

## ఈ రూటే వేరు




'డే' రా - పగలు రా

'రే' చీకటి - చీకటి కిరణం

'మై'కం - నేను వస్తాను

- బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం



## చిలిపి లిపి



| | | |
|---|---|---|
| DAY గ | - | డేగ |
| G LAY B | - | జిలేబి |
| SEE త | - | సీత |
| SAY నాని | - | సేనాని |
| COW లు | - | కౌలు |
| NOW కరు | - | నౌకరు |
| LOVE కి CoME | - | లౌకికం |
| NO TWO | - | నోటు |

- బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం

## పేరు - లిపేరు



దొంగోడు - వీడే - అవునా?

మిస్సమ్మ - రాంబాబుగాడిపెళ్ళాం -ఐతే - థాంక్స్

- మాదినేని శివశంకర నాయుడు, అనంతపురం.

మల్లీశ్వరి- నువ్వేనా ప్రేయసి -నేను పెళ్లికి రెడీ.

- శ్రీ (కార్టునిస్ట్), ఆచంట, ప॥గో॥జిల్లా.

## చిలిపి కవిత



ఉన్నాడు మాకొక టెనెంటు?
చూట్టానికి మాత్రం భలే డీసెంటు
అతిగా వాడతాడు కరెంటు ?
చచ్చినా కట్టడు రెంటు
ఏం చెయ్యగల్ను... అతడొక స్టూడెంటు.

- ఎస్.శివనారాయణ, కొత్తపేట

## డబుల్ రోల్



నాకు మా గన్నుగా నిద్దుర పట్టినపుడు నా గన్ను ఎవరో ఎత్తుకు పోయేరు.

తాయిలం పెట్టేదాకా ఆ ఆకతాయి కదలడు.

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

ఆ జూ ను జూన్ లోనే తెరుస్తారట.

- పి.వి.పవన్ కుమార్, హైదరాబాద్

## షార్ట్‌కట్స్



| | | |
|---|---|---|
| పగడాల దినేష్ | - | పది |
| వంగిమళ్ల దశరథ | - | వంద |
| వేపకాయల యిస్మాయిల్ | - | వేయి |
| లవంగాల రక్ష | - | లక్ష |

- బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం

| | | |
|---|---|---|
| కిలారి లోహితాస్య | - | కిలో |
| వీటూరి శరభయ్య | - | వీశ |

- ఎం. మస్తాన్ రెడ్డి, పూణే

## పేరడీ పేరేడ్



ప॥ ప్రజాస్వామ్యమిది అందరిదీ...
ఎన్నికలు అందరి వారివెలే
నాయకులారా ఎందుకు తగవులు...
పదవులు అందరికానందములే ॥ప్రజా॥
చ॥ సారాబ్రాందీ బీరులు పోసిన
ఓటులు జలజల రాలునులే ॥సారా॥
దానికి రిగ్గింగ్ తోడై నిలిచిన
తప్పక గెలుపు దక్కునులే ॥దానికి॥ ॥ప్రజా॥
చ॥ బోగస్ ఓట్లను జేర్పించుటలో
ఎవరికి వారు ఘనులేలే ॥బోగస్॥
వాపే బలమని భావించినచో
ప్రజా శ్రేయసిక అంతేలే ॥వాపే॥ ॥ప్రజా॥

('మిస్సమ్మ' చిత్రంలో "బృందావనమది అందరిదీ..." పాటకు పేరడీగా...)

-రెడ్డి.ఎమ్మె, ఒంగోలు

ఈ సంచికలోని పేరడీ పేరేడ్‌ని రాసిన రెడ్డి.ఎమ్మె(ఒంగోలు) గారికి సోహన్ మ్యూజిక్ వారు 'ఐ యామ్ ఇన్ లవ్ విత్ యూ' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



## పాటల చిత్రీకరణలో అందె వేసిన చేయి

# విజయ్ ఆనంద్

గతపక్షంలో తన 71 వ యేట కనుమూసిన విజయ్ ఆనంద్ అగ్రశ్రేణి దర్శకుడిగా విఖ్యాతుడు. రచయితగా, నటుడిగా, నిర్మాతగా తన ప్రతిభను చాటుకున్నవాడు. ఇవన్నీ ఒక ఎత్తుకాగా సంగీతప్రియుడిగా, పాటల చిత్రీకరణలో మేటిగా 'హాసం' అభిమానుల హృదయాలలో ఆయనకు ఒక ప్రత్యేకస్థానం ఉంది.

విజయ్ ఆనంద్ దర్శకత్వం వహించిన సినిమాల లిస్టు ఒకసారి పరికిస్తే చాలు, వాటి సంగీతప్రాధాన్యం గుర్తుకువస్తుంది. - నౌదో గ్యారహ్, కాలాబజార్, తేరే ఘర్‌కే సామ్‌నే, గైడ్, తీస్రీమంజిల్, జ్యూయల్ థీఫ్, జానీ మేరా నామ్, తేరేమేరే సప్నే... వీటిలో ప్రతి ఒక్క సినిమాని ఓ ట్రెండ్ సెట్టర్ అనే అనవచ్చు. ఆర్‌డీ బర్మన్ కెరియర్‌ను మలుపు తిప్పినది తీస్రీమంజిల్ అయితే కళ్యాణ్‌జీ ఆనంద్‌జీలను మోడర్న్ మ్యూజిక్ డైరక్టర్స్‌గా నిలబెట్టినది 'జానీ మేరానామ్'. ఇక సచిన్‌దేవ్ బర్మన్ కీర్తికిరీటంలో 'గైడ్' ఒక కలికితురాయి అన్న విషయం అందరూ ఎరిగినదే!



పాటల చిత్రీకరణలో ముఖ్యంగా ముగ్గుర్ని చెప్పుకోవాలి. - రాజ్‌కపూర్, గురుదత్, విజయ్ ఆనంద్. పాటలో సాహిత్యం, సంగీతం ఏ పాళ్లలో పడాలో తెలిసి గీతకారులనుండి, సంగీతకారుల నుండి టేలంటును ఎలా వెతికి తీయాలో, దాన్ని తెరమీదకు అనువదించే టప్పుడు ఎంత గొప్పగా ప్రెజంట్ చేయాలో వారికి బాగా తెలుసు.

విజయ్‌కు, బర్మన్‌దాదాకు పరస్పరాభిమానం మెండు. దేవ్ సినిమాకై ట్యూన్‌లు వినిపిస్తూ 'జైసే రాధానే మాలా జపీ' ట్యూన్‌లు వినిపించాడు బర్మన్. "నవ్‌కేతన్ బ్యానర్ మీదనే నేను స్వంతంగా సినిమా తీస్తాను. అప్పటిదాకా ఈ ట్యూన్ దాచిపెట్టు. ఎవరికీ ఇవ్వకు." అని ప్రార్థించాడు విజయ్. అలాగే జరిగింది. 'తేరే మేరే సప్నే'లో ఆ పాట అవతరించింది. అదే సినిమాలో 'మేరా అంతర్ ఇక్ మందిర్' పాటలో భార్యాభర్తల మధ్య ఉండే తీవ్రప్రేమావేశాలను చూపించవలసివచ్చింది. తనకంటె తొమ్మిదేళ్లు పెద్దవాడైన అన్నగారికి ఆ సన్నివేశం వివరించడం ఇబ్బందనిపించి హీరోయిన్ ముంతాజ్‌కు విశదీకరించి ఆమె ద్వారా దేవ్‌కు చెప్పించాడు విజయ్.

కాలాబజార్‌లోని 'ఖోయా ఖోయా చాంద్' చిత్రీకరణ గుర్తుకు తెచ్చుకోండి. అసలు ఆ సన్నివేశమే విలక్షణమైనది. హీరోయిన్ తన ప్రియుడికోసం ఆరాటపడుతూంటే హీరో ఆమెను టీజ్ చేయడాన్ని, ఆ పాటనీ మర్చిపోలేం... ఆ పాటలో దేవ్ ఆనంద్ పరుగులూ మరవలేం. అదే సినిమాలో 'రిమ్‌ఝిమ్ కే తరానే' వర్షపు పాటగానీ, 'సచ్ హుయే సప్‌నే మేరే'లో వహీదా అడుగుల విన్యాసం కానీ ఇప్పటికీ పులకరింపజేస్తాయి.

వహీదా అనగానే 'గైడ్' గుర్తుకువస్తుంది. కావ్యేషు నాటకం రమ్యం శ్లోకంలో శాకుంతలం శ్లోకాల గురించి చెప్పినట్టు 'గైడ్' ఒక్కటిచాలు, అందునా 'ఆజ్ ఫిర్ జీనేకీ తమన్నా' ఒక్కటిచాలు, అందునా గోడపై వహీదా వడివడిగా నడుస్తూన్న ఫ్రేము ఒక్కటి చాలు - 'సలాం విజయ్ ఆనంద్' అనడానికి.

సంగీతప్రియత్వమేకాదు, విజయ్‌లో హాస్యప్రియత్వం కూడా చాలా ఉంది. తన స్వంత సినిమా 'చుపారుస్తుమ్'లో 'ధీరేసే జానా ఖటియన్ మే ఓ ఖట్‌మల్' అనే పేరడీ పాట పెట్టాడు. ఇంకో స్వంతసినిమా 'తేరేమేరే సప్నే'లో 'అంధా రాజా అంధీ ప్రజా' అనే వ్యంగ్య హాస్యగీతం సందర్భం పెద్దగా లేకున్నా పెట్టాడు. కాలాబజార్‌లో 'రుపయ్యా' పాట అలాటిదే. అసలు విజయ్ ఆనంద్ తొలిసినిమాలన్నీ లైట్ రొమాంటిక్ కామెడీలే. 'తీస్రీ మంజిల్' కూడా క్రైమ్ రంగు పూసుకున్న రొమాంటిక్ కామెడీయే. ఇక చుపారుస్తుమ్‌లో తనే స్వయంగా కామెడీ చేసి చూపించాడు.

విజయ్ ఆనంద్ నిష్క్రమణంతో ఒక లెజెండ్ అంతరించింది అనడం స్వభావోక్తియే, అతిశయోక్తి కాదు.

**- ఎమ్బీయస్ ప్రసాద్**

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1962

మెహందీ లగే మేరే హాత్' చిత్రం ద్వారా కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ లకు దర్శకుడు సూరజ్‌ప్రకాష్, నటుడు శశికపూర్‌లతో చిరకాల అనుబంధం మొదలయింది. ఆనంద్ బక్షి రాసిన టైటిల్ సాంగ్ హిట్ అయింది. అతనికి గీత రచయిత గా ఇదే మొదటి సోలో చిత్రం కావటం విశేషం.



ఆనంద్ బక్షి

కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీల అభిమాన దర్శకుడు, 70, 80 లలో పెద్ద దర్శకుడైన ప్రకాశ్ మెహ్రా 'నాగ దేవత' చిత్రం ద్వారా గీత రచయితగా పరిచయం. ఆశా భోంస్లే పాడిన 'ఝుంకార్ పాయల్ కీ' అనే ఈ గీతాన్ని స్వరపరిచింది ఎస్.ఎన్.త్రిపాఠి.



'నాగ దేవత' చిత్రంలో శశికళ

త్రిపాఠి స్వరపరిచిన 'సంగీత్ సమ్రాట్ తాన్‌సేన్' చిత్రంలో ముఖేష్ పాడిన 'ఝూమ్‌తీ ఛలీ హవా....'అతని హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

త్రిపాఠి దగ్గర కొన్నాళ్లపాటు అసిస్టెంటుగా పనిచేసిన చిత్రగుప్తకు మంచి గుర్తింపు తీసుకువచ్చిన సంవత్సరమిది. 'మైఁ చుప్ రహూంగీ' చిత్రంలోని 'మేరే దిల్ కభి తో కోయి ఆయేగే', 'తుమ్హీ హో మాతా పితా', 'కోయీ బతా దే దిల్ హై', 'షాదీ' చిత్రంలో 'ఆజ్ కి రాత్ నయా చాంద్ లేకే ఆయీ హై', 'బర్మా రోడ్' చిత్రంలో 'దగాబాజ్ హో', 'బేజుబాన్' చిత్రంలోని 'దీవానే తుమ్ దీవానే హమ్' పాటలు హిట్ అయ్యాయి.



చిత్రగుప్త

'డాక్టర్ విద్య' చిత్రంతో ఎస్.డి.బర్మన్ హిట్ కొట్టారు. 'ఖన్‌కే కంగనా బిందియా' ,'పవన్ దివానీ న మానే', 'ఏ దిల్ ఆవారా చల్' పాటలు సూపర్ హిట్ అయ్యాయి. అలాగే 'బాత్ ఏక్ రాత్ కీ' చిత్రంలోని 'న తుమ్ హమేఁ జానో', 'అకేలా హూఁ మైఁ' పాటలతో పాటు మన్నాదే పాడిన కవ్వాలి 'కిస్నే చిల్‌మన్ సే మారా' హిట్ అయ్యాయి.

'నాటీబాయ్' చిత్రం ద్వారా కిశోర్-ఎస్.డి.బర్మన్- శక్తి సమంతాల కాంబినేషన్‌కు పునాది పడి ఆరాధన వరకూ అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

-వచ్చే సంచికలో మరికొంత




1961లో విడుదలై తెలుగు వారికే గర్వ కారణంగా నిలిచిన




చిత్రంలో - సీనియర్ సముద్రాల రచించగా గాలి పెంచెలనరసింహారావు సంగీత దర్శకత్వంలో రూపుదిద్దుకున్న స్వరరచనలలో కొన్నింటిని గత సంచికలో ఉదహరించగా మిగిలినవి ఈ సంచికలో...

వీణా..... పాడవే....రాగమయీ
పాడవే రాగమయీ వీణా పాడవే రాగమయీ
లంకానాధుని రమణీయగాథ ॥లంకా॥
పాడవే రాగమయీ
రాగములో అనురాగము కలిపి ॥రాగము॥
శివయోగములో భోగము తెలిపి
జగమే ప్రేమకు నెలవుగచేసే ॥జగమే॥
రసికావతంసుని రమణీయగాథ ॥పాడవే॥
వీణా మాధురి శివుమురిపించి ॥వీణా॥
విక్రమధాటిని అమరులనుంచి
కనుల సైగల నా మనసేలే ॥కనుల॥
కైకసి సూనుని కమనీయగాథ
పాడవే రాగమయీ వీణా పాడవే రాగమయీ
రాగమయీ... రాగమయీ



'వీణా పాడవే రాగమయీ' పాటను సుశీల ఆలపించగా బి.సరోజాదేవి,ఎన్.టి.ఆర్. అభినయించారు. ఈ పాటకు దేశ్‌రాగం ఆధారం. కథాగమనం, పాత్రల పరిచయం, వాటి పూర్వాపరాలు అన్నీ సాహిత్యం ద్వారా తెలియజేయడం ఈ పాట ప్రత్యేకత. ఇక దేశ్ రాగాన్ని గాలి పెంచెలనరసింహారావు ఎంత చక్కగా మలుచుకున్నారంటే - ఆరాగంలో గల జీవస్వరాలన్నిటినీ అమృతధారలు ఒలికించే విధంగా పిండుకొని పాటంతా పరిచారాయన. సుశీల కూడా అంతే రసస్ఫూర్తితో పాడి రక్తికట్టించన ఈ గీతం గాయనీమణులుగా రాణిద్దామనుకునే వారికి అతిసులువుగా లభించే వరం.

అఖిల జగతి సృష్టిజేసి
ఆడి పాడి అంతలోనే ॥అఖిల॥
ఆపెదవు బొమ్మలాట
నటన సూత్రధారీ!
దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా



హిందోళ రాగంలో స్వరపరచబడిన ఈ స్వరఖండికను పిబీ శ్రీనివాస్ ఆలపించగా కాంతారావుపై చిత్రీకరించారు. ఈ ఖండికలకు మకుట వాక్యమైన 'దేవదేవ పరంధామ నీలమేఘశ్యామా'ను కూడా చివరన హిందోళ రాగంతో కలిపి ఆలపించటం జరిగింది.

సరసాల జవరాలను నేనేగదా
మురిపాలు వెలబోయు భామలలోన ॥సరసా॥
బంగారు రంగారు మైజిగిలోన
పొంగారు వయసూ పొంకములోన
సంగీత నాట్యాల నైపుణిలోన
నా సాటి నెరజాణ కనరాదుగా ॥సరసా॥
మగువల నొల్లని మునియైనా
నా నగుమొగమును గన చేజాచడా
యాగము యోగము దానములన్నీ
నా బిగికౌగిలి సుఖమునకేగా ॥సరసా॥



ఈ పాటను పి.లీల పాడగా రంభ పాత్రను అభినయించిన నాట్యతార కుచలకుమారి నర్తించింది. సన్నివేశ ప్రాధాన్యంగా ఎన్.టి.ఆర్. కూడా కనిపిస్తారు. శాస్త్రబద్ధమైన కళ్యాణి రాగానికి ఈ పాట ఓ చక్కని ఉదాహరణ. ఈ పాటను ఇంటర్‌లూడ్స్‌తో సహా గుర్తుంచుకోగలిగిన వారికి కళ్యాణి రాగం మీద మంచి అవగాహన, పట్టు లభించే అవకాశం చాలా వుంది. 'మై జిగి' (శరీర కాంతి) వంటి పద ప్రయోగాలను గమనించడం ఈతరం వారికి చాలా అవసరం. ఒక విధంగా చెప్పాలంటే అలనాటి పౌరాణిక చిత్రాలలోని పాటల సాహిత్యాన్ని ప్రతి పదార్థ తాత్పర్య సహితంగా పూర్వాపరాలతో సహా ఒంటపట్టించుకునేట్టు మనం చెయ్యకపోవటం నుంచే ఇవాళ్టి యువతకు తెలుగు భాష గురించి ఇంత మొత్తుకోవలసిన అగత్యం ఏర్పడుతోందేమోననిపిస్తుంది.

నెలత యిటువంటి నీమాట నీదుపాట
నీవలపు చూపు నీ నడల్ నెమ్మి వినగ కనగా
దొరకునే సామాన్య కాముకునకు
నీ వలపు చూపు దొరకునే
బహు తపంబులు గావించి బడయకున్న



ఈ పద్యాన్ని అఠాణా రాగంలో స్వరపరిచారు. ఈ రాగంలో గల పాటల గురించి చెప్పుకోవాలంటే 'శ్రీకృష్ణ విజయం'లో జోహారు శిఖిపించమౌళి పాట తొలి భాగాన్ని, 'సీతయ్య'లోని 'ఒక్క మగాడు' పాటలో 'సుగుణాల రాముడు సమరాన భీముడు' అనే వాక్యాన్ని ఉదహరించాలి. రెండింటినీ గుర్తు చేసుకుంటూ ఈ పద్యాన్ని కూడా ఆలపిస్తూ పోతే అఠాణా రాగం సొగసులన్నీ అవగతమవుతాయి. ఈ పద్యాన్ని ఘంటసాల పాడగా ఎన్.టి.ఆర్., కుచలకుమారి అభినయించారు. ఈ పద్యం అర్థాన్ని సంపూర్ణంగా తెలుసుకుని సినిమా చూస్తే ఎన్.టి.ఆర్. ఎంత గొప్ప నటుడో, పురాణాలపై ఎంతటి అవగాహన గల కళాకారుడో అర్థమవుతుంది.

జనకుండు సుతుడును జన్మంబు జేసిన
వనితా వారేమి కావలయు నీకు
అన్నదమ్ములు సోమయాజులై వెలసిన
లలనా వారేమి కావలయు నీకు
బావయు మరదియు బవరాన గూలిన
చెలువా వారేమి కావలయు నీకు
అల్లుండు మామయు అనిత్రెళ్ళ వచ్చిన
పొలతీ వారేమి కావలయు నీకు
వావి వరుసలు గణియింప వచ్చితేని
పడతీ మాతోడ మాటాడ వశమె నీకు
చాలు ఇక చాలు వెర్రి వాదాలు మాని
వగలు దీరిచి ఏలవే చిగురుబోణీ



ఈ పద్యాన్ని ఘంటసాల ఆలపించగా ఎన్.టి.ఆర్., కుచలకుమారి అభినయించారు. శంకరాభరణ రాగం ఈ పద్యానికి ఆధారం. ముందు ఉదహరించిన పద్యానికి ఉపయోగించిన విశ్లేషణనే ఈ పద్యానికీ అన్వయించుకోవచ్చు. ఈ పద్యాన్ని అర్థం చేసుకోవడం కన్నా అవగాహన చేసుకోవడం ముఖ్యం. అందుకు మానసిక పరిపక్వత ఎంతో కావాలి. వక్ర దృష్టితో ఈ పద్యాన్ని చూస్తే సమాజానికి హానిచేసిన వాళ్ళమవుతాం. అంతటి శక్తి గల ఈ పద్యాన్ని - అసలు ఆ పోకడలు, ఆ అనుమానాలు ఏవీ సామాన్య ప్రేక్షకుడి మనసుని ఆవహించకుండా పవిత్రంగా, నర్మగర్భంగా తెరపై ఆవిష్కరించడంలో ఎన్.టి.ఆర్., సముద్రాల, ఘంటసాల చూపిన స్థితప్రజ్ఞతకు హైందవ సంస్కృతి సంప్రదాయాల పట్ల, పురాణాల పట్ల గౌరవం వున్న ప్రతి తెలుగు వారూ నమోవాకాలు అర్పించవలసిందే.

పరమ పురుష నీదు కరుణ
పరుగుదీయ కుంతివాడు
మాతయౌను గొడ్రాలే
నటన సూత్రధారీ
దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా





మోహన రాగంలో స్వరపరచిన ఈ ఖండికను కూడా పిబీ శ్రీనివాసే ఆలపించారు. కాంతారావే అభినయించారు. సినిమాలో మూడు భాగాలుగా వచ్చిన ఈ ఖండికల్ని కలిపి సమర్ధవంతంగా ఆలపించగలిస్తే రాగమాలికను ఆవిష్కరించడంలో గాత్రాన్ని ఎలా అదుపులో ఉంచుకోవాలో తెలుస్తుంది.

వేయికన్నులు చాలవుగా
కన వేయి కన్నులు చాలవుగా
వేడుకైన మాసీతనుచూడ ॥2॥ ॥వేయి॥
జనకుని యింటను చందమామలా ॥2॥
దినమొక వన్నెగ వర్ధిల్లీ
కన్నవారి కన్నుల చల్లగ ॥2॥
ఆటలనాడే సీతనుచూడ ॥వేయి॥
తూగుటూయలా తోడి చెలులతో ॥2॥
గగన వీధిలో తేలియాడుతూ
వింత వింత పూబంతులాటాలా ॥2॥
వేడుకచూసే సీతను చూడ ॥వేయి॥





పి.లీల పాడిన ఈ పాటను సీతగా నటించిన గీతాంజలి ప్రధాన పాత్రధారిణిగా చిత్రీకరించారు. కస్తూరి శివరావు, మిక్కిలినేని, ఛాయాదేవి సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. సంగీత పరంగా ఈ పాటలో గాలి పెంచలవారు చాలా మంచి ప్రయోగం చేశారు. కమాచ్, దేశ్, శంకరాభరణ రాగాలను అతి నైపుణ్యంగా ప్రయోగించారీ పాటలో. ఈ రాగాల స్వరాలను తీసుకుని మిశ్రమం చేస్తూ - పాడే వారికి సనాయాసంగా ఉండేలా పాటను మలచటంలో గాలి పెంచలవారి మేథో సంపద ఎన్నదగినది, మిన్నయైది.

మాయసీత : ఓ సుకుమార నినుగని మురిసితిరా
నిను వలచేర రారా ఏలరా ॥ఓ సుకుమార॥
మాయసీత : కనులా నిన్ను చూచిన నాడే ॥2॥
మనసూ నీదై పోయెనురా ॥2॥
శివునీ విల్లూ విరచిన నాడు
నేనే కానుక నైతినిరా సుకుమార ॥ఓ సుకుమార॥
మాయరామ : తొలి నీ మోము చూచిననాడే ॥2॥
నాలో మోహము రేగినదే ॥2॥
తాళగలేనే నీ ఎడబాటూ వలపులు తీరిచి ఏలవే బేలా
సుకుమారి ఓ సుకుమారి నినుగన మనసగునే
నా వగదీర్చి ఏలవే జానకీ ఓ సుకుమారీ
మాయసీత : మనసాకటాయె మమతలు తెలిసెనుగా
మాయరామ : మది చిగురించు వాంఛా తీరునుగా ॥2॥






ఈ పాటను లీల, ఘంటసాల పాడగా హరనాథ్ (రాముడు) గీతాంజలి (సీత) అభినయించారు. రావణుడు రాముని రూపంలో వచ్చి సీతని కలవాలనుకుంటే - సీత రూపంలో శూర్పణఖ వచ్చి రాముని కలవాలనుకుంటుంది. తెరపై కనిపించేది రాముడు, సీత అయినా - వారు రావణుడు, శూర్పణఖ అని ప్రేక్షకుడికి అర్థమయ్యేలా కల్పించిన సరదా సన్నివేశంలో వచ్చే గీతమిది. శూర్పణఖ పాత్రధారిణి పేరు స్వర్ణ. ఈమె గీతాంజలి సోదరి. ఈ పాటకు హిందుస్తానీ పీలూ రాగచ్ఛాయలలో ఉండే కాపీ రాగాన్ని ఉపయోగించారు. లలిత సంగీతానికి శాస్త్రీయత కన్న రసభావాలే ప్రధానం కనుక - ఇక్కడ సన్నివేశం కూడా అంత శాస్త్ర సమ్మతమైనది కాకపోవడం చేత కాపీ, పీలూలని శాస్త్రబద్ధంగా వాడుకోలేదు సరికదా ఇంటర్‌లూడ్స్‌లో దేశ్ రాగచ్ఛాయలని, కొంత జానపద ధోరణిని కూడా అనుసరించారు. నిజానికి అక్కడున్నది మాయారూపాలలో ఉన్న రాక్షసులు. వారు చేసే పని నాగరికం కాదు. అంచేత రాగ ప్రయోగాలు కూడా అంత శాస్త్రీయంగా కాకుండా కాస్త మిశ్రమం పొందుతూ చెందుతూ ఉపయోగించారని సరదాగా అన్వయించుకోవచ్చు.

జగదేక మాతా గౌరీ
కరుణించవే భవానీ కరుణించవే ॥జగ॥
ఘనమౌ శివుని ధనువు వంచి ॥ఘన॥
జనకుని కోరిక తీరుట జేసి
మనసిజ మోహను రఘుకులేశుని ॥మన॥
స్వామిని జయవే మంగళ గౌరి
కరుణించవే భవాని కరుణించవే
నీ పదములను, లంకాపతిని ॥నీ పద॥
నా పెన్నిధిగా నమ్ముకొంటినే
నా పతికాపద కలుగనీయక ॥నా పతి॥
కాపాడవే మంగళ గౌరీ
కరుణంచవే భవానీ కరుణించవే భవానీ ॥జగ॥





ఈ పాటను సుశీల గానం చేయగా గీతాంజలి (అప్పట్లో ఆమె పేరు మణి),బి.సరోజాదేవి అభినయించారు. ఈ పాటకు సారంగ రాగం ఆధారం. కొన్ని కొన్ని పాటలు సినిమా రూపేణా వచ్చినా తర్వాత మన సంప్రదాయంలో అవి కూడా ఓ భాగమై పోవటం జరిగింది. అటువంటి పాటలలో ఈ పాటను పేర్కొనాలి. స్త్రీల పండగలకు, పూజలకు సంబంధించిన పేరంటాలలో ఈ నాటికీ ఈ పాటను యధావిధిగా, యధాతథంగా పాడటం జరుగుతోంది. ఆ సంప్రదాయం ఎంత పటిష్టంగా కొనసాగుతోందంటే అర్థాన్ని కూడా పట్టించుకోకుండా తు.చ. తప్పకుండా పాడటం మనం చాలా ఇళ్ళల్లో గమనించవచ్చు. ముఖ్యంగా రెండవ చరణంలో వచ్చే 'నీ పదములను, లంకాపతిని నా పెన్నిధిగా నమ్ముకుంటినే' అనే వాక్యాన్ని అలా యధతాధంగా పాడితే మరీ అనుచితంగా ఉంటుందన్న సంగతి కూడా మనవాళ్ళ మనసులకు తట్టటం లేదంటే ఆతర్వాత వచ్చే 'నా పతికాపద కలుగ నీయక కాపాడగదే మంగళ గౌరీ ' అనే వాక్యాల ప్రభావం లోనూ, ప్రవాహంలోనూ ఎంతగా మునిగిపోతున్నారో గమనించాలి. అది ఒక విధంగా పాట సాధించిన విజయమే.

సీతారాముల కళ్యాణము చూతము రారండి
శ్రీ సీతారాముల కళ్యాణము చూతము రారండి
చూచువారలకు చూడముచ్చటట
పుణ్యపురుషులకు ధన్యభాగ్యమట
భక్తి యుక్తులకు ముక్తి ప్రదమట..... ॥భక్తి॥
సురలును మునులును చూడవత్తురట
కళ్యాణము చూతము రారండి
దుర్జన కోటిని దర్పమడంచగ
సజ్జన కోటిని సంరక్షింపగ ॥దుర్జన॥
ధారుణి శాంతిని స్థాపన చేయగ..... ॥ధారుణి॥
నరుడై పుట్టిన పురుషోత్తముని
కళ్యాణము చూతము రారండి
దశరధ రాజు సుతుడై వెలసి
కౌశిక యాగము రక్షణ జేసి ॥దశ॥
జనకుని సభలో హరువిలు విరచి.... ॥జన॥
జానకి మనసు గెలిచిన రాముని
కళ్యాణము చూతము రారండి ॥శ్రీ సీతా॥
సిరి కళ్యాణపు బొట్టును పెట్టి ॥బొట్టును॥
మణి బాసికమును నుదుటను కట్టి ॥నుదుటను॥
పారాణిని పాదాలకు పెట్టి ॥పారాణి॥
పెళ్ళి కూతురై వెలసిన సీతా
కళ్యాణము చూతము రారండి ॥శ్రీ సీతా॥
సంపగి నూనెను కురులను దువ్వి ॥కురులకు॥
సొంపుగ కస్తూరి నామము దీర్చి ॥నామము॥
చెంప జవాది చుక్కను బెట్టి.... ॥ చెంప॥
పెండ్లి కొడుకై వెలసిన రాముని
కళ్యాణము చూతము రారండి ॥శ్రీ సీతా॥
జానకి దోసిట కెంపుల ప్రోగై ॥కెంపుల॥
రాముని దోసిట నీలపు రాశై ॥నీలవు॥
ఆణి ముత్యములు తలంబ్రాలుగా..... ॥ఆణి॥
శిరముల మెరిసిన సీతారాముల
కళ్యాణము చూతము రారండి ॥శ్రీ సీతా॥



సుశీల బృందంతో కలిసి పాడిన ఈ పాటని తెలుగు వారి సంప్రదాయ జీవనంపై అఖండ విజయాన్ని సాధించిన పాటగా చెప్పుకోవచ్చు. తెలుగు వారింట ఈ పాటలేని పెళ్ళి పందిరి లేదు. ఎంత కష్టమైనా సరే ఈపాటను తెప్పించి ఉపయోగించాల్సిందే. లేకుంటే అది అశుభమేమోనన్న సెంటిమెంట్ కూడా కొన్ని కొన్ని గ్రామాలలో ఉంది. 'పదికొంపలు లేని పల్లెనైనను రామభజన మందిరమొండు వరలు గాత' అన్నట్టు ఈ పాట లేని రాముని కోవెల కూడా ఆంధ్రదేశంలో లేదనే చెప్పాలి. పూర్తిగా మధ్యమావతి రాగంపై సాగిన ఈ పాటలో 'ఆణిముత్యములు తలంబ్రాలుగా శిరముల మెరసిన సీతారాముల కళ్యాణము చూతము రారండి' తరువాత వాద్యసంగీతంగా వచ్చే 'ఆనందమానందమాయెనే' ఒక్కటే ఆనంద భైరవి రాగంలో ఉంటుంది. సీతారాముల పాత్రలను ధరించిన గీతాంజలి, హరనాద్ పైన ప్రధానంగాను,చిత్రంలో గల మిగిలిన పాత్రధారులందరి పైన అవసరమైన మేరకూ ఈ పాటను చిత్రీకరించారు.

ఈ 'సీతారామ కళ్యాణం' చిత్రానికి సంబంధించి నిష్టతో కూడిన కళావిష్కరణను ఆద్యంతం గమనించవచ్చు. ఇక తెరపై కనిపించని సంఘటన ఒకటుంది, చిత్రంలోని యజ్ఞానికి సంబంధించిన ఒక సన్నివేశంలో నిజమైన ఆవు నెయ్యినే తెప్పించి వాడారు ఎన్.టి.ఆర్.. ఆనేతి వాసనతో సెట్ అంతా ఘుమ ఘుమలాడిపోయింది. అందరి ముఖంలోనూ ఆశ్చర్యాన్ని గమనించి"ఇది హౌస్ కౌస్ ఘీ బ్రదర్" అని అన్నారట ఎన్.టి.ఆర్. 'మనంటి పాడి ఆవుల పాల నుంచి వచ్చిన నేయి' అని చెప్పటానికి ఎన్.టి.ఆర్. ఆనాడు వాడిన "హౌస్ కౌస్ ఘీ బ్రదర్' అనే ప్రయోగాన్ని ఇప్పటికీ సినిపరిశ్రమకు చెందిన కొందరు ప్రముఖులు- తమ ఇంటి విందు భోజనాలలోనెయ్యి వడ్డించేటప్పుడు తమాషాగా గుర్తు చేసుకుంటుంటారు. ◆

రచన: ఆత్రేయ పాడినవారు : ఘంటసాల, పిఠాపురం & కోరస్

గోపి : ఓ...మల్లయ్యగారి ఎల్లయ్యగారి కల్లబొల్లి బుల్లెయ్యా
అయ్యా బుల్లెయ్యా నీ అవతారాలు ఎన్నయ్యో...
గట్టులు కొట్టి పొలం కలుపుకుంటాడు......
బోడి : ఒక బుల్లెయ్యా.......
గోపి : పొట్టలు కొట్టి దినం గడుపుకుంటాడు
బోడి : ఒక ఎల్లయ్యా...
గోపి : ఓ...... చిన్నవాళ్ళ రెక్కల కష్టం.....యిక్కడ దోస్తాడు....
బోడి : ఓ హెూ హెూ హెూ.....
గోపి : అ బుల్లెయ్యే...... పెద్దవాళ్ళకు కట్టలు కట్టలు అక్కడ యిస్తాడు.
కోరస్ : బుల్లెయ్యా ....అక్కడ యిస్తాడు...... ॥ఓ మల్లయ్య॥
గోపి : ప్రతి ఒకడూ తినమరిగినవాడూ.....
ప్రజలపేరే చెబుతూంటాడు.
బోడి : వహ....వ.....వహ.....వ.....వారేవా......
గోపి : నిలదీసి ....నీ ప్రజలెవరెంటే - నిన్నూ కాస్త తినమంటాడు
దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని దొరలై పోతుంటే
వాటా దొరకని వాడు వేరే పార్టీ పెడతాడు....ఓ
అసలు పార్టీ నాదీ నాదని-వాళ్ళల్లరి పడుతూంటే.....
గోపి : గోడమీద పిల్లిలాగా బుల్లెయ్యుంటాడు
బోడి : అహ! కొట్టుకు తింటాడు
కోరస్ : హెయ్....హెయ్.....హెయ్.....
గోపి : లింగం మింగిన బుల్లెయ్యా -గుడిని మింగేదెపుడయ్యా?
కోరస్ : మింగ్... మింగ్......మింగ్..... మింగ్......
గోపి : గుడిని లింగాన్ని గుటుకున మింగే-
మొనగాడే నీ- మొగుడయ్యా ॥ఓ మల్లయ్య॥
గోపి : క...క...క....క...కల్లయ్యా.
కోరస్ : బు...బు.....బు......బు......బుల్లెయ్యా
బోడి : కల్లయ్యా ....బుల్లెయ్యా
కోరస్ : కల్లబొల్లి ....బుల్లెయ్యా....ఊఁఊ......ఇయ్య......

రచన: ఆత్రేయ గానం : ఘంటసాల, పి.సుశీల, ఎస్. జానకి,బృందం

రాధ : నల్లవాడే అమ్మమ్మొ అల్లరి పిల్లవాడే
నిర్మల : చిన్నవాడే అయ్యయ్యొ మనచేత చిక్కినాడే... ॥నల్లవాడే॥
గోపి : ఓ...లమ్మి .....చిన్నవాడనుకొని చేరదీస్తే
ముంచుతాడే ....కొంప ముంచుతాడే
రాధ : సున్నమైన వెన్నలా మింగుతాడే
నిర్మల : చద్ది నీళ్లైన చల్లలా తాగుతాడే
గోపి : వెన్న ముద్దకని వెనకెనక వస్తాడే
అమ్మాయిలు : వచ్చాడే ...వచ్చాడే.....వచ్చాడే
అబ్బాయిలు : యిచ్చాడే....యిచ్చాడే.....యిచ్చాడే..
గోపి : వెచ్చంగ ఒకటిచ్చి వెక్కిరించి పోతాడే....॥నల్లవాడే॥
నిర్మల : నెమలి ఈక పెట్టవే...
అబ్బాయిలు : డుడుం...డుడుం...డుం.
నిర్మల : మురళి చేతికివ్వవే
అమ్మాయిలు : చించాం....చించాం......
గోపి : అబ్బో వాయిస్తాడిప్పుడు వుండవే....
వదలగొడతాడు తుప్పులూ
చూడు..చూడు....చూడవే..... ॥నల్లవాడే॥
నిర్మల : ఆ ముద్దు కృష్ణుడే యీ మొద్దుగుమ్మడే
రాధ : ఆల మంద ఎక్కడే - కోతిమూక వున్నదే
గోపి : ఆనాడు నాకున్న ఆరువేల భామల్లో మీరిద్దరెవ్వరు?
మీలో నా ముద్దుగుమ్మ ఎవ్వరు?
నువ్వా నా ముద్దుగుమ్మా?
నిర్మల : ఆఁ
గోపి : అయితే ఓ ముద్దు యిమ్మా
రాధ : ఆహా...
నిర్మల : ఇవ్వనా... ఇవ్వనా?
రాధ : ఇచ్చింది చాలునా?
రాధ నిర్మల : ఓ హెూ హెూ .... కృష్ణుడూ.....
ఓ ముద్దు గుమ్మడూ... ॥నల్లవాడే॥
గోపి : ఓలమ్మి ....చిన్న వాడనుకొని చేరదీస్తే
ముంచుతాడే కొంప ముంచుతాడే......

రచన: ఆత్రేయ గానం : ఘంటసాల, పి.సుశీల

గోపి : అరెరెరెరె......ఏట్టాగో వున్నాది ఓలమ్మి
ఏటేటో అవుతోందే చిన్నమ్మి..... ॥ఓరినీ...ఎట్టాగో॥
రాధ : అరెరెరెరె .....అట్టాగే ఉంటాది ఓరబ్బీ
ఏటేటో అవుతాది చిన్నబ్బీ....... ॥ఓరినీ ..అట్టాగే॥
గోపి : మొలలోతు నీళ్ళల్లో మొగ్గల్లే నువ్వుంటే
నీ ఒంటి నిగనిగతో నీళ్ళు మెరుస్తుంటే
పొదచాటునా నేను మాటేసి చూస్తుంటే
నీవు తానాలు ఆడావు.....ఓలమ్మి
నా పాణాలు తీశావే చిన్నమ్మి..... ॥అరెరె...ఎట్టాగో...॥
మొగ్గలు ఒక్కొక్క రేకిప్పుకున్నట్టు
నీ చక్కదనాలు నే నొకటొకటి చూశాను.,,,,
జడచూస్తే.....
రాధ : ఊఁ....
గోపి : మెడ చూస్తే
రాధ : ఆహఁ...
గోపి : జబ్బల నునుపు చూస్తే
రాధ : హాఁ..
గోపి : కనరాని ఒంపులన్నీ ఓలమ్మి....
కసి కసిగా చూస్తినే చిన్నమ్మి...... ॥అరెరె...అట్టాగో...॥
గోపి : తడిసి నీ తెల్లకోక తపతపా మన్నది
తడబడినా నా గడుసు మనసు దడా దడా మన్నది
: ఓరి నీ.....
కళ్ళు మూసుకొస్తినని గొల్లున నువు నవ్వితే.....
: (నవ్వు)
: చురకల్లె తగిలింది ఓలమ్మి -
ఉడుక్కెక్కి పోయిందే చిన్నమ్మి........ ॥ అరెరె...ఎట్టాగో...॥
: అరెరెరెరె .....అట్టాగే ఉంటాది ఓరబ్బీ
ఏటేటో అవుతుంది చిన్నబ్బీ.......

రచన: ఆత్రేయ గానం : ఘంటసాల, పి.సుశీల

రాధ : చేతిలో చెయ్యేసి చెప్పు బావా
చేసుకున్న బాసలు చెరిగి పోవనీ మరచిపోనని....॥చేతిలో॥
గోపి : చేతిలో చెయ్యేసి చెప్పు రాధా
చెప్పుకున్న వూసులు మాసిపోవనీ మారిపోవని ॥చేతిలో॥
రాధ : పాడుకున్న పాటలు పాతబడిపోవనీ
చిలిపిగ ఆడుకున్న ఆటలకు అలుపు రానివ్వననీ
గోపి : పడుచుగుండె బిగువులు సడిలిపోనివ్వనని
దుడుకుగ పురికిన పరువానికి ఉడుకు తగ్గిపోదని ॥చేతిలో॥
రాధ : కన్నెగా కన్నకలలు కథలుగా చెప్పాలి
గోపి : మనకథ కలకాలం చెప్పినా కంచికెళ్ళకుండాలి........
రాధ : మనజంట జంటలకే కన్నుకుట్టుకావాలి
గోపి : ఇంక ఒంటరిగా వున్నవాళ్ళు
జంటలైపోవాలి.......... ॥చేతిలో॥

రచన: ఆత్రేయ  గానం : ఘంటసాల, పి.సుశీల

గోపి : పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్లోయ్
నీ పైటకొంగు జారిందే గడుసు పిల్లా....... ॥పచ్చగడ్డి॥
రాధ : కొంగు జారితేముంది గడుసు పిల్లోడా
నీ గుండె చిక్కుకుందేమో చూడు బుల్లోడా ॥కొంగు॥
గోపి : కొప్పులోన బంతిపూలు గుసుస్తున్నవీ
చెప్పలేని వూసులేవో చెప్పుతున్నవీ
రాధ : వూసులన్నీ వింటివా వూరుకోవనీ
ఆశలై, బాసలై అంటుకొంటవి.... గోపి: ॥పచ్చగడ్డి॥
గోపి : వరిచేను కోతకొచ్చి వంగుతున్నది
వంపులన్నీ వయసొచ్చి పొంగుతున్నవి
రాధ : వయసు తోటి మనసేమో పోరుతున్నది
వలపులోనే రెండిటికి ఒద్దికున్నది...... గోపి: ॥పచ్చగడ్డి॥
గోపి : కొడవలితో లేత గడ్డి కోసుకొంటివి
కొంటె చూపుతో - గుండె దూసుకొంటివి.......
రాధ : గడ్డిమోపు తలపైన మోసుకొస్తిని
గడుసువాడ్ని తలపుల్లో దాచుకొంటిని....
గోపి : పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్లోయ్
నీ పైటకొంగు జారిందే గడుసు పిల్లా.......
రాధ : కొంగు జారితేముంది గడుసు పిల్లోడా
నీ గుండె చిక్కుకుందేమో చూడు బుల్లోడా

రచన: ఆత్రేయ  గానం : ఘంటసాల,బృందం

బోడి : ఓ...... మల్లయ్యగారి ఎల్లయ్యగారి ....బుల్లెమ్మా
బుల్లెయ్యగారి చెల్లెమ్మా.....
నీపురాణమంతా బుఱ్ఱకథగా చెబుతామమ్మా......
వినరా.....బుల్లెమ్మా వీరగాథలు వీనులవిందుగా..... ॥వినరా॥
బోడి : బుల్లెమ్మంటే పల్లెటూళ్ళలో ఎల్లరెరిగిన యిల్లాలండి
కోరస్ : తందానా.....తాన....... ॥వినరా॥
బోడి : పిల్లికి బిచ్చం పెట్టని తల్లి
కోరస్ : బుల్లెమ్మా
బోడి : ఎంగిలి చేత్తో కాకిని తోలని
కోరస్ : బుల్లెమ్మా
బోడి : తవుడూ, చిట్టూ, ధాన్యం, గీన్యం ఊళ్ళో అమ్మి
పాలు, పెరుగు, వెన్నా, నెయ్యి బస్తీ కమ్మి
కడుగు నీళ్ళే మొగుడి ముఖాన కొడతావమ్మా
ఒకడు : అయ్యో......
బోడి : కడుపు కట్టి..... మూటలు కట్టి దాసావమ్మా.....
కోరస్ : దాస్తావమ్మా ॥హేయ్-వినరా॥
బోడి : చదివేదేమో రామాయణము - సంసారంలో రావణయుద్ధము
పాతివ్రత్యమే పారాయణము
పచ్చడి మెతుకులె భర్తకు దినము
పిల్లామేకా లేరు కదమ్మా...... యీ పిసినిగొట్టు బతుకేం ఖర్మా.....
ఒకడు : నీ ఖర్మా.....
బోడి : హేయ్.....వినరా.....

రచన: ఆత్రేయ  గానం : ఘంటసాల

స్వార్థమే తాండవించు యీ జగతిలోన
మంచి ఇంకనుకలదని మనకు తెలుప
చెలిమి కోసమే త్యాగమ్ము చేసి యిచట
విశ్రమించిన దొక్క పవిత్ర మూర్తి !!!

రచన: ఆత్రేయ  గానం : పి.సుశీల, ఎస్. జానకి

రాధ : నల్లవాడే ....అమ్మమ్మ....అల్లరి పిల్లవాడే
నిర్మల : చిన్నవాడే..... ఓయమ్మ..రాధకే చిక్కనాడే
రాధ : లేదమ్మ లేదు ..రుక్మిణికే దక్కినాడే ॥నల్లవాడే॥
నిర్మల : వెన్నవంటి మనసున్న చిన్నవాడే
రాధ : చిన్ననాటినుండి నువ్వుకోరుకున్నవాడే......
నిర్మల : ప్రేమకే బానిసై పోతాడే
రాధ : కాదమ్మ- భక్తికే దాసుడై వుంటాడే ॥నల్లవాడే॥
రాధ : నువ్వు వావి వరస వున్నదానివి
నిర్మల : నువ్వు వలపు దోచుకున్న దానివీ
మనసిచ్చి మాట పుచ్చుకొంటివి -
నీ మనసిచ్చి మాట పుచ్చుకొంటివి -
రాధ : మంచితనముతో - నువ్వు గెలుచుకొంటివీ ॥నల్లవాడే॥
రాధాకృష్ణులు కథలేనమ్మా వారు ఎన్నడూ అలుమగలు కాలేదమ్మా....
నిర్మల : రాధాకృష్ణుల ప్రేమే పవిత్రము లోకానికే అది ఆదర్శము
రాధ : గోపాల బాలుడూ
నిర్మల : నీ ప్రేమ లోలుడూ-గోపాల కృష్ణుడూ
రాధ : నీపాలి దేవుడు
నిర్మల : వాడునీవాడే
రాధ : కాదు నీవాడే
నిర్మల : కాదు నీవాడే
రాధ : కాదు కాదు-కానే కాడే...
నిర్మల : నల్లవాడే .... అమ్మమ్మ అల్లరి పిల్లవాడే

రచన: ఆత్రేయ  గానం : ఘంటసాల

వెళ్ళిపోతున్నావా..... అమ్మా
యిల్లు విడిచి నన్ను మరచి వెళ్ళిపోతున్నావా? ॥ వెళ్ళిపోతున్నావా॥
నువ్వే అమ్మని అన్నే నాన్నని అల్లారుముద్దుగా పెరిగానే
ఈ లోకం ఎరుగక బాధే తెలియక పసిపాపడిలా పెంచారే....
అమ్మా , ఏమై పోవాలి....? నేనెలా బతకాలి.....? ॥వెళ్ళిపోతున్నావా॥
పంపకాలే తలవంపులనీ రెండు యిళ్ళను కలుపుతాననీ
పెంపకమిచ్చారానాడు ఆ దత్తే నేడు నా దేవుళ్ళను
నడివీధికీ లాగిందమ్మా నవ్వుల పాలు చేసిందమ్మా ॥వెళ్ళిపోతున్నావా॥
ప్రాణం దేహం విడిపోతున్నవి పాలమనసూ కన్నీరైనది
ఎవరో పెట్టిన అనలం రగిలీ యిందరి మమతలు బలికోరినదీ
అమ్మా ఏమై పోవాలి నేనింకెలా బతకాలి ఇంకెలాబతకాలి....?

రచన: ఆత్రేయ  గానం : పి.సుశీల

చేతిలో చెయ్యేసి చెప్పుబావా
చేసుకున్న బాసలు చెప్పుకున్న వూసులు
చెరిపివేస్తావని... మరిచి పోతానని...... ॥చేతిలో॥
పాడుకున్న పాటలు పాతవనీ వూరుకో..ఆ
మాటలన్నీ మాపేసి కొత్తపాట పాడుకో..... ॥చేతిలో॥
మాట తప్పిపోయినా..... మనిషి బ తికితే చాలు... మన
మమత చంపుకున్న -ఒక మంచి మిగిలితే చాలు...... ॥చేతిలో॥
తెలియక మనసిచ్చినా
తెలిసి కుమిలి పోతున్నా మిమ్మ -
కలపమని ముక్కోటి దేవతలను మొక్కుతున్నా.......
చేతిలో చెయ్యేసి చెప్పుబావా
చేసుకున్న బాసలు చెప్పుకున్న వూసులు
చెరిపివేస్తావని... మరిచి పోతానని...... ॥చేతిలో॥

# కథాసంగ్రహం

ఆడుతూ, పాడుతూ, అల్లరిచేస్తూ ఆ వుళ్ళో వారందర్ని ఆడిస్తుండే వాడు గోపి. అందుకే అందరూ 'దసరాబుల్లోడు' అనేవారు. గోపికి కుడిభుజం బోడిబాబు. బుల్లోడికి అమ్మ,నాన్న లేని లోటు లేకుండా, అన్న వాసు, వదిన యశోద, తమ కన్నకూతురు చిట్టికంటే ప్రేమగా పెంచారు. గోపికి చిట్టంటే పంచప్రాణాలు. పొట్టలుకొట్టి బ్రతికే బుల్లెయ్యకు గోపి పేరు వింటేనే భయం. కాని తన ఒక్కగానొక్క కూతురు నిర్మలను గోపీకిచ్చి పెళ్లిచేసి గోపీ ఆస్థినంతా కాజెయ్యాలనుకున్నాడు బుల్లెయ్య. బస్తీ చదువులు చదువుకున్న నిర్మల పల్లెటూరి బుల్లోణ్ని ప్రేమించింది. పెళ్ళి చేసుకోవాలనుకుంది. దురదృష్టవశాత్తూ, గోపీ-రాధల ప్రణయ కలాపాలు నిర్మల కళ్ళబడ్డాయి. మంచి మనసుకల నిర్మల వాళ్ళ ప్రేమకు అడ్డు రాకూడదనుకుంది.

అప్పుడే తనకు కాన్సరనీ తెలిసింది. ఇక నిర్మల కోరుకుందొక్కటే... వారి పెళ్లి తను కన్నుమూసేలోగా జరిగితే చాలనుకుంది.

నిర్మల త్వరలో చచ్చిపోతుందని తెలుసుకున్న బుల్లెయ్య కనీసం ఆస్తికి వారసుడన్నా కలిగితే చాలన్న ఆశతో పెళ్ళికి తొందర పడ్డాడు. రాధ-గోపీల ఆటపాటలు బుల్లెయ్య కళ్లారా చూశాడు, వాళ్ళ ఆట కట్టించాలనుకున్నాడు. గోపీని దత్తుతీసుకున్న బుల్లెయ్య చెల్లమ్మ, బుల్లెమ్మతో వెంటనే గోపీని ఇంటికి తీసుకురావలసిందని, ఇక గోపి వాసు ఇంట్లో వుంటే వాడెందుకు పనికిరాడని చెప్పాడు. ప్రెసిడెంటు భూషయ్య, గయ్యాళి భార్య బుల్లెమ్మకు జడిసి ఏమీ మారు మాట్లాడలేదు. గోపీ పుట్టినరోజు. తను చిన్నప్పుడే దత్తుపోయినట్లు తెలుసుకుని కృంగిపోయాడు. బుల్లెమ్మ ఇంటికి వెళ్లలేనని ఎంతో ప్రాధేయపడ్డాడు. కానీ, వెళ్లక తప్పలేదు. వెళ్లిన మొదలుకొని పచ్చడి మెతుకులు,బండెడు చాకరీ; నేస్తాలతో తిరక్కూడదని అసలు బయటికే వెళ్లడానికి వీల్లేదని బుల్లెమ్మ ఆంక్ష పెట్టింది, మంచానవున్న రాధ తల్లితో బుల్లెయ్య... తన అల్లుడుకాబోతున్న గోపీతో రాధ విచ్చలవిడిగా తిరుగుతోందని, తన కూతురు జీవితానికే అడ్డుతగులుతోందని చెప్పాడు, అది విని రాధ నిర్ఘాంతపోయింది. నిర్మల జీవితానికి తాన్నెడూ అడ్డురానని తల్లిమీద ఒట్టేసి చెప్పింది. తన బిడ్డమీద పడ్డ అపనిందను భరించ లేక, గుండె బ్రద్దలై రాధ తల్లి కన్ను మూసింది. రాధ అనాధకాకుండా అక్క యశోద తనింటికి తీసుకెళ్ళింది. గోపీకిది తెలిసింది. రాధను పల్కరించబోతే అది చూచి బుల్లెమ్మ నానా రభస చేసింది.

గోపీకి రాధను ఎరగా చూపించి తమ ఆస్తింతా కాజెయ్యటానికి వాసూ, యశోదలే పన్నాగం పన్నారంది బుల్లెమ్మ. భరించలేని యీ నిందతో కృంగిపోయాడు వాసు. గోపీ యిక తమ గడపే తొక్కరాదని ఒట్టేశాడు.

బుల్లెమ్మ ఇంట్లో చిన్నాన్న పచ్చడి మెతుకులు తినడం చూడలేని చిట్టి; చిన్నాన్నకు వెన్నముద్దలు తీసుకెళ్లింది. పసిపిల్లనే జాలైనా లేకుండా బుల్లెమ్మ చిట్టిని నేలమీదకు నెట్టింది. దానితో చిట్టికి జ్వరం వచ్చింది. చిన్నాన్ననే కలవరించటం మొదలుపెట్టింది, చిన్నాన్న రాకపోతే చిట్టి బ్రతకదన్నారందరూ. చిట్టిని కాపాడుకోవటం కోసం గోపీ అన్న ఒట్టును కూడా కాదని వాసు ఇంటికి వెళ్ళాడు, దానికి బుల్లెమ్మ అల్లరిచేసి వాళ్లు యీ యింట్లో వుంటే తను బావిలోపడి చస్తానని అంది. 'మా మూలంగా మీరెందుకు చావాలి, మేమేపోతాం' అని యశోద, వాసులు ఇళ్ళు ఖాళీచేశారు. ఎవరు ఆశ్రయం ఇస్తామన్నా వద్దని వాసు సత్రంలో కాపురం పెట్టాడు. వాళ్లను ఖాళీచేయించి, సత్రాన్ని లైబ్రరీగా మార్చమని ప్రెసిడెంటు భూషయ్యను బుల్లెయ్య ఒత్తిడి చేశాడు.

ఆఖరికి....వాసు కాపురం పాలేరు వెంకయ్య గొడ్లచావిట్లో కాపురం పెట్టవల్సి వచ్చింది.

రాధకు ఎవరితోనన్నా పెళ్లి జరిపిస్తే,గోపి తప్పక కూతురును చేసుకుంటాడని ఆలోచించాడు బుల్లెయ్య.

అందుకే రాధకూ, బోడిబాబుకూ పెళ్లి ఖాయం చేయించాడు. యీ విషయం తెల్సిన నిర్మల గోపీని పెళ్లాడమని బ్రతిమి లాడింది, కాని రాధ నిరాకరించింది. గోపీతో రాధ పెళ్ళి చూడాలని బ్రతికున్న నిర్మల, రాధకు ఇంకొకరితో పెళ్ళి జరగకముందే తాను చనిపోవాలనుకున్నది. అందుకై అపత్యాలు చేసి, తినగూడనివన్నీ తింది. అప్పుడైనా గోపీ రాధల పెళ్లి జరుగుతుందని ఆశించింది.

రాధ ఇంకొకరిని పెళ్లాడుతున్నట్లు గోపీకి తెలిసింది, 'ఎందుకిలా చేశావని, రాధను అడిగాడు. 'నిర్మల నిన్నెంతగానో ప్రేమించింది. అంత వ్యాధిలోనూ, నీకోసమే బ్రతికుంది' అంది రాధ. నిర్మల చనిపోవడానికి వీల్లేదని, తాను బ్రతికించుకుంటానని గోపీ వెళ్లాడు. బుల్లెయ్య నిర్మలతో గోపీ పెళ్ళి ఖాయం చేశాడు.

తిరిగి దసరా పండుగ వచ్చింది. అటుగోపి,ఇటు బోడిబాబు, పెళ్లివూరేగింపులు బయలు దేరినవి. ఎలాగైనా గోపీని తప్పించి, రాధతో పెళ్ళి జరిపించాలని బోడిబాబు ప్లాను. అది తెల్సి బుల్లెయ్య రాధ వాళ్ళున్న గొడ్లచావిడికి నిప్పంటించమని తనగూండాలను పంపాడు. నిర్మల తల్లి రమణమ్మద్వారా యీ విషయం తెల్సుకున్న గోపీ వున్న పళంగా పరిగెత్తాడు. నిర్మల...రాధ వాళ్ళను మంటలనుండి తప్పించాలని రక్తం కక్కుంటూ.... అలాగే బయలు దేరింది.

బుల్లెయ్య గుండాలు గోపీని చుట్టుముట్టారు.

మంటలో చిక్కుకున్న వాసు, యశోద చిట్టి రాధలను గోపి రక్షించి బుల్లెయ్య పంపిన గూండాల ఆట కట్టించాడు.

రక్తం కక్కుకుంటూ వచ్చిన నిర్మల - రాధ గోపీల చేతులు కలిపి కన్నుమూసింది...

## నటీనటులు

నటసామ్రాట్, పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఎస్.వి.రంగారావు, గుమ్మడి, నాగభూషణం, పద్మనాభం, రావి కొండలరావు, పి. వెంకటేశ్వరరావు, ఆనందమోహన్, మాష్టర్ ఆదినారాయణ, వాణిశ్రీ, చంద్రకళ, అంజలీదేవి, సూర్యకాంతం, ఛాయదేవి, రాధాకుమారి,ఝూన్సీ, బేబిరాణి

## సాంకేతిక నిపుణులు

మాటలు,పాటలు : ఆచార్య ఆత్రేయ
సంగీతం : కె.వి. మహదేవన్
డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ : ఎస్. వెంకటరత్నం, W.I.C.A
నృత్యాలు : బి. హీరాలాల్, కెమేరా : ఎ.ఆర్.కె.మూర్తి,
ఎడిటింగ్ : అక్కినేని సంజీవరావు, A.F.E., కళ : జి.వి. సుబ్బారావు
మేకప్ : కె. నరసింహారావు, ఆఫీస్ -ఇన్-చార్జి : ఎన్.ఎస్.మూర్తి
ప్రొడక్షన్ కంట్రోలర్ : పి.ఎస్. రెడ్డి, స్టంట్ : రాఘవులు
స్టుడియో : శ్రీసారథి స్టుడియోస్ (హైదరాబాద్)
ప్రాసెసింగ్ & ప్రింటింగ్ : జెమిని కలర్ లబోరేటరీ (మద్రాసు)
క్యాస్టుమ్స్ : బి.నారాయణమూర్తి, ఎం. రామారావు, పబ్లిసిటీ : ఈ శ్వర్
సాంగ్సు రికార్డింగ్ & రీరికార్డింగు:ఎ.ఆర్.స్వామినాధన్ (విజయా గార్డెన్సు
డైలాగ్ రికార్డింగ్ : గోఖలే, (శ్రీ సారథి స్టుడియో (మద్రాసు)
కథ, దర్శక, నిర్మాత : వి.బి. రాజేంద్రప్రసాద్ B.sc.,


రాజేంద్రప్రసాద్


కె.వి.మహదేవన్


ఆత్రేయ





తమ అభినయంతో పాట విలువను పెంచిన అక్కినేని,
రాజ్‌కుమార్ (2002 ఎన్.టి.ఆర్. జాతీయ పురస్కార్ అవార్డు గ్రహీత),
చిరంజీవి, నాగార్జున (2002 ఉత్తమ నటులు)
నందుల్ని, ఆనందాల్ని పంచుకున్న వేళ...



2002 నంది అవార్డులను ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నుండి అందుకుంటున్న బాలు (ఉత్తమ గాయకుడు),
కీరవాణి (ఉత్తమ సంగీత దర్శకుడు), చంద్రబోస్ (ఉత్తమ గీత రచయిత), ఉష (ఉత్తమ గాయని)

RNI Regd.No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No.H-HD-997/2003.



మాస్ట్రో ఇళయరాజా గారి సంగీత దర్శకత్వంలో

మా

# శివపుత్రుడు

DIGITAL dts SOUND

ఎవ్వరికీ అర్థంకాదు

చిత్రం కోసం

'చిరు గాలి వీచెనే చిగురాశ రేపెనే'

అనే ఓ మంచి పాటను పాడిన

ఆర్.పి.పట్నాయక్ గారికి

జన్మదిన శుభాకాంక్షలతో...

బి.సుబ్రహ్మణ్యం

లక్ష్మీగణపతి ఫిలింస్

హైదరాబాద్